

# 'హాసం'

హాస్య-సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

78

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**

'మాస్' చిత్రంలో

నాగార్జున



## హాస్యం















## సంగీతం



'సెంటర్ స్ప్రెడ్' లో
సినిమా పాటల ప్రత్యేకం



**పాత పాటల ప్రత్యేకం**
69 వ పేజీ నుండి 71 వ పేజీ వరకూ






'హాసం' పత్రిక సంతోషం, ఆనందం, హాస్యం కల్గించే విధంగా వుంటుంది. సరసి కార్టూన్లు హ్యూమరస్‌గా వున్నవి. మొగల్ - ఎ- అజమ్ సినిమాలోని పాట గురించి ఒకసారి పత్రికలో విశ్లేషణ చేసారు. దానికి కృతజ్ఞతలు. ఇప్పుడు మరలా కలర్‌లో పూర్తిగా రాబోతుంది. మొత్తం అన్నిపాటలు అర్థాలు వివరిస్తూ స్పెషలుగా ప్రేక్షకులకు ఉపయోగపడునట్లు వ్యాసం ప్రచురించగలరు. ప్రేమతో, కష్టంతో పత్రిక సకాలంలో అందిస్తూ మీరు చేస్తున్న కృషి ప్రశంసనీయము.

**-వి. మోహనబాబు, అవనిగడ్డ.**

'అన్నమయ్య పదభావ దర్శనమ్' పేరు పెట్టి పోటీలో ఎన్నికయిన వాళ్ల పేర్లు ప్రకటించి బహుమతి అందుతుందా లేదా అన్న ఉత్కంఠను భలేగా రేపారు. చివరకు ఎవర్నీ నిరాశకు గురిచేయక 'మంచి కబురుతో' ఆనందింప చేశారు. 'అన్నమయ్య సంకీర్తన వేదనాదం' సి.డి.అందుకున్నాను- కృతజ్ఞతలు. సి.డి.పైన బాలకృష్ణప్రసాద్‌గారి సంతకం చేసుంటే లేదా 'హాసం' ముద్ర పడివున్నా సి.డి.ని ఒక అవార్డులా మిత్రులకు చూపించుకునేవాణ్ణి.

**-కె.వి. రమణ, జైపూర్.**

'హాసం'కు సంపాదకీయం కలికితురాయి. తెలుగు భాషలో ఆంగ్లపదానికి పర్యాయ పదం లేదని తప్పించు కునే బదులు డా॥ సినారె వంటి వారి ద్వారా తెలుసుకొని తెలుగు పత్రికలో ఆంగ్ల పదాన్ని పారద్రోలినది (విజువల్ బ్యూటీ) దృశ్య సౌందర్యం. 'హాసం' యాజమాన్యానికి తెలుగు భాష మీద వున్న శ్రద్ధకి, భక్తికి ఒక మచ్చు తునక.

**-చింతలపాటి వెంకటేశ్వర్లు, విజయవాడ.**

డిసెంబరు 1-15 హాసం సంచికలోని మీ సంపాదకీయం విలక్షణంగా ఉంది. ఈ దృక్కోణంలో_ కూడా ఆలోచించే వారున్నారని మీ వ్యాసం రుజువుచేయడం ఎంతో ఆనందం కలిగించింది. ఈ వ్యాసం చదువుతున్నప్పుడు "ఘంటసాల జయంతి" సంగీత కార్యక్రమం రిహార్సల్‌లో ఉన్నాం. మా కళాకారులందరికి చదివి వినిపించాను. డిసెంబరు 4న జరిగిన సంగీత కార్యక్రమంలో 16 బాగా పరిచితమైన పాటలతో పాటు ఘంటసాల వారు బాణీ చేసిన 9 పాటలను వినిపించాం. .ఇవి హైద్రాబాదులో ఎవరైనా పాడారో లేదో తెలియదు. ఇంతటి విశిష్టమైన సూచన చేసినందుకు ధన్యవాదాలు. ఈ సూచనను సంగీత సంస్థలు స్వీకరిస్తే మరిన్ని కొత్త మాధుర్య కవాటాలు తెరుచుకోగలవని విశ్వసిస్తున్నాను.

**-డా॥ ఎం. పురుషోత్తమాచార్య, నల్గొండ.**

**డి**సెంబరు 1-15 'హాసం' పత్రిక ఎడిటోరియల్‌లో సూచన కనుగుణంగా, ఘంటసాల సంగీతాభిమాని, శ్రీ వై.రోశిరెడ్డి గారు చాలా సంవత్సరాలనుండి, ఎన్నో వ్యయ ప్రయాసల కోర్చి, సేకరించిన అపురూపమైన పాటలు ఆనందమంత .....(బలే బావ), ప్రేమయే జనన మరణలీల..(ఆహుతి), నీ అనురాగమే... (వదినగారి గాజులు), ఓహో రాజసుకుమారా... (రక్తరేఖ), నేనే విరజాజినైతే ...(లక్షమ్మ), కవికలముకు... (టింగ్ రంగా), ఓ సఖా ఓహో సఖా...(సతీ అనసూయ), సురభామిని...(భీమాంజనేయ యుద్ధం), రావే రావె... (కాంభోజరాజు కథ), అడుగో అడుగో.... (బాలసన్యాసమ్మ కథ), నేడే హాయి హాయి ఆనందమంత (నతీసుకన్య) వంటి రసగుళికలను వినిపించి, శ్రోతలను ఆనంద రసాబ్ధిలో ఓలలాడించారు.

**-గంగారపు వెంకట్రావు, సత్తెనపల్లి.**

'హాసం' మీరు పంపిన జి. బాలకృష్ణ ప్రసాద్‌గారి అన్నమయ్య వేదనామం సి.డి. అందుకున్నాను. చాలా థాంక్స్ మీకూ, ఆదిత్యా మ్యూజిక్ వారికి. హాసం ప్రతి సంచికను నూతనత్వంతో తీసుకురావడానికి మీరు చేస్తున్న కృషి అభిలషణీయం. కొత్త శీర్షిక పలకరిస్తే పద్యం, ఆ పాత మధురంలో పరిచయం చేసే సినిమాలు, రఫీ గారి గురించి మృణాళిని గారు రాసే శీర్షిక పుస్తకం చేతిలోకి రాగానే చదివే శీర్షికలు. 'ఆత్మబలం' సినిమా పాటలన్నీ మహదేవన్ గారు మంచి సంగీతంతో అలరించారు. సాహిత్యాన్ని మననం చేసుకుంటూ పాడుకున్నాము. ఇలాగే పత్రిక మమ్మల్ని రంజింప చేయాలని ఆశిస్తూ.

**-పి. దాక్షాయణి, సికింద్రాబాద్.**

ఫైల్ చేసుకునే వాళ్లకి సౌకర్యంగా రఫీ గారి గీతాల పరంపర దిగ్విజయంగా కొనసాగు తున్నందుకు చాల సంతోషం. సందర్భానుసారంగా ఘంటసాలగారి చుక్కల చిత్రం చాలా బావుంది. బాపు (రమణ) జంధ్యాల గార్లకు మీరిస్తున్న ప్రాధాన్యత ఎంతో ముదావహం. పాత పాటల నేపథ్యంలో మాకెన్నో మధుర చిత్రాల పాటలందుతున్నాయి. కృతజ్ఞతలు. నూతనసంవత్సర శుభాకాంక్షలతో

**-నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం.**

'హాసం' వైజాగ్ క్లబ్ నెలనెలా నిర్వహిస్తోన్న కార్యక్రమంలో పాల్గొని రెండోసారి విజేతగా నిల్చినందుకు ఆనందంగా వుంది. నిర్వాహకులు శ్రీవేడామస్తాన్‌రెడ్డి, శ్రీ తాళాభక్తుల ప్రసాద్ గారి క్రమశిక్షణతో కూడిన కార్యక్రమ నిర్వహణ అభినందనీయం. నాదో సలహా. 'హాసం' పత్రికకు సమీక్ష నిమిత్తం వచ్చే క్యాసెట్లు, పుస్తకాలు సంపాదకుల అభినందనలతో క్లబ్ కార్యక్రమాల్లో బహుమతులుగా అందజేస్తే పాఠకులకు, ప్రేక్షకులకు పత్రికకు మధ్య ఆత్మీయతానుబంధాలు బలపడతాయి. చక్కటి కార్యక్రమాలలో ప్రత్యేక అభివృద్ధికి ప్రచారానికి తోడ్పడుతున్న హాసం క్లబ్‌లకు మీ వంతు సహకారాన్ని అందిస్తు విజేతలకు మధురాను భూతిల్ని మిగల్చండి. మీ ద్వారా అందే బహుమతులు అపూర్వ జ్ఞాపికలు.

**-గుండాన జోగారావు, రాయగడ.**

మీరు పంపిన కాంప్లీమెంటరీ కాపీ అందింది.'హాసం' పత్రిక గురించి వ్రాసుకుంటూ పోతుంటే ఎక్కడ ఆపాలో తెలియని పరిస్థితి. ఘంటసాలగారి జయంతి సందర్భంగా వచ్చిన హాసం -అద్భుతంగా ఉంది. కృష్ణశాస్త్రిగారు 'ఒక్కక్షణం' పాటలో' మోయలేని ఈ హాయిని మోయనీ ' అని హాయిని మోయడం ఏంటో తెల్పారు. అలాగే ఘంటసాలగారి స్వరం పలికినంత కుదురుగా ఈ హాయి ఎవరినోటా వలకలేదేమో! ఆయన స్వరం హాయిని తాకిస్తుంది. ఇదంతా ఎందుకు వ్రాసానంటే హాసం చేతికొచ్చిన ప్రతీసారీ ఇదే హాయి అనుభూతి చెందుతోందని మనస్సు. అందుకని. గరికపాటి వారు' పలకరిస్తే పద్యం' లో ఆడవారి అవధానం గురించి చక్కగా తెలియచేసారు.

**-రమణశాస్త్రి, సంగారెడ్డి.**

హాసం 1-15 నవంబర్ 2004 సంచికలో తమ చక్కటి సంపాదకీయంలో చెప్పినట్టు పుస్తక పఠనాసక్తి తెలుగు ప్రజలలో పెంచడానికి ఆ రోజుల్లో ఈసెన్‌బర్గు, ఎమెస్కోవారు ఎంత కృషి చేశారో, అంతే స్థాయిలో పాఠకులలో మంచి సంగీత, సాహిత్యానక్తిని పెంచడానికి ఈ ప్రచండవేగ ప్రపంచంలో 'హాసం' కూడా అంతే కృషి చేస్తోందనిపిస్తోంది. ఎందుకంటే ముఖ్యంగా 'కొమ్మాకొమ్మా కోకిలమ్మా' శీర్షికలో బాలసరస్వతీదేవి గారి గాన విశ్వరూపాన్ని ఇంద్రగంటి జానకీబాల గారు తన అద్భుత వ్యాసంలోని ఒక సందర్భంలో చెప్తూ మంద్రంగా, మెత్తగా, లలితంగా, లాలిత్యంగా, సొగసా, సోయగంగా, భక్తిగా, అనురక్తిగా శ్రోతలను సమ్మోహనం చేస్తుందని ఎంతో చక్కగా అన్నట్టు 'హాసం' కూడా అంతే చక్కగా అంతే సరళంగా పాఠకులను సమ్మోహనం చేస్తోంది.

**-ఆర్.వి.బసవరాజు, హైదరాబాద్.**

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

78

సంపుటి:4 సంచిక:06

16-31 డిసెంబరు 2004

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
K.I.Varaprasad Reddy
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

మిత్రులారా, 15. 12. 2004

రాకూడదనుకున్న రోజు రానే వచ్చింది. హాస్య-సంగీతాభిమానులను 78 సంచికలుగా అలరించి. తెలుగుపత్రికారంగంలో తనకంటూ ఓ స్థానం సంపాదించుకున్న 'హాసం' పక్షపత్రిక ఆఖరి సంచిక ఇది! పక్షపత్రిక అవతారానికి తెరదించేముందు కొన్ని సంగతులు మీతో పంచుకోవాలన్న ప్రయత్నమే ఈ లేఖ!

'హాసం' రూపొందించాలని అనుకున్నప్పుడు మా దృష్టిలో ఇంటర్నెట్ మాత్రమే ఉంది. 2000 సంవత్సరంలో అనేక డాట్‌కామ్‌లు పుట్టుకువస్తున్నపుడు, హాస్య, సంగీతాలను మేళవించి ఓ పోర్టల్ పెడదామన్న ఆలోచనతో మేమీ యజ్ఞాన్ని ఆరంభించాం. అతి కొద్దిరోజుల్లో కేబుల్‌టీవీలా ఇంటర్నెట్‌సైతం ఇంటింటికీ వ్యాపిస్తుందనీ, అప్పుడు హాసం డాట్‌కామ్ ద్వారా సామాన్య కుటుంబాలకు కూడా హాస్యం, సంగీతం చేరతాయని ఆశించాను. శాంతా బయోటెక్నిక్స్ ద్వారా హెపటైటిస్-బి వ్యాక్సిన్‌ను సామాన్యులకు అందుబాటు ధరలో అందించిన అనుభవంతో చక్కటి హాస్య, సంగీతాలను సామాన్యప్రజలకు అందుబాటులో తెచ్చి వారి ఆరోగ్యాలను మరొక విధంగా కాపాడి, వారి రోగనిరోధకశక్తిని ఇంకొకలా పెంచి 'హెల్త్‌కేర్'కు కట్టుబడ్డ మనిషిగా ప్రజలకు గుర్తుండిపోవాలని ఆశించాను.

కానీ అనుకున్న రీతిలో ఇంటర్నెట్ వ్యాప్తి చెందలేదు. మధ్యమాదాయ వర్గాలకు దూరంగానే ఆగిపోయింది. వారిని చేరుకోవాలంటే ప్రింటు వెర్షన్ ఒక్కటే శరణ్యం అనిపించింది. కానీ ప్రింటు వెర్షనంటే మాటలు కాదు. న్యూస్‌ప్రింటు కొరత, ముద్రణావ్యయం, పబ్లిసిటీ, డిస్ట్రిబ్యూషన్ - అడుగడుగునా సమస్యలే! భారీఖర్చుతో కూడుకున్నవే! వారపత్రికలలో ఒక్కదానికి తప్ప తక్కినవాటికి యాడ్స్ వచ్చే పరిస్థితి లేదు. యాడ్స్ రాకుండా ఎంతకాలం పత్రికను నడపగలం?

అయినా ముందుకు సాగాం. మధ్యతరగతిజీవి బతుకులో నవ్వులు పూయించాలన్న, ఆహ్లాదం పంచాలన్న తపన ఒక్కటే ముందుకు నడిపించింది. ఈ విలక్షణ పత్రిక మార్కెట్లో వెలువడినాక ముందులో దాని క్యారెక్టర్ జనాలకు అర్థం కాలేదు. వాళ్లు మామూలుగా చూసే పత్రికలకు భిన్నంగా రూపుదిద్దుకున్న పత్రికను అర్థం చేసుకోవడానికి, ఆదరించడానికి కొంతకాలం పట్టింది. కొంతమంది 'ఇలాటి పత్రికకోసమే ఇన్నాళ్లూ ఎదురుచూస్తున్నాం' అంటూ వాటేసుకున్నారు. 'ఈ పత్రిక ఉందని మాకు ఇప్పుడే తెలిసింది. పాత సంచికలు పూర్తి ధరతో కొంటాం. పంపగలరు.' అన్న ఉత్తరాలు ఇంకా వస్తూనే ఉన్నాయి. మరి అంత ఆదరణ పొందిన పత్రికను మూసివేయడం ఎందుకు? అన్న ప్రశ్న వస్తుంది.

కారణం - ప్రతికూల వాతావరణం. మంచిదేదీ మిగలదన్న ఋణాత్మక (నెగటివ్) ఆలోచనా విధానం మన మనసుల్లో రాజ్యమేలుతోంది. 'అబ్బే, కాస్తో కూస్తో బూతులు అవీ ఎంతో కొంత లేకుండా పత్రిక ఎలా నడుస్తుందండీ' అన్నవారే అందరూ! 'ఇలాటి పత్రిక ఎప్పుడు మూసేస్తారో తెలియదు. కాబట్టి చందా కట్టడం రిస్కీ!' అని పాఠకులు, 'ఓ భారీప్రచురణా సంస్థనుండి కాకుండా ఓ ఔత్సాహికుడు వెలువరిస్తున్న పత్రిక ఎన్నాళ్లు నడుస్తుందో ఏమో, దీనిపై శ్రద్ధ పెట్టి పనిచేయడం దండగ' అని ఏజంట్లు, 'అసభ్యతకు పట్టం కట్టే ఆంధ్రదేశంలో ఇలాటి పత్రిక చదివారెవరు? దీనిలో ప్రకటన ఇస్తే చూసేవారెవరు?' అని ప్రకటనకర్తలు - భావిస్తూంటే ఏం జరుగుతుందో 'హాసం' పత్రిక విషయంలోనూ

(మిగతా పక్క పేజీలో)

అదే జరిగింది. నన్ను కలిసిన, ఇంటర్వ్యూ చేసిన ఇంచుమించు ప్రతివారూ 'హాసం ఇంకా ఎంతకాలం నడుపుతారు? ఆపేయడం ఎప్పుడు?' అని అడిగినవారే! అంటే 'ఇలాటి పత్రిక బతికి బట్టకట్టడం అసంభవం. ఎప్పటికో అప్పటికి దీన్ని మూసివేయడం రూఢి అయిన సత్యం!' అని అందరూ నిశ్చితాభిప్రాయంతో ఉన్నట్టే కదా! దురదృష్టవశాత్తూ వారందరి ఆలోచనలూ ఈ రోజుకి యథార్థరూపం దాల్చాయి.

ఇటీవల మా సంపాదకీయంలో వ్రాసినట్టు మధ్యతరహా ఉత్పాదనలకు కాలం కాదిది. ప్రజలందరూ భారీతనాన్నే కోరుకుంటున్నారని అందరూ భావిస్తున్నారు కాబట్టి ఆర్థిక పరిపుష్టి లేకపోయినా ఇవి భారీవాటితో పోటీ పడక తప్పటం లేదు. ఖరీదయిన న్యూస్‌ప్రింట్, ఆర్ట్‌పేపరు, లోపల కలర్‌పేజీలు - అన్నిటా వాటితో సమానంగా అందించవలసినదే! కమిట్‌మెంట్ లేని కొనుగోలుదారుడికి పత్రికల స్థితిగతుల, ఆదాయపువనరుల లెక్కలేవీ పట్టవు. ఆదాయం వచ్చే పత్రికతో సమానంగా ఆకర్షణీయంగా కనబడాలి. దాని ధరకే రావాలి.

ఇక్కడే వస్తోంది అసలైన ఇబ్బంది! 'ఇది నా టేస్టుకు సరిపడిన పత్రిక. దీన్ని నిలబెడదాం' అన్న కమిట్‌మెంట్ ఉన్న పాఠకులు పెద్దసంఖ్యలో ఉన్నట్లయితే మార్కెట్ అవసరాలను పట్టించుకోకుండా కేవలం చందాదారులకోసం రీడర్స్‌డైజస్టులా నడపవచ్చు. రీడర్స్ డైజస్టుకీ ఎంతోమంది ప్రకటనకర్తలున్నారు. కానీ తెలుగుపత్రిక అనగానే మనవాళ్లలో అనుమానపు నీడలు - 'డబ్బు కట్టినదాకా ఉండి పోస్టులో పంపకపోతే!?'

నిజానికి మనం ఎన్నో 200/- రూ॥లు అనవసరంగా ఖర్చు చేస్తూనే ఉంటాం. పత్రిక చందా అనేటప్పటికి మాత్రం ఎక్కడలేని సందేహాలు వచ్చిపడతాయి. అందువల్ల స్టాల్‌లో కొందామనుకొని అనుకుంటూ చందా కట్టరు. అన్ని స్టాల్స్‌లోనూ పత్రికను అందుబాటులో ఉంచడం కష్టమని వీరెరుగరు. పైగా పత్రిక షెల్ఫ్ లైఫ్ పదిహేను రోజులు మాత్రమే! మందుల్లా ఏళ్లూ, పూళ్లూ కౌంటర్లో ఉంచుకోరు. ఆ పదిహేను రోజుల్లోగా కొనుగోలుదారు బుక్‌స్టాల్‌కు వెళ్లడం కుదరకపోతే ఆ సంచిక వెనక్కి తిరిగివెళ్లిపోతుంది. అసలీ రోజుల్లో బుక్‌స్టాల్‌కి వెళ్లేదెందరు? ఈ 'హోమ్ డెలివరీ' యుగంలో సరదాగానైనా బుక్‌స్టాల్‌కి వెళ్లి కొత్తవి ఏమొచ్చాయో చూద్దామని కూడా ఎవరూ అనుకోవటం లేదు. టీవీ వదిలి బయటకు వచ్చినప్పటి మాట కదా!

'హాసం' ఆదరణ పొందలేని నేననటం లేదు. పొందిన ఆదరణ చాలదంటున్నాను. సర్క్యులేషన్ లైబ్రరీలలో చాలా డిమాండ్ ఉన్న పత్రిక అని సర్వేలలో తేలింది. అంటే అర్థమేమిటి? పత్రిక కావాలి. కానీ కొనడం మాత్రం కుదరదు. కూల్‌డ్రింక్‌పై, చాక్‌లెట్‌పై వెచ్చించే మొత్తం కూడా పత్రికపై వెచ్చించడానికి మనలో చాలామందికి మనస్కరించదు. పత్రిక మొదలుపెట్టి మూడేళ్లు పైబడినా ధర ఒక్కపైసా కూడా పెంచలేదు. పైపెచ్చు 6 వ సంచికనుండి 8 పేజీలు అదనంగా ఇవ్వసాగాం. 11 వ సంచిక నుండి ముఖచిత్రం ఆర్ట్‌పేపరుపై ముద్రించసాగాం. ఇన్ని చేసినా పత్రికను ఆర్థికంగా నిలబెట్టే స్థాయిలో ప్రజలు కొనలేదు.

ఈ పత్రికను నెలకొల్పడంలో నా ఉద్దేశ్యం లాభార్జన కాదు. ఇలాటి పత్రికను ఆర్థికంగా నిలదొక్కుకునేలా చేసి మంచి కూడా నిలబడుతుందని ఋజువు చేయగలుగుతానని ఆశించాను. అందుకే 'హెల్తీ కమ్మర్షియల్ మ్యాగజైన్'గా తీర్చిదిద్దడం జరిగింది. 'భారతి' ని ఈనాడు అందరూ ప్రశంసించేవారే! కానీ ఆ రోజుల్లో కూడా వారి ప్రింట్ ఆర్డరు వెయ్యికి దాటలేదట! రేపు 'హాసం' పత్రికకు కూడా ఘనమైన నివాళులు అర్పిస్తారేమో! కానీ అది చాలదు. మంచిని పదిమందికి వ్యాప్తి చేయాలనీ, దాన్ని నిలబెట్టాలనీ పలువురు అనుకున్నప్పుడే, ఆచరించినప్పుడే మంచి నిలబెడుతుంది. లేకపోతే 'హాసం' పత్రిక ఒక ఉదాహరణగా - మరొకరు ఈ బాటను నడవడానికి భయపడే ఉదాహరణగా - మాత్రమే మిగిలిపోతుంది.

ఒకనాడు దినపత్రికలు వార్తలకు పరిమితమయితే వారపత్రికలు ఫీచర్స్ అందించేవి. ఈనాటి దినపత్రికలు వార్తలకు తోడు ఫీచర్సు కూడా జోడించి పత్రికలకు మార్కెట్లో చోటు లేకుండా చేశాయి. ఎలక్ట్రానిక్ మీడియాకు పోగా మిగిలిన యాడ్స్ ఏవైనా ఉంటే అవి, ఈ దినపత్రికలకే హరించుకుపోతున్నాయి. జిల్లాకు, పేటకు కూడా ప్రత్యేకమైన రేట్లు పెట్టి ప్రకటనకర్తలను అవి ఆకర్షించ గలుగుతున్నాయి. ఎవరైనా సరే ఈ మార్పుతో రాజీ పడవలసినదే! అభిరుచి గల ప్రకటనకర్తలు 'హాసం' వంటి విలక్షణ పత్రికలపై ప్రత్యేకాభిమానం చూపితే తప్ప ఈ ప్రతికూల పరిస్థితులు మారవు.

'హాసం'కు కాస్త ముందువెనకలుగా అనేక పత్రికలు మార్కెట్లోకి వచ్చాయి. చాలాభాగం మూతపడ్డాయి. కానీ పట్టుదలతో ఇన్నాళ్లు లాక్కుని వచ్చాము. మూడేళ్ల తర్వాత కూడా భవిష్యత్తు ఆశాజనకంగా కనబడకపోవడంతో ఇక్కడితో ఈ ప్రయత్నాన్ని విరమిస్తున్నాం. ఈ సమీక్షా సమయంలో తెలుగు పత్రికారంగంలో 'హాసం' పత్రిక సాధించిన విజయాలు, పొందిన స్థానం కూడా చెప్పుకోవలసినదే! దాచుకోవలసిన పత్రికగా 'హాసం' రూపొందిందనడం అతిశయోక్తి కాదు. ఎందరో ప్రముఖులు 'హాసం' కై కలం పట్టారు. ఎంతో విలువైన సమాచారం ప్రజలకు అందింది. ఈ సబ్జెక్ట్‌లపట్ల ప్రజలకు మక్కువ ఉందని సాటి పత్రికలకు చాటి చెప్పినట్లయింది. సామాజికపరంగా 'హాసం క్లబ్'ల ఆవిర్భావానికి దారితీసింది.

హాస్య, సంగీతాలపై అభిరుచి ఉన్నవారందరికీ 'హాసం' పత్రిక గురించి తెలిసి, ఆదరించివుండి వుంటే ఈ లేఖ రాసే సందర్భం వచ్చేది కాదు. తెలుగులో మంచి పత్రికలు రావని, మంచి సినిమాలు రావని వాపోయేవారికి 'ఇదీ దీనికి కారణం. ఈ ప్రతికూల ఆలోచనాధోరణి మారినప్పుడే మనకు మంచికాలం.' అని చెప్పడమే ఈ లేఖ ఉద్దేశ్యం. దీన్నిబట్టి వ్యక్తిగతంగా, సంఘపరంగా మనం చేయవలసినదేమిటో ఎవరికి వారే ఆలోచించి, ఆచరించాలని నా అభ్యర్థన.

'హాసం' పత్రిక ద్వారా పోగుపడ్డ సమాచారం జాతిసంపద అని, దాన్ని భావితరాలకు అందించాలని నాకనిపిస్తుంది. రాష్ట్రంలో ఉన్న లైబ్రరీలకు, వృద్ధాశ్రమాలకు, అనాథాశ్రమాలకు, సేవాసంస్థలకు 'హాసం' సంచికల సెట్లను బహూకరించాలని నా సంకల్పం. 'హాసం'లో ఇప్పటిదాకా వచ్చిన సమాచారాన్ని దశలవారీగా 'హాసం' వెబ్‌సైట్ (www.haasam.com) లోకి ఎక్కించి అందరికీ అందుబాటులో ఉంచాలని ప్రయత్నిస్తున్నాము.

'హాసం' ఉద్యమం ఇంతటితో ఆగిపోవాల్సినదేనా? ఆగకూడదనే నా భావన. అనేక ఇంటర్వ్యూలలో నేను చెప్పాను - 'హాస్యం, సంగీతం నా కిష్టమైన సబ్జెక్ట్‌లనీ, 'హాసం' నిరంతరంగా నడుస్తూనే ఉండాలని. అయితే ఇకపై 'హాసం' 'పత్రిక' రూపంలో కాకుండా 'పుస్తకాల' రూపంలో మీ వద్దకు వస్తుంది. 'ఇంటింటా గ్రంథాలయం' పేరిట '60లలో ఎమెస్కో వారు నడిపిన ఉద్యమం మీకు గుర్తుండే వుంటుంది. '70, '80లలో 'యువభారతి' సంస్థ 'ప్రతి తెలుగింట కనీసం పది పుస్తకాలుండాలి, వాటిలో ఒకటి యువభారతి ప్రచురణ అయి వుండాలి' అనే లక్ష్యంతో ఎన్నో పుస్తకాలను అందుబాటు ధరలలో వెలువరించిన విషయమూ

గుర్తుండే వుంటుంది. అదే స్ఫూర్తితో హాస్యం, సంగీతం సబ్జక్ట్లపై కలకాలం దాచుకోదగ్గ పుస్తకాలను పరంపరగా వెలువరించడం ద్వారా 'హాసం' ఉద్యమాన్ని నాలుగుకాలాలపాటు నిలిపి వుంచాలని ఆకాంక్షిస్తున్నాను. ఉగాదినుండి ఈ పుస్తకోద్యమం కార్యరూపం దాలుస్తుంది. ఏదైనా విషయాన్ని పత్రికరూపంలో వెలువరిస్తే మార్కెట్లో దాని ఆయుర్దాయం 15 రోజులే! అదే పుస్తక రూపంలో వస్తే నెలలతరబడి పాఠకులకు అందుబాటులో ఉంటుంది.

పుస్తక విక్రేతల ప్రమేయం లేకుండా నేరుగా పాఠకులకు అందించ గలిగితే సాధ్యమైనంత తక్కువ ధరలో ఈ పుస్తకాలు లభిస్తాయి. అందుకుగాను హాస్య-సంగీతాభిమానులందరూ ఒక వర్గంగా ఏర్పడి ఒకరికొకరు అందుబాటులో ఉండాలి. 'హాసం క్లబ్స్' ద్వారా అది సాధ్యపడుతుంది. అవి నిరాటంకంగా నడుస్తూనే ఉండాలి. వాటికి మా సహకారం ఎప్పుడూ ఉంటుంది.

'హాసం' పాఠకులకు ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. మీ అడ్రసు, ఫోన్ నెంబరుతో సహా ఓ పోస్టుకార్డుపై వ్రాసి మా కార్యాలయానికి వెంటనే, లేదా సంక్రాంతిలోగా పంపండి. ఉత్తరాలు వ్రాసే అలవాటు తప్పిపోయివుంటే కనీసం మాకు ఫోన్ చేసి చెప్పండి. (040-23831388, 040-5570215). లేదా ఈమెయిల్ పంపండి. (haasammag@hotmail.com). వంశీ భాషలో చెప్పాలంటే 'కొంచెం..టచ్లో ఉంటే చెబుతాను', అవును మరి, మేం వెలువరించబోయే 'హాసం బుక్స్' గురించి వివరాలు చెప్పాలంటే మీరు టచ్లో ఉండాలి కదా! ఈ బంధాన్ని పత్రికనుండి పుస్తకాలకు విస్తరింప జేయాలంటే ఈ data bank తప్పనిసరి. మీలో కనీసం 5 వేలమంది ముందుకు వచ్చి పుస్తకం కొనడానికి సంసిద్ధత వ్యక్తపరచినా - మార్కెట్రేటులో సగం రేటుకే పుస్తకాలను అందజేయవచ్చును. 'హాసం'లో వివిధ అంశాలపై అందించిన సమాచారం ఎంతో ఉంది. ఎన్నో జనరంజకమైన కథలు, జోక్స్ వచ్చాయి. వాటిలో ఏవేవి పుస్తకరూపంలో తీసుకురావచ్చునో మీ సూచనలు అందించ గోరుతున్నాను.

బరువెక్కిన హృదయంతో మీనుండి సెలవు తీసుకునేముందు పాఠకులకు, ఏజన్సీలకు, ప్రకటనకర్తలకు, నా సహచరులకు - అందరికీ నమోవాకాలు అర్పిస్తున్నాను. వ్యాపారపరంగా ఈ ప్రయత్నంలో పాలుపంచుకున్న కళాజ్యోతి ప్రెస్వారికి, మార్గదర్శి మార్కెటింగ్ వారికి, తదితరులకు నా కృతజ్ఞతలు.

ప్రస్తుతానికి సెలవ్. 'హాసం బుక్స్' ద్వారా మళ్లీ కలుద్దాం.

భవదీయుడు,
మీవంటి ఒక హాస్య-సంగీతాభిమాని
వరప్రసాద్..
ప్రచురణకర్త

## ప్రకటన

* ఈ సంచికతో 'హాసం' పత్రిక ప్రచురణను నిలిపివేస్తోంది.
* చందాదారుల విషయంలో మిగిలిన చందాకాలానికి లెక్క కట్టి ఒక నెలలోపున వారి సొమ్ము వాపసు చేయడం జరుగుతుంది.
* రచయితలకు, పోటీలలో పాల్గొన్నవారికీ వారికి రావలసిన పారితోషికాలు నెలలోపున పంపబడతాయి.
* జనవరి 31, 2005 వరకు ఇదే అడ్రసులో పత్రిక ఆఫీసు నడుస్తుంది. పాత సంచికలు కావలసినవారు వెంటనే రాసి తెప్పించుకోగలరు. షరతులు మామూలే!
* 'హాసం' సెట్లు గ్రంథాలయాలకు, అనాథాశ్రమాలకు, వృద్ధాశ్రమాలకు, సేవాసంస్థలకు ఉచితంగా అందజేయబడతాయి. సెట్లకోసం వారు మాకు వ్రాయవచ్చు. లేదా వారి వివరాలు తెలిసినవారు మాకు వ్రాయగోర్తాము.
* 'హాసం'లో ప్రచురించబడిన కథలు, వ్యాసాలు పుస్తకరూపంలో తెచ్చే ఆలోచన ఉంది. 'హాసం' పాఠకులు తమ అడ్రసులను పోస్టుకార్డులపై వ్రాసి పంపితే పుస్తకాలు వెలువడినపుడు వారికి తెలియబరచే వీలుంటుంది.
* 'హాసం'లో ఇప్పటిదాకా వచ్చిన సమాచారాన్ని దశలవారీగా 'హాసం' వెబ్సైట్లోకి (www.haasam.com) ఎక్కించి అందరికీ అందుబాటులో ఉంచాలని ప్రయత్నిస్తున్నాము. వివరాలు కావలసినవారు ఆ వెబ్సైట్లో చూడవచ్చును.
* హాసం ఈ మెయిల్ అడ్రసు haasammag@hotmail.com కూడా చలామణీలో ఉంటుంది. సంప్రదింపులు జరుపగోరేవారు ఈ మెయిల్ పంపవచ్చును.
* 2005 ఉగాది నుండి 'హాసం బుక్స్' పాఠకులకు నేరుగా అందించే పథకం ప్రారంభించబోతున్నాం. దానికై హాస్య, సంగీతాభిమానుల వివరాలు (data bank) తయారుచేస్తున్నాం. జనవరి 15 లోగా మీ వివరాలు పోస్టుకార్డు (502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాద్ 500 018) ద్వారా/ ఫోన్ (040-23831388, 040-55570215) ద్వారా/ ఈ మెయిల్ (haasammag@hotmail.com) ద్వారా తెలియపరచ గోర్తాం.

మేనేజింగ్ ఎడిటర్
'హాసం'

# కొత్త సంవత్సరం నిర్ణయం

\- కండ్లకుంట శరత్‌చంద్ర

**2**003 డిసెంబర్ 31 !!!

మరో పావుగంటలో క్యాలెండర్ మారిపోతుంది.

ముకుందరావు, తన బెడ్రూంలో ఇప్పటికే మూడొందలా ముప్పైసార్లు పచార్లు చేసాడు. యథాశక్తి తలబాదుకున్నాడు!!

ఎంత ఆలోచించినా... ఈ నూతన సంవత్సరం సందర్భంగా కొత్త నిర్ణయం ఏం తీస్కోవాలో అర్థం కాలేదు.



అవతల హాల్లో అతని భార్య మీనాక్షి... సుపుత్రుడు, సుపుత్రిక.. టి.వి. ముందు ఆసీనులై వున్నారు.

"ఛ......ఛ! ఓ మాటాలేదూ .. ముచ్చటా లేదు. ఈ టీ.వీ.గోలేమిటి!! రోజుకు ఇరవై సీరియళ్ళు చూస్తూ.... ఇటు వంటా వార్పు చెయ్యకుండా.. అటు పిల్లల్ని పట్టించుకోకుండా.. వచ్చిన బంధువుల్ని ఆదరించకుండా.. నరకం చూపిస్తోంది..!" భార్యను తిట్టుకోసాగాడు.

''ఆ..ఆ(...కొత్త నిర్ణయమంటే.. ఇప్పుడే ..ఓ ఆలోచన వస్తోంది. కేబుల్ కనెక్షన్ పీకించేస్తేనో.!! య..స్!! కొత్త నిర్ణయం తీసేసుకున్నాను. యా... హూ!" మనసులోనే అరిచినంత పనిచేసాడు.

❖ ❖ ❖

ముకుందరావు, కేబుల్ టీ.వీ. కుర్రాడి ఫోన్ చేశాడు.

'అ... ల్లో !! కే..బుల్ టి.వి....ఆపీ..సు నుండి ఓబుల్‌రెడ్డి పీకింగ్!!"

"నేనయ్యా, నలభయ్ రెండో ప్లాటు ముకుందరావును మాట్లాడు తున్నాను".

''అ.....అ(...! హా.. ప్పీ..న్యూ..యియర్ సార్!"

"నాయనా...! ఆ హాపీ న్యూయియర్ నీకు మాత్రమే ! ఇంకా నాకు రాలేదు. నువ్వొచ్చి...మా కేబుల్ కనెక్షన్ పీకేసి వెళితే... ఇక ప్రతిరోజూ నాకు హాపీనే!" చెప్పాడు.

"ఎట్టా ..!! కేబుల్ కనెక్చాన్ పీకేయాలా!! ఏంట్సార్... పెపంచకమంతా ముందుకు పోతావుంటే మీరేంది సార్... ఇట్టా.. వెనకకు పోతావున్నారు. మీరు చెప్పేది బాగా లేద్సార్!"

"పిచ్చిపిచ్చి మాటలు మాట్లాడకు. నా నిర్ణయాన్నే.. కామెంట్ చేసేంత మొనగాడిదవా నువ్వు! నోరుమ్మూసుకుని వచ్చి నీ కనెక్షన్ పీకేసుకుపో!"

"సార్ ....! ఈ యిషయం మీ ఆవిడగారికి చెప్పారా సార్!!?"

"ఏం?"

"ఆహా!.. ! మరేంలేదు...సార్!! ఈ మధ్యనే ఒకాయన ఇట్లా చేస్తే...ఓ చిన్నసైజు భారతయుద్ధం వాళ్ళింట్లో జరిగిందిలెండి. అందుకే... మీ ఆవిడకు చెప్పండంటున్నాను."

"నీ బోడి సలహాలు నాకు అక్కరలేదు. చెప్పింది చెయ్యి." విసురుగా చెప్పి పెట్టేసాడు ఫోన్.

"వెధవ ! వెధవన్నర వెధవ....!! డబ్బుల కోసం....ట్రిక్కుప్లే చేస్తున్నాడు ట్రిక్కు!" తిట్టుకుంటూ బాత్రూంలోనికి వెళ్ళాడు ముకుందరావు.

ట్రింగ్...ట్రింగ్ ..!! ట్రింగ్ ట్రింగ్..!!

మీనాక్షి రిసీవర్ ఎత్తింది . "హలో!"

"అ..ల్లో!! అమ్మ..య్య!! మీ ఆయనగారు ఫోన్ ఎత్తుతారేమోనని తెగ ఖంగారు పడిపోయాను మేడమ్.. మీరే ఎత్తినందుకు

నాకు చాలా ఖుషీగా వుంది!"

"ఏయ్ ..ఎవరువ్వు!" సీరియస్‌గా అడిగింది మీనాక్షి.

"నేను మేడమ్...!! మీ కేబుల్ టీ.వీ. పోరగాడ్ని!!"

"అయితే ...ఇప్పుడు ఫోనెందుకు చేసావు. నీకు రావాల్సిన డబ్బు సాయంత్రం వచ్చి తీసుకుపో!"

"అబ్బబ్బబ్బా... !! నేనిప్పుడు ఫోన్ చేసింది డబ్బుల కోసం కాదు మేడమ్! అదీ...మరేమో.. మీ ఆయనగారు.. మీకు తెలియకుండా.."

"ఆఁ..నాకు తెలియకుండా.. "మీనాక్షి ఖంగారుపడింది.

"అదీ..మీకెలా చెప్పాలో తెలీడంలేదు మేడమ్!"

"ఓరి నీ నసుగుడు నట్టేట్లో మునగా! చెప్పు... నాకు తెలీకుండా.. మా ఆయన ఇంకెవరినైనా వుంచుకున్నాడా!"

"అబ్బే ..!! అంత దమ్ము మీ ఆయనకు లేదు మేడమ్!! అయినా...

అది చాలా చిన్న విషయం మేడమ్!! కానీ ..మీ ఆయనగారు చేసింది మాత్రం క్షమించరాని ....తప్పు మేడమ్!! మీకు తెలీకుండా... కేబుల్ కనెక్చన్ పీకేయమన్నారు."

"ఆఁ....!! నిజంగానా?!!"

"అవును మేడమ్!! ఈ విషయాన్ని మనమందరం తీవ్రంగా ఖండించాలి మేడమ్!! మీ ఇంట్లో కేబుల్ కనెక్చాన్ పీకేస్తే....మీరెంత విలవిలలాడిపోతారో...నాకు తెల్సుమేడమ్!!

'సూరక్క పెళ్ళి' సీరియల్‌లో సూరక్క పెళ్ళి ఎవరితో జరుగుతుందో మీకు తెలీకుండా పోతుంది!!' 'అమావాస్య' సీరియల్ లో హీరోయిన్ కంటిచూపు వస్తుందో రాదో మీకు తెలియకుండా పోతుంది!! 'వింతరంగం' సీరియల్‌లో ..పరంధామయ్యగారి సెకండ్ సెటప్‌కు పుట్టినకూతురు... పిల్లాడ్ని కంటుందో.. పిల్లను కంటుందో మీరు తెల్సుకో లేకపోతారుకదా..!!

"ఇంత చిన్న వయసులోనే మీకు ఎన్ని కష్టాలొచ్చాయి మేడమ్!! ఇంతకూ... స్టార్ కనెక్చాన్ పీకేయాలా మేడమ్!" ఏడుస్తూనే అడిగాడు ఓబుల్‌రెడ్డి.

"నో... ! నో...! నో....! !!" అని సీరియల్స్‌లో హీరోయిన్ అరిచినట్లు మూడుసార్లు అరిచి, "నువ్వలాంటి పిచ్చిపనులు



చేయకు" అంది .

"మరి ..మీ ఆయన.."

"ఆ సంగతి నాకొదిలేయ్!! విషయం చెప్పినందుకు ...నీకు ఈ జన్మంతా ఋణపడి వుంటాను. తమ్ముడూ.. ఋణపడివుంటాను...." ఓ భారమైన డైలాగ్ కొట్టి రిసీవర్ పెట్టేసింది.

"ఫోన్ ఎక్కడినుండి.." అడిగాడు ముకుందరావు బాత్రూంలో నుండి ఇవతలి కొస్తూ.

"ఏమండీ....!!" అరిచింది మీనాక్షి డి.టి.ఎస్. లెవల్లో. ముకుందరావు అదిరిపడి క్రిందపడబోయి తమాయించుకున్నాడు.

"ఏంటే ..ఇంత గట్టిగా అరిచావ్!! "అన్నాడు నెమ్మదిగా .

మీనాక్షి కళ్ళల్లో నుండి.. మున్సిపల్ కుళాయిలా నీళ్ళొచ్చాయి.

"ఏమండీ- !! నేను మీకేం అన్యాయం చేసానని నాకింతటి కఠినమైన శిక్షను విధిస్తున్నారు. ఆడదంటే..మీ కింత అలుసా... ఓ తల్లిగా ..ఓ చెల్లిగా.. ఓ ప్రేయసిగా.. ఓ భార్యగా.. ఓ కూతురిగా... ఓ వంటమనిషిగా... ఓ పనిమనిషిగా ....మగాడికి ఎన్నో సేవలందిస్తోందండీ ఆడది!! మీ క్రూర మగ హృదయాలు దాన్ని గుర్తించడం లేదు."

"ఒసేవ్... ! ఒసేవ్..!! ఏమైందే నీకూ!! నీ సీరియళ్ళ భాషను వదిలేసి....డైరెక్టుగా పాయింట్లోకొచ్చెయ్‌వే ..నీకు దండం పెడతాను" అంటూ మొత్తుకున్నాడు ముకుందరావు.

"హు!! పాంట్లోకీ.. లుంగీలోకీ రావడానికి ఈ ఆడాళ్ళేమైనా బొద్దింకలనుకుంటున్నారా? లేకపోతే ఎలుక పిల్లలనుకుంటున్నారా?" అంది ఆవేశంగా.

"నేనన్నది పాయింటే.. నువ్వనుకుంటున్నట్టు... తొడుక్కునే ప్యాంటు కాదే! పాయింట్ అంటే విషయం.. !! డైరెక్టుగా అసలు విషయాని కొచ్చేయమంటున్నాను."

"కేబుల్ కనెక్షన్ పీకేయించాల్సిన అవసరమే మొచ్చింది, చెప్పండి?"

"ఓహో.. నీ డైలాగులకు అర్థం అదా!! నే ఇంకేదో అనుకున్నాను?" నెమ్మదిగా నిట్టూర్చాడు.

"ఇంకేదేనా.... అంటే... కేబుల్ కనెక్షన్ పీకేయించేదే కాకుండా.. ఇంకేదో కూడా వుందన్నమాట! ఏమిటది!" గర్జించింది.

"ఏమీ లేదే... !! ఊరికేనే .. ఊరికే.. అలా మాటవరసకన్నానే " భరించలేక ఏడ్చేసాడు.

"హు!...!! ఏడ్చేమగాడ్ని... నవ్వే ఆడదాన్ని నమ్మొద్దట!! 'ఓ మగాడు ఓ ఆడది' సీరియల్ లో .. చెప్పారు అంది".

ముకుందరావు కన్నీళ్ళు తుడుచుకుని, "నీ డైలాగులాపు!! కేబుల్ కనెక్షన్ వుండడం వల్ల... పిల్లల చదువులు సాగడం లేదు. ఇంట్లో ఓ మాటా లేదు.. ముచ్చటా లేదు. అందుకే.. పీకేయిస్తాను. " గట్టిగా చెప్పాడు.

మీనాక్షి తన మెడలోని తాళిని గట్టిగా

పట్టుకుని, "మీరే గనక ..స్టార్ కనెక్షన్ గనక పీకేయించేస్తే...ఊరుకోవడానికి నేనేమీ అబలను కాను!! ఆదిశక్తిని!!"

"ఈ తాళి తెంపేస్తా!! ఈ బొట్టు చెరిపేస్తా!! ఈ గాజులు పగలగొట్టేస్తా!! నా మెట్టెల సవ్వడి ఈ ఇంట్లో ఇక వినిపించదు. వాటిని సైతం తీసేస్తా. తెల్లచీర కట్టుకుని ఈ ఇంట్లో మీ కళ్ళ ముందే తిరుగుతా. మీ ఫోటోను హాల్లో పెట్టి దండవేసి అగరొత్తులు వెలిగిస్తా !! విడాకులు తీసుకుందామనుకుంటున్నారేమో.. నో ఛాన్స్! విడాకులివ్వడం అంత సులభం కాదని.. చట్టపరంగా చాలా చాలా తతంగాలుంటాయని 'అమ్మమ్మ పెళ్ళి'అనే సీరియల్‌లో చెప్పారు. మీరుగానీ ...నన్ను తన్ని తగలెయ్యాలని చూస్తే... మహిళామండలి వాళ్ళకు ఫోన్ చేసి పిలిపించి మక్కెలిరగదన్నిస్తా!! ఊ.. ఆలోచించుకోండి.

"స్టార్‌కనెక్షన్ జోలికి రాకుండా ఉంటారా!! ఈ మాంగల్యం తీసేయమంటారా!! ఊఁ చెప్పండి త్వరగా అవతల 'పతియే ప్రత్యక్ష దైవం' సీరియల్ మొదలు కాబోతుంది.... చెప్పండి " అంటూ ఘాంౘ్రడించింది. ముకుందరావు గజగజ వణికిపోయాడు.

"ఒద్దే....!! అంత పనిమాత్రం చెయ్యకు. ఏదో బుద్ధిగడ్డితిని ...చిన్నప్పుడెప్పుడో మా తెలుగుమాష్టారు చెప్పిన విషయాన్ని దృష్టిలో వుంచుకుని .. ప్రతీకొత్త సంవత్సరంనాడు ఏదో ఓ మంచి నిర్ణయం తీసుకుంటున్నాను. ఈసారి.. ఈ నిర్ణయం తీసుకున్నాను. హుఁ.. !! ఏంచేస్తాం.. ఆ స్టార్ కనెక్షన్ జోలికి వెళ్ళనులే!! " నిట్టూర్చి వెళ్ళిపోయాడు ముకుందరావు కళ్ళు తుడుచుకుంటూ.

❖ ❖ ❖

2004 డిసెంబర్ 31 !!!

దృశ్యంలో ఏ మాత్రం మార్పులేదు.

'ఈ సంవత్సరం ఏ నిర్ణయం తీసుకోవాలబ్బా!!" ముకుందరావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

నెమ్మదిగా డైరీ తిరగేస్తుంటే విషయాలు అర్ధమౌతున్నాయి!!! .. ఒడ్జెట్ ఇలా పెరిగిపోయిందేమిటీ?! నాలుగవతరగతి చదువుతున్న నా కూతురు.. ఈ సంవత్సరం వాడిన పెన్సిళ్ళతో .. చార్మినార్ లాంటి కట్టడం కట్టొచ్చు!!

ఆరోతరగతి చదువుతున్న నా సుపుత్రుడు.. ఈ ఏడువాడిన పెన్నులతో ..ప్రపంచంలోనే అతి పెద్ద ఇతిహాసమైన భారతాన్ని పాతికసార్లు వ్రాయొచ్చు.

ఇద్దరూ కలిపి వాడిన నోట్‌పుస్తకాలలో.. బైబిల్‌ను నూటా పాతికసార్లు ముద్రించవచ్చు.

ఇక నా భార్యామణి ఏమైనా... తక్కువా!! అల్మైరాలో వున్న పాత చీరలన్నీ జనవరి ఫస్టున, పనిమనుషులకు దానమిచ్చి దానకర్ణుని చెల్లెలనే పేరు కొట్టేయడానికీ... స్టీలు సామన్ల వాడికి ఇవ్వడానికీ సరిపోయాయి. ఇక, ఈ సంవత్సరం కొత్త చీరలుకొని అల్మైరాను మళ్ళీ నింపేసింది. తానేమో ముష్టెంకడిలా... రెండు జతల బట్టలతో తిరుగుతాడు.

వీటిని కంట్రోల్ చేద్దామంటే అందరూ నా పీకపట్టుకుంటారు. "నువ్వు పెన్సిళ్ళూ, పెన్నులూ, కొనివ్వకపోతే.. మార్కులెలా వస్తాయి? అని నన్ను బెదిస్తారు పిల్లకాయలు!! ఇక భార్యామణి సరేసరి!"ఇలా ఆలోచిస్తూ ..టెలీఫోన్ బిల్లులన్నీ కూడాడు.

"ఈ సంవత్సరం.. మొత్తం కట్టిన... ఫోన్‌బిల్లుల.. మొత్తం.. నలభైవేలు!!!"

గుండె ఆగినంత పనైంది.

'ఇప్పుడర్థమైంది ఏం చేయాలో!! ఈ సంవత్సరం ఫోన్ బిల్లులన్నీ బాగా తగ్గించాలి. ఇదే.. నేను తీసుకోబోయే కొత్త నిర్ణయం!! ఈరోజు కూడా ....ఎవ్వరికీ ఫోన్ చేసి నూతన సంవత్సరం శుభాకాంక్షలు చెప్పను. ' మనసులో అనుకున్నాడు.

టంగ్...టంగ్... టంగ్... టంగ్...

గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

ముకుందరావు హాల్లోనికి వచ్చాడు.

"హలో వ్యూయర్స్!!! హాపీన్యూ ఇయర్...!! టీ.వీ.లో కొందరు ఏంకరమ్మలు. ఏంకరయ్యలు గెంతుతున్నారు.

మీనాక్షి ఎవరికో ఫోన్ చేస్తోంది.

"హలో !"

"..."

"హాపీ న్యూ యియర్! విశాలమ్మగారూ!!"

"...."

"ఆ... అన్నట్లు ...సీరియల్స్ క్రమం తప్పకుండా చూస్తున్నారుగా!"ఇంకా ఏవేవో సోదికబుర్లు చెప్పి, మరోనెంబర్‌కు డయల్ చేసింది. ముకుందరావు నోరు తెరుచుకుని చూస్తూనే వున్నాడు.

ఎవరెవరికో డయల్‌చేసి... ఏదేదో చెప్పేస్తోంది.

ఇలా ఓ గంట గడిచినా... మీనాక్షి ఫోన్‌ను వదలడం లేదు.

మధ్యలో గ్యాప్ దొరికించుకుని , ముకుందరావు ముందుకు గెంతి గట్టిగా ఆమె చెయ్యిపట్టుకుని,

"ఎవరికి చేస్తున్నావే... ఇన్ని ఫోన్‌లు!!" అరిచాడు.

"హయ్యో! మీకు చెప్పనే లేదు కదండీ!! తెలుగు మహిళా సీరియళ్ళ సమాఖ్యలో నేను మెంబర్‌నయ్యానండీ!"

"అదెప్పుడు పెట్టారు"?

"ఓ... చాలా రోజులైందిలెండి. వాళ్ళందరికి ఫోన్ చేసి గ్రీటింగ్స్ చెప్తున్నాను. ఎవరెక్కువ కాల్స్ చేస్తే... వాళ్ళు విన్ అయినట్లు లెక్క! ఇదిగోనండి.. మా తెలుగు మహిళా సమాఖ్యవారు ప్రచురించి పంపిన టెలిఫోన్ డైరెక్టరీ!" అంది.

ఆమె ముందు ఓ లావుపాటి పుస్తకం వుంది. దాని బరువు కనీసం.. కడుపుతో వున్న ఏనుగంత వుండొచ్చు!! ముకుందరావు గుడ్లుమిటకరించి , ఆ పుస్తకంలోని పేజీలు తిప్పాడు.

ముంబై, చెన్నై, కోల్‌కటా... ఢిల్లీ... ఇలా అన్ని మెట్రోపాలిటన్ నగరాలలో వున్న తెలుగు మహిళా సీరియళ్ళ సమాఖ్య మెంబర్ల ....ఫోన్ నెంబర్లున్నాయి.. ఆ పుస్తకంలో.

"అంటే.. !! ఇప్పుడు ఈ పుస్తకంలోని నెంబర్లన్నింటికీ నువ్వు ఫోన్ చేసి చావాలా!!"

"ఔను ..." చెప్పి, ఫోన్ ఎవరితోనో



మాట్లాడసాగింది,

"మమ్మీ.. !! త్వరగా చెయ్యి. మా క్లాస్‌మేట్స్ అరవైమందున్నారు. వారికి ఫోన్ చేసి గ్రీటింగ్స్ చెప్పాలి." అంది పాప.

"మమ్మీ... !! నా క్లాస్‌మేట్స్ అరవైమందికీ, అరవైమంది ట్యూషన్ మేట్సుకూ.. వందమంది పెన్‌ఫ్రెండ్స్‌కూ ఫోన్ చెయ్యాలి." అరిచాడు బాబు.

'ఓర్నా... యనో!! పోయిన సంవత్సరం.. వచ్చిన ఫోన్ బిల్లులమొత్తం .... ఈ ఒక్కరోజుతోనే వచ్చేటట్లుంది.

ఈవిడగారితో ఏం మాట్లాడిన రివర్స్‌లో కొడుతుంది. పోనీ వంశోద్ధారకుడితో చెబితే..

"నాన్నా ! నువ్వసలు నాన్నవేనా నాన్నా.. ఫోన్లు గిన్లు కట్ చేసే ప్రోగ్రాములు పెట్టావంటే నేను బాంబే వెళ్ళి మాఫియా ముఠాలో చేరిపోయి నీకే ఫోన్ చేసి నిన్నే బ్లాక్ మెయిల్ చేస్తా... టేక్కేర్?" అని అంటాడేమో

కూతుళ్ళకి తండ్రి మీద ప్రేమెక్కువంటారు ....పోనీ చెబితే

"నువ్విలాంటి పిచ్చి పిచ్చి డెసిషన్లేవో తీసుకుంటావని తెలిసే ఎదురింటి కుర్రాణ్ణి లైన్లో పెట్టి మరీ ఉంచాను. టీనేజి రాకుండా ఈ ఏజ్ లోనే వాడితో లేచిపోయి నీ పరువు డ్రైనేజిలో కలిపేయ్‌గలను జాగ్రత్త"

అని షాకిచ్చేస్తుందేమో...!?

ఏమో.. ఆ తల్లి పెంపకము .. టీవీ సీరియళ్ళ ప్రభావం.. ఈరోజుల్లో

నథింగ్ ఈజ్ ఇంపాజిబుల్..

పెళ్ళికాక మునుపు నా నిర్ణయాలు నేనే తీసుకుని అమలుపరిచేవాడ్ని!! ఇప్పుడలా కుదర్దు!! ఏ నిర్ణయం తీసుకున్నా పెళ్ళాం పిల్లలతో కలిసి మరీ తీసుకోవాలి!!!

ఇదే .....నేను తీసుకోబోయే సరికొత్త నిర్ణయం..!!! అనుకున్నాడు ముకుందరావు ఏడుస్తూనే.

---

జస్ట్ ఫర్ ఫన్

# అక్షర 'సత్యం'



అదొక చిన్న ఊరు. పేరు కూడా చిన్నూరే. ఊరి మధ్య రామాలయం. రామాలయానికి ఆనుకుని కమ్యూనిటీ హాలు. వెలిసిపోయిన కమ్యూనిటీహాలు గోడకి కొంతవరకు వెల్లవేయగా దానిపైన తాటి కాయంత నీలం రంగు తెలుగు అక్షరాలు వెలిసాయి.

గ్రామాల్లో ఏ ఒక్క మార్పు జరిగినా అదో వింతే . అందులోనూ ప్రత్యేకంగా గోడకు సున్నం కొట్టి రాసిన అక్షరాలు మరీ సంచలనాన్ని సృష్టించాయి.

మొదటగా ఉదయం ఆరుగంటలకే కుండలతో సంతకి బయల్దేరిన కూర్మన్న కళ్ళబడ్డాయి ఆ అక్షరాలు.

" యావయ్యుంటుందబ్బా... ఈ రాతలు దేనికోసమయ్యుండొచ్చు" - కళ్ళు పెద్దవి చేసుకుని సందేహపడ్డాడు.

మరికొంతసేపటికి గాడిదకు ఇటూ అటూ బట్టల మూటలు పెట్టుకుని రేవుకి బయల్దేరిన సిమ్మన్నను కూడా ఠక్కున ఆపేసాయి ఆ అక్షరాలు..

ఆగిన సిమ్మన్నను చూసి కూర్మన్న తన సందేహాన్ని బయట పెట్టాడు-

"సిమ్మన్నా! ఆ రాతలు యావయ్యుండొంచ్చంటావ్? కొంపతీసి ఎలచ్చన్లవి కాదు కదా.."

" ఎలచ్చన్లయితే అడావుడి వుంటాది కదా... అదీ గాకుండా.. బొమ్మలు కూడా లేవు.."

"అంటే"

" అదేరా.. ఏ సెయ్యిబొమ్మో, సైకిలు బొమ్మో రాస్తారు కదా".

వీళ్ల సంభాషణ ఇలా సాగుతుండగా ఒక్కొక్కరు కమ్యూనిటీ హాలు గోడముందుకు చేరారు.

- ఏదో దురదమందు కోసం ఎడ్వర్టైయిజ్‌మెంటని - ఒకరు
- 'పోలియో' ప్రచారమని మరొకరు
- 'కుటుంబ నియంత్రణ ఆపరేషన్ల కోసమ'ని మరో ముసలాయన

ఇలా రకరకాలుగా ఎవరికొచ్చిన ఊహని వాళ్ళు బయట పెడుతున్నారు.

ఇంతలో బండెడు పుస్తకాల్ని వీపుపై మోసుకొంటూ పక్కగ్రామం స్కూల్‌కి బయల్దేరిన సర్పంచుగారి మనవడు అటువైపుగా వచ్చాడు.

"బాబూ.. ఆ గోడ మీద ఏం రాసుంది?"

ఆకుకూరల్ని నెత్తిన పెట్టుకున్న ఓ నడివయస్కురాలు అడిగింది.

సర్పంచుగారి మనవడు గోడదగ్గరకు వచ్చి కూడబలుక్కొని మొత్తమంతా మనసులో చదువుకుని గట్టిగా చెప్పడం ఆరంభించాడు.

అభినందన సభ

మీ చిన్నూరు గ్రామం సంపూర్ణ అక్షరాస్యత సాధించింది. ఈ రోజు సాయంత్రం జరగబోయే మీటింగులో కలెక్టరుగారు గ్రామ పెద్దలను అభినందిస్తారు. అందరూ వచ్చి సభను జయప్రదం చెయ్యండి.

"అంటే?" అందరూ ఒక్కసారి ప్రశ్నించారు.

"అంటే?"

"మీ అందరికి చదవడం, రాయడం వచ్చిందట, అందుకే మీటింగు!"

వివరించి వెళ్ళిపోయాడు సర్పంచు మనవడు.

విస్తుపోయేరు గ్రామస్తులు.

" తమకు చదువచ్చన్న విషయం తమకే తెలియదు. ప్రభుత్వానికి ఎలా తెలిసిందబ్బా" అని.

**-బల్లా విజయకుమార్, వైజాగ్.**

# పలకరిస్తే పద్యం...



మహాసహస్రావధాని
డా॥ గరికపాటి నరసింహారావు

1116 పృచ్ఛకులతో 750 పద్యాలను ఏకధాటిగా ధారణ చేసి 'మహాసహస్రావధాని'గా కీర్తి ప్రతిష్ఠలనందుకున్న డా॥ గరికపాటి నరసింహారావుగారు సాగించిన అవధానయజ్ఞాలలో చమత్కారంగా దొర్లిన ఆశు పద్యాలివి. ఈ పద్యాలకు పృచ్ఛకులుగా వ్యవహరించినవారు శ్రీకాంత్, మంజుల, కుమార్, జ్యోతి, సాయి... చిత్తగించండి....

**◆ అవధానిగారూ... ఇప్పుడు ఆడవాళ్లు ఇంట్లో పడే శ్రమని మీరు అవధానంతో పోల్చారు, చాలా బాగుంది. అయితే ఈ రోజుల్లో ఆడవాళ్లు కూడా బయట ఉద్యోగాలు చేస్తున్నారు. దానివల్ల ఆడవాళ్లూ కష్టపడుతున్నారు, మగవాళ్లూ కష్టపడుతున్నారు. ఆ కష్టాలను వర్ణించండి.**

ఆడవాళ్ల ఉద్యోగాల వల్ల మగవాళ్లకంటే ఆడవాళ్లే ఎక్కువ కష్టపడుతున్నారని నా అభిప్రాయం. ఇంటి చాకిరీ ఎలాగూ తప్పదు. ఆఫీసు చాకిరి అదనంగా పెరిగింది. అందుకే మీరు ఉద్యోగాలు చేసే ఆడవాళ్లని... ముఖ్యంగా కాన్వెంటు టీచర్లు ఎవరినైనా ప్రశ్నించండి, ఎందుకమ్మా ఉద్యోగం చేస్తున్నావని...? వాళ్ల ఆయన బ్యాంకులోనో, ఫ్యాక్టరీలోనో పనిచేస్తూ ఉంటారు. ఆయనకు తోడుగా ఈవిడ ఉద్యోగం చేస్తుంది. ఏదో మా ఆయన వేణ్ణీళ్లు, నేను చన్నీళ్లు అంటుంది. ఆయన వేణ్ణీళ్లు, ఈవిడ చన్నీళ్లు బాగానే ఉన్నాయి కానీ ఇంట్లో పిల్లలకు కన్నీళ్లు అవుతున్నాయి కదా... అది కూడా గమనించుకోవాలి. అందుకని ఉభయుల కష్టాలు ఏ రకంగా ఉంటాయంటే -

**ఆఫీసరులవారి ఆగ్రహమ్మును సైచి**
**తాళి కట్టినవాని దర్పమోర్చి**

అటు ఆఫీసరుల వారి ఆగ్రహాన్ని భరించాలి. ఇటు భర్త ఆగ్రహాన్ని భరించాలి. రెండు వైపులా తట్టుకోవల్సిందే.

**ఆఫీసరులవారి ఆగ్రహమ్మును సైచి**
**తాళి కట్టినవాని దర్పమోర్చి**
**పైళ్ల కౌగిళ్లలో పరవశించుట నేర్చి**
**మగని కౌగిలి మాట మరచిపోయె**

పనంతా చేసి చేసి ఇంటికొచ్చాక ఇంక శృంగారం ప్రసక్తి భర్తకు మాత్రం ఏముంటుంది, భార్యకు మాత్రం ఏముంటుంది...

**పైళ్ల కౌగిళ్లలో పరవశించుటనేర్చి**
**మగని కౌగిలి మాట మరచిపోయె**
**సాటి ఉద్యోగుల సైగలు భరియించి**
**పాలకేడ్చుడు వాని గోల మాన్చి**

ప్రత్యేకం పాలకు ఏడ్చే పిల్లవాని సర్ది చూసుకోవాలి. ఆ పైన మనవాళ్లు... ఆఫీసులో ఉద్యోగులుంటారే, సైగలు చేయటంలో, పాటలు పాడటంలో నిజంగా సైగల్‌లాంటి వాళ్లే.

**సాటి ఉద్యోగుల సైగలు భరియించి**
**పాలకేడ్చుడు వాని గోల మాన్చి**
**ఉయ్యాల బస్సులో ఒత్తిళ్ల సహియించి**
**అతిథి దేవుళ్లతో అలసిపోయి**

ఈవిడ బస్సెక్కి వెళుతూ ఉంటుంది, ఉద్యోగానికి. ఈవిడ బస్సెక్కింది కదాని వెనకాల నలుగురు బస్సెక్కుతారు పాపం స్కూటర్లు మానేసి. ఈ ఒత్తిళ్లన్ని భరించుకోవాలి. అలిసిపోయి ఇంటికొచ్చే సరికి ఇద్దరు అతిథులు రెడీగా ఉంటారు, వాళ్లకు మర్యాదలు చేయాలి. ఇంత యాతన పడ్డం అంతా ఎలాంటిదయ్యా అంటే..

**వనిత ఉద్యోగములు చేయు ఘనత చూడ**
**శతవధానములేవియు సాటి రావు**

వంద అవధానములు చేసినా, శతవధానము ఏకంగా చేసినా ఈ ఉద్యోగినుల బాధకు సాటి రాదు, అయితే చివరి చమత్కారం ఏంటయ్యా అంటే ఈ పరుగెత్తేది పాల కోసమేనా..

**ఇంతయును చచ్చి చెడి గడియుంచుటెంత**
**ముఖముపై ఫెయిరులవ్లీలు పూసినంత**

ఆరువందలో, ఏడు వందలో ఇస్తారు. దాని కోసం 24 గంటలు శ్రమ పడటం. ఇది కాస్మోటిక్స్‌కు, ఫెయిర్ అండ్ లవ్లీలకు సరిపోతుంది. ఈ మాత్రానికి ఉద్యోగాలు చేయటం అవసరమా, కాదా అనేది వాళ్లు ఆలోచించుకుందురు గాక, మనకేల?

**◆ ఈ దేశంలో పుట్టి, పెరిగి, ఇక్కడే చదివి, ఇక్కడే శిక్షణ పొంది ధనాశతో విదేశాల్లో ఉద్యోగాలు చేస్తున్న యువత దృక్పథం మారే విధంగా పద్యం చెప్పండి.**

**- చింతలపాటి విశ్వనాథ్, లక్ష్మీ-శైలజ , గాంధీనగర్, విజయవాడ.**

భారత శాస్త్రవేత్తల ప్రభావ మపారము ధారుణిన్ సమా
చార విశేష విద్యనని చాటెను క్లింటను నిన్న మొన్న, ఇ
వ్వారు పరాయిదేశముల భాగ్యము పెంచుచు జన్మభూమికిన్
భారముకారె? అమ్మకుపవాసము లత్తకు పాయసమ్ములా?

**◆ దోమలు, పొగ,కాలుష్యంతో నిండిన మన రాజధాని భాగ్యనగరాన్ని వర్ణించండి?**

**- సోమయాజుల సుబ్రహ్మణ్యశర్మ, హైదరాబాద్.**

**కళ్లు నకళ్లు నిప్పులకు, కల్మషధూమపు మెట్టినిళ్లు, వా**
**కిళ్లను దోమగూళ్లు పడకిళ్లకు మళ్లను, రాళ్లతిళ్లు , ఒ**
**త్తిళ్లు సహస్రముల్, బయలుదేరిన వాడిలు జేరనట్టి ఆ**
**రళ్లు సహించి భాగ్యనగరమ్మున నుండగ దమ్ము కావలెన్**

వ్యాఖ్య: హైదరాబాద్‌లో ఉంటే కళ్లు చింతనిప్పులై పోవడం ఖాయం. పొగ, కాలుష్యం కారణంగా కళ్లు మంటలు తప్పవు. ఇంటి ముందే మురికి కాలువలు. అవి మురికి కాలువలు కావు, మురికి కట్టడాలు. కదలవూ, వదలవూనూ. అక్కడ చేరిన రాత్రి పూట రక్తపు విందులకోసం సుఖ నిద్ర

కోసం మన పడక గదుల్లోకి చేరతాయి. ఆ పయిన ఆహారంలో కల్తీ. అందువల్ల 'రాళ్ళ తిళ్లు' మన ఆరోగ్యం పాడు చేయడం ఖాయం. మన ఆరోగ్యాలు పాడవడానికి రెండే ప్రధాన కారణాలు. 1. తిళ్లు 2. ఒత్తిళ్లు.

ఈ రెండూ హైదరాబాద్‌లో దారుణంగా ఉంటాయి. ఇంకా పెద్ద ఒత్తిడి ఏమిటంటే బయటకి వెళ్లినవాడు తిరిగియింటికి వస్తాడని ఖాయంగా చెప్పలేం. ఎప్పుడు ఏ ప్రమాదమైనా జరగవచ్చు. ఇవన్నీ సహించి భాగ్యనగరంలో ఉంటున్నారంటే ఎంతో దమ్ముండాలి మరి!

◆ **'సరిగ, గరిమ, నిగమ, పదని' అనే నాలుగు పదాలు కూర్చి దిగజారుతున్న విద్యాప్రమాణాలపై పద్యం చెప్పండి.**

**-తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.**

**సరిగా పాఠము చెప్పరు**
**గరిమను చూపించలేని ఘన పాఠీలే**
**గురులని గమనింపనిచో**
**బరువుగ మార్చెదరు జ్ఞాన పద నిలయములన్**

వ్యాఖ్య: సరిగ్గా పాఠం చెప్పే గురువే లేడు. వారి గరిమ -అంటే ప్రజ్ఞ - చూపించనప్పుడు వారు ఘనపాఠి అయితే మాత్రం మన కేమిటి? పోనీలే గురువులు కదా అని ఏమీ అనకపోతే ఈ గురువులే జ్ఞానపథనిలయాలైన మన విద్యాలయాలకి బరువులుగా మారతారు.

◆ **నారిని పెండ్లాడి నారి నందను గనియెన్**

**- దేవరం సతీశ్ కుమార్, కరీంనగర్.**

**నారి కి లొంగనివానిని**
**వారింపగరాని మునిని, పరమశివుని, దు**
**ర్వార తపో మహిమన్ మద**
**నారిని పెండ్లాడి నారి నందను గనియెన్**

వ్యాఖ్య : నారి అంటే స్త్రీ. ఒక స్త్రీ మరో స్త్రీని పెళ్లిచేసుకొని నందనుణ్ణి (కొడుకుని) కూడా కన్నదట. అదీ సమస్య. 'నారి' కి ముందు 'మద' అనే మాట కలిపితే 'మదనారి' అవుతుంది. మదనుడంటే మన్మథుడు. అతనికి అరి (శత్రువు) శివుడౌతాడు. ఈ మార్పుతో సమస్య పరిష్కారం అయింది. ఇక మిగిలిన పద్యమంతా పూరణకోసం.

శివుడు స్త్రీలకు లొంగేవాడు కాదు. కాబట్టే పార్వతి ముందుగా ఎన్ని సేవలు చేసినా లొంగలేదు. ఆయన తపస్సును ఆవిడ మరలించ లేకపోయింది. అందుకే ఆయన్ని తపస్సుతోనే గెలవాలని నిర్ణయించుకొని చేసి, గెలిచి, పెండ్లాడి ఆపైన కుమార స్వామిని కన్నది గదా!

◆ **వీరప్పన్ దుర్మరణం మీద పద్యం చెప్పండి..**

**-యంజర్లపాటి కమలాకర్, బురహాన్ పురం, ఖమ్మం.**

**చావు తప్పలేదు లావు రాక్షసులకు**
**వరము లెన్నియున్న బ్రతుకలేదు**
**ఏన్గు దొంగ నేడు పీన్గుగా మారెగా**
**చేసి కొన్న కర్మ చేసినంత**

దుర్భేద్యమైన వరాలు కోరిన రావణ, హిరణ్య కశిపాది రాక్షసులు కూడా చివరికి చావక తప్పలేదు. వాళ్ల వరాలే వారికి శాపాలయ్యాయి. అలాగే వేల కొలదీ ఏనుగుల్ని చంపేసిన అడవిదొంగ వీరప్పన్ ఇప్పుడు పీనుగులా మారిపోయాడు. అందుకే చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ! అన్నారు.

అప్రస్తుత ప్రసంగం

**స్త్రీకి పెళ్లైతే 'శ్రీమతి' అంటారు. మగవారికి 'శ్రీ' చేరుస్తారు. దీని భావమేమి?** **-సామంచి సుబ్బలక్ష్మి, విశాఖపట్నం.**

పెళ్ళవగానే మగవారికి మతిపోయి అది స్త్రీలను చేరుతుంది. అందుకే స్త్రీని శ్రీమతి అంటారు. మగవారిని 'శ్రీవారు' అంటారు. ఎందుకో తెలుసా? పెళ్లయ్యాక ప్రతిరోజూ వాళ్లిద్దరి మధ్య 'వార్' ఖాయం. అందుకే 'శ్రీవార్'.

◆ **అక్కా రమ్మంచు మగడు ఆలిని పిలిచె ..**

**-జి. సాంబశివరావు, నంది వెలుగు**



**చక్కగ వంటలు చేసెడి**
**చుక్కా! ఈ వేళ కూర చురచులాడున్**
**అక్కట! భరియింపగ లే**
**నక్కార మ్మంచు మగడు ఆలిని పిలిచెన్.**

'అక్కా' ఇలారా, అంటూ భర్త భార్యను పిలిచాడట. ఇదీ సమస్య. ఇందులో 'అక్కారమ్మంచు' అనే మాటలో ఉంది కీలకమంతా. దాని అర్థం మార్చాలి. కాని దాన్ని మార్చకూడదు. కూరల్లో అప్పుడప్పుడూ కారం ఎక్కువవడం మామూలే గదా! 'ఆ+కారమ్ము' అని సంధి విడదీస్తే అక్కడ త్రికసంధి జరిగి 'అక్కారమ్ము' అవుతుంది. దానికి అంచు(అనుచు) అనేది కలిపితే మొత్తం మీద 'అక్కారమ్మంచు' అనే పదం తన రూపం మారకుండానే అర్థాన్ని మార్చుకుంటుంది. (ఇదీ మన తెలుగు భాషలో గొప్ప చమత్కారం. చిన్న అక్షరం మార్పుతో పదాలు, అర్థాలు, తాత్పర్యాలు కూడా మారిపోతాయి. అందుకే మనం ఉచ్చారణలో, వ్రాతలో స్పష్టత పాటించాలి)

ఇప్పుడు మారిన అర్థంలో పద్యం చదువుకోండి. అర్థం తేట తెల్లం అవుతుంది. భర్త భార్యతో అంటున్నాడట- ఎప్పుడూ చక్కగా వంట చేస్తావు కదా! ఈ వేళ ఏమిటీ కూర ఇంత కారంగా చురచుర మంటోంది. ఆ కారం (అక్కారమ్ము) నేను భరించలేను. ఒకసారి ఇలా వచ్చి నువ్వే చూడు అని పిలిచాడన్నమాట. భర్తలకు అన్నం పెట్టేసి భార్యలు సీరియల్సు చూసే రోజులు గదా! భార్యను పిలవాల్సి వచ్చిందన్న మాట. ఈ పద్యంలో కొసమెరుపు.

◆ **హాసమనెడి పత్రికసలు లేదు.**

**-కె.వి.రమణ, జైపూర్-ఒరిస్సా**

**బుల్లి తెరను వీడ బుద్ధి రాదయ్యోను**
**పత్రికలను చదువు భడవలేడు**
**చిత్రమయ్యె నేడు శ్రీనివాస ! మధుర**
**హాస! మనెడి పత్రికసలు లేదు.**

జనం అంతా రాత్రింబగళ్లు టి.వి. ముందు కూర్చుంటున్నారు. పత్రికలను చదివే వారే కరువయ్యారు. ఈ పరిస్థితుల్లో ఓ శ్రీనివాసా! మధుర హాసా! మనెడి (బ్రతకగలిగే) పత్రిక అంటూ ఏదయినా ఉందా! అని తెలుగు పాఠకుడు తన ఇలవేలుపయిన శ్రీనివాసునితో మొత్తుకుంటున్నాడు. ఈపద్యంలో 'హాసమనెడి' అనే మాటను విడదీసి 'హాస' అనే దాన్ని సంబోధనగా చేసి 'మధురహాస' (తీయని నవ్వుల వాడా!) అని శ్రీనివాసునికి విశేషణంగా వాడటం జరిగింది. 'మనెడి' అంటే మన్నడం, బ్రతకడం అనే అర్థాలున్నాయి కాబట్టి ఈ కాలంలో పత్రికలు మనగలగడం లేదనే భావం సరిపోయింది.

సమస్య 'హాసం' పత్రికను గురించి ఇచ్చినా ఆ ప్రస్తావనే లేకుండా సమస్యను పూరించడం జరిగింది.

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

### ప్రతి హృదయం ఊగుతుంది ఆనంద డోలిక

ప॥ ప్రతి హృదయం ఊగుతుంది ఆనందడోలిక
ప్రతి యింటా వెలుగుతుంది సౌభాగ్య దీపిక

చ॥ కలిమిలేముల అంతరాలనే కారుచీకటి తొలగితే
కష్టపడి పనిచేయు వారికి కాస్త ఫలితం మిగిలితే ॥ప్రతి హృదయం॥

చ॥ పాతరలలో దాచిపెట్టిన పసిడి ప్రజలకు కలిగితే
ప్రగతి సుగతికి దారిచూపగ పెద్దలందరు కదిలితే ॥ప్రతి హృదయం॥

చ॥ బానిసత్వపు వారసత్వము బీదజనులకు తీరితే
కష్టమొకరిది కలిమి ఒకరిది కాక జగమే మారితే ॥ ప్రతి హృదయం॥

### బృందగానం

| | |
|---|---|
| రచన | : శ్రీమతి డా॥ఎం.పద్మినీదేవి |
| సంగీతం | : ఎం. చిత్తరంజన్ |
| రాగం | : జం ఝూటి (28 వ మేళ కర్త హరి కాంభోజి రాగజన్యం) |
| తాళం | : చతురశ్రగతి (కర్ణాటక సం॥) -కహరువా (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : ప దసరి గ మ ప దని |
| అవరోహణ | : నిదపమగరిసనిదపదస |

షడ్జము, చతుశ్శృతి రిషభం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, చతుశ్శృతి ధైవతం, కైశికి నిషాదం - మేళకర్త రాగమైన హరికాంభోజిలోని యీ స్వరాలు పైన తెలుపబడిన క్రమంలో సంచారం కలిగివుంటాయి.

ఇంకా సరిగరిసనిదపదస (గ - సాధారణ గాంధారం) అంటూ సాధారణ గాంధార ప్రయోగంతోను, సనీదని పదస (ని$^2$ - కాకలి నిషాదం) అంటూ కాకలి నిషాద ప్రయోగంతోను కూడా యీ రాగంలో స్వర సంచారం వుంటుంది.

### స్వర రచన






మంద్రస్థాయి పంచమం నుండి ప్రారంభమై నిషాదం వరకే దీని సంచారం వుంటుంది కాబట్టి యీ రాగాన్ని మధ్యమ శ్రుతిలో పాడుతారు. పూర్వకాలంలో జానపద సంగీతంలో 'సెంజురుటి' అనే పేరుతో యీ రాగం ప్రచారంలో వుండేదని, తరువాత కాలక్రమేణ అది శాస్త్రీయ సంగీత రూపాన్ని సంతరించుకుని 'జం ఝూటి' గా మారిందని పండితులు చెబుతారు. శాస్త్రీయ సంగీతంలో యీ రాగం బాగా వాడుకలో వున్నదే. త్యాగరాజ స్వామి విరచితమైన 'రామ రామ రామ రామ రారా సీతారామా' మొదలగు కీర్తనలు , కొన్ని జావళీలు, తిల్లానాలు యీ రాగంలో వున్నాయి. బాలమురళీగారి "మరులు కొన్నానే" అనే జావళి, 'దిరనాతన దీంత దిరనా' అనే తిల్లానా వంటివి జం ఝూటి రాగంలో వున్నాయి. ఊత్తుక్కాడ్ వెంకటసుబ్బయ్య అనే వాగ్గేయకారుడు యీ రాగంలో రచన చేశారు. అన్నమాచార్య కీర్తనలు "నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు" మొదలైనవి యీ రాగంలో వున్నాయి. లలితసంగీతంలో యీ రాగాన్ని అరుదుగానే స్వరకర్తలు వినియోగించడం జరుగుతున్నది. సుప్రసిద్ధ కర్ణాటక సంగీత

విద్వాంసులు డా॥నూకల చిన్న సత్యనారాయణగారు కృష్ణశాస్త్రి విరచితమైన "ఈ జీవిక ఏనాడును ఏనెరుగను తీరిక - వాడక కలచును నామది వీడని ఒక కోరిక" అనే గేయానికి జంఝూటి రాగంలో చక్కటి బాణీని కూర్చారు. డా॥ రజనీకాంతరావు, పాలగుమ్మి విశ్వనాథంగార్లు కూడా యీ రాగంలో చాలా పాటలకు బాణీలు కూర్చారు. నేను కూడా యీరాగంలో కొన్ని పాటలను కంపోజ్ చేశాను. 'ప్రతి హృదయం ఊగుతుంది ఆనంద డోలిక', 'వచ్చెను కనవే ఆమని - వన్నెలు చిందే యామిని'(డా॥ పద్మినీదేవి రచనలు) మొదలైనవి ఆకాశవాణిలో ప్రసారమైనవి.

గొప్ప, బీద అనే తారతమ్యం తొలగి పోవాలి. మానవులందరూ ఒకటేనని అందరిలోనూ సమభావం కలగాలి. కష్టించి పనిచేసేవాడికి శ్రమకు తగిన ఫలితం రావాలి. పేదవారికి బానిసత్వం తొలగిపోవాలి. వారు కూడా స్వేచ్ఛగా జీవించాలి. ప్రజలందరూ సుఖసంతోషాలతో మనుగడ సాగించాలి. అలా అన్నీ సమకూడిన నాడే 'ప్రతిహృదయమూ ఊగుతుంది ఆనందడోలిక - ప్రతి యింటా వెలుగుతుంది సౌభాగ్య దీపిక' అంటూ మానవజాతికి చక్కని సందేశాన్ని అందించే యీ గీతాన్ని డా॥పద్మినీ దేవి రచించగా ఆకాశవాణిలో యీ గీతానికి నేను జంఝూటి రాగం ఆధారంగా బాణీని కూర్చి బృంద గీతంగా పాడించాను.

## జంఝూటి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. ఆలోకయే శ్రీ బాలకృష్ణం (నారాయణతీర్థ తరంగం) | శ్రుతిలయలు | వాణీజయరాం | కె.వి.మహదేవన్ |
| 2. పన్నగశయన పంకజనయన<br>నల్లనిస్వామి నారాయణ | రంగులరాట్నం | బి.వసంత, ఏ.పి.కోమల | యస్.రాజేశ్వరరావు<br>బి.గోపాలం |

## హిందీ సినీ సంగీతంలో మెలొడీల-మాధురిమ

### 1965



'ఊంచే లోగ్' చిత్రంకై చిత్రగుప్త అందించిన 'జాగ్ దిలే దీవానా రాత్ జాగీ' (రఫీ), 'ఆజారే మేరే ప్యార్ కే రాహీ' (లతా, మహేంద్రకపూర్), 'హాయ్ రే తేరే చంచల్ నైనవా, కుఛ్ బాత్ కరే...' (లతా) ప్రేక్షక శ్రోతల్ని విశేషంగా ఆకర్షించాయి. 'ఆధీ రాత్ కే బాద్' చిత్రంలోని 'బహుత్ హసీఁ హై తుమ్హారీ ఆంఖే..' (సుమన్, రఫీ), 'ఆకాశ్‌దీప్' చిత్రంలోని 'ముఝే దర్దే దిల్ కా పతా న థా..' (రఫీ) పాటలు హిట్ అయితే 'ఆకాశ్‌దీప్' చిత్రంలోని లతా సోలో 'దిల్ కా దియా జలా కే గయా..' పాటను మరచిపోగలరా!?

'ఎక్ సపేరా ఎక్ లుటేరా' చిత్రం కోసం రఫీ పాడిన సోలో గీతం 'హమ్ తుమ్‌సే జుదా హోకే...' రఫీ హిట్స్‌లో ఒకటిగా నిలిచింది. ఉషాఖన్నా ఈ చిత్రానికి సంగీతాన్నందించారు.

'మేరే సనమ్' చిత్రం కోసం ఆశా, రఫీ కాంబినేషన్‌లో ఓ.పి.నయ్యర్ అందించిన సంగీతం అందర్నీ విశేషంగా ఆకట్టుకుంది. 'పుకార్‌తా చలా హూ మైఁ, గలీ గలీ బహార్ కీ' (రఫీ), 'టుకడే హై మేరే దిల్ కే ఏ యార్ తేరే....'(రఫీ), 'హమ్‌దమ్ మేరే మాన్ భీ జావో...'(రఫీ), 'రోకా కయీ బార్ మైనే దిల్ కీ ఉమంగ్ కో....'(ఆశా, రఫీ), 'యే హై రేష్మీ జుల్ఫోఁ కా అంధేరా...'(ఆశా), 'జాయియే ఆప్ కహాఁ జాయేంగే...' (ఆశా)పాటలు ఈ చిత్రంలోనివే!

ఈ సంవత్సరం విడుదలై మ్యూజికల్‌గా హిట్ అయిన చిత్రాలలో చెప్పుకోతగినది 'షహీద్'. గీత రచయిత ప్రేమ్‌ధవన్ ఈ చిత్రానికి సంగీతాన్నందించటం ఓ విశేషమైతే ఈ చిత్రంలోని అన్ని పాటలూ హిట్ కావటం మరో విశేషం. 'పగడీ సంభాల్ జటా'(రఫీ, బృందం), 'సర్ఫరోషీకీ తమన్నా అబ్ హమారే దిల్ మే హై...'(రఫీ, మన్నాడే, రాజేంద్రమెహతా), 'జోగీ హమ్‌తో లుట్ గయే తేరే ప్యార్ మేఁ'(లతా), 'మేరా రంగ్ దే బసంతీ చోలా...'(ముకేష్, మహేంద్రకపూర్, రాజేంద్ర మెహతా), 'యే వతన్, యే వతన్, హమ్‌కో తేరీ కసమ్...'(రఫీ, బృందం) పాటలు అజరామరంగా చరిత్రలో నిలిచిపోయాయి. 2002లో భగత్‌సింగ్ మీద వచ్చిన ఏ సినిమా కూడా ఇంత చక్కటి మ్యూజికల్ హిట్ కాలేకపోయింది.



'వక్త్' చిత్రం ద్వారా రవి హిట్ సాధించారు. 'ఆగే భీ జానే న తూ, పీఛే భీ జానే న తూ...'(ఆశా), 'యే మేరీ జోహ్రా జబీన్...'(మన్నాడే), 'వక్త్ సే దిన్ ఔర్ రాత్..' (రఫీ), 'కౌన్ ఆయా కీ నిగాహోం మేఁ...'(ఆశా) ఈ చిత్రంలోని హిట్ గీతాలు. బి.ఆర్. చోప్డా ఫేవరేట్ రచయిత సాహిర్ లుధియాన్వీతో పనిచేయటానికి శంకర్ - జైకిషన్‌లు ఒప్పుకుని ఉంటే ఈ చిత్రానికి సంగీతాన్ని వారే అందించి ఉండేవారు.

'ఖాన్‌దాన్', 'కాజల్' ఈ సంవత్సరం రవి అందించిన మరికొన్ని మ్యూజికల్స్. 'ఖాన్‌దాన్' చిత్రంలోని 'తుమ్హీ మేరే మందిర్ తుమ్హీ మేరీ పూజా...'(లతా), 'నీల్‌గగన్ పర్ ఉడ్‌తే బాదల్...'(ఆశా, రఫీ), 'బడీ దేర్ భయీ నందలాల్...'(రఫీ), 'కాజల్' చిత్రంలో 'ఛూ లేనే దో నాజూక్ హోఠోం కో..'(రఫీ), 'యే జుల్ఫ్ అగర్ ఖుల్‌కే బిఖర్ జాయేతో అచ్ఛా'(రఫీ) 'మేరే భయ్యా మేరే చందా మేరే అన్‌మోల్ రతన్...' (ఆశా)పాటలు హిట్ కావటంతో పాటు సాహిర్- ఆశా కాంబినేషన్‌లోని చిరస్థాయిగా నిలిచిపోయే 'తోరా మన్ దర్పణ్ కహలాయే..' సూపర్‌హిట్ అయింది.

చిన్న సంగీత దర్శకులైనప్పటికీ 'సతీనారీ' (తుమ్ నాచో రస్‌బరసే... మహేంద్రకపూర్) ద్వారా పండిట్ శివరామ్, 'నూర్ మహల్' చిత్రంలోని 'మేరే మహబూబ్ న జా, ఆజ్ కీ రాత్ న జా..' (సుమన్ కళ్యాణ్‌పూర్) ద్వారా జానీ బాబు చక్కటి గుర్తింపు తెచ్చుకున్నారు.

# పెళ్ళిపుస్తకం

**దర్శకత్వం : బాపు**

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

**నవలీకరణ**
**ఇలపావులూరి మురళీమోహనరావు**

వెండితెర నవల
**19**

**జరిగిన కథ**

కుటుంబ బాధ్యతలున్న కృష్ణమూర్తి, భామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. అది భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలకు దారితీస్తుంది. శ్రీధరం బావమరిది గిరి, భామను బ్లాక్‌మెయిల్ చేయబోగా భామ బుద్ధి చెప్తుంది. వసుంధర బావను పెళ్లి చేసుకోబోతున్నాని కృష్ణమూర్తి తనకు ఫ్రెండు మాత్రమేనని చెప్పేస్తుంది. అది తెలియక అపార్థం చేసుకున్న భామ భర్తతో విడాకులు కోరుతుంది. శ్రీధరం షష్టిపూర్తి వేడుకల్లో బహుమతులిస్తారు కాబట్టి అప్పటిదాకా ఆగుదామంటాడు మూర్తి. భార్యాభర్తల మధ్య పొరపొచ్చాలు రావడం సహజం అంటూ శ్రీధరం దంపతులు స్టాఫంతటికీ చెబుతూంటారు.
**-(ఇక చదవండి)**

**మం**గళ మాటలు చెవుల్లో మార్మోగుతుండగా నడుస్తున్నది సత్యభామ. గెస్ట్‌హౌస్ దగ్గరున్న ఓ గదిని సమీపించగానే గదిలోంచి మాటలు వినిపించాయి.

"అబ్బా...కితకితలు..ప్లీజ్" అంటోన్నది వసుంధర.

"స్..షటప్ బాస్‌కుట్టి.." మగగొంతు వినిపించింది. అలా బాసుకుట్టి అని వసుంధరను పిలిచేది కృష్ణమూర్తి ఒక్కడే. మళ్ళీ ఏదో అనుమానం!

"బాస్ కుట్టియా? అంటే'? అది వసుంధర కంఠం.

"బాస్ కుట్టీ అంటే బాసుగారి కూతురు" మగకంఠం.

"ఓహో! అందుకా కె.కె. ఎప్పుడూ నన్ను బాస్‌కుట్టీ, బాస్‌కుట్టీ అనీ పిలుస్తాడు." తియ్యగా పలికింది వసుంధర స్వరం.

భామలో ఉద్రేకం పెరిగిపోయింది. అంటే ...లోపలున్నది కృష్ణమూర్తి కాదా? కిటికీ లోంచి తొంగి చూసింది.



లోపల అమెరికా అల్లుడు శేషు, వసుంధర ఉన్నారు. కాఫీ కలుపుతున్నది వసుంధర. ఆమె భుజం మీద చేతులు వేసి తన చేత్తో కలిపిస్తున్నాడు శేషు. "కాఫీలో వంచదార కలపడం ఇలాగన్నమాట..." అన్నాడు.

"ఊహూ..మరి టీ అయితే...?" కిలకిల నవ్వుతూ అన్నది వసుంధర.

"ఎడమ చేత్తో కలపాలి" చెప్పాడు శేషు.

"ఎలా అయితే నాకెందుకు?"

"నీకు వంటనేర్పించమని మా అక్క చెప్పింది".

"వంటెందుకు?"

"ఎందుకా ? నువ్వసలు ఆ కే.కేని కట్టుకుని ఉండాల్సింది. ఎందుకో వాతలు పెట్టి చెప్పేవాడు".

"పూర్ కె.కె. ..నిన్నేడ్పించడం కోసం అతన్ని పెళ్ళాడతానని ఆశపెట్టి ఆడించాను".

"పూర్ కె.కె.నా? వాడు బతకనేర్చిన వాడు. నువ్వే పూర్ వసువి".

"అంటే?"

"బాసు కూతురికి కోపం వస్తే ఉద్యోగం ఊడిపోతుందని భయపడి నిన్ను చేసుకునేట్లు నాటకమాడాడు. నిన్ను తోలుబొమ్మలా ఆడించాడు. నాకంతా చెప్పాడులే" అంటూ చెప్పాడు శేషు.

భామలో పశ్చాత్తాపం కడలి తరంగంలా లేచింది. తన భర్త ఔన్నత్యం తెలిసింది. తన తెలివితక్కువతనానికి బిగ్గరగా ఏడ్చింది. ఉత్తముడైన భర్తను అపార్థం చేసుకుందేకాక అతనితో కాపురాన్ని కాలదన్నుకుని వచ్చిన తన అవివేకానికి వగచింది. ఇంక ఒక్క క్షణం కూడా ఆలస్యం చెయ్యరాదు. తన కన్నీళ్ళతో పతిదేవుడి పాదాలను అభిషేకించి పాపప్రక్షాళనం గావించుకోవాలి. లేకుంటే తనకు పుట్టగతులుండవు.



"ఏమండీ" కేక పెడుతూ కృష్ణమూర్తి వైపు పరుగుదీసింది.

అది గమనించి కృష్ణమూర్తి కావాలనే తనను ఎవరో పిలుస్తున్నట్లుగా 'వస్తున్నా' అంటూ మరో వైపుకు వెళ్ళి ఎవరినో పలుకరించాడు.

"మీరేం చెప్పద్దు. చెప్పినా నేను వినను. విన్నా నమ్మను". అన్న తన తెలివితక్కువ వాగుడు గుర్తొచ్చి మరింత పెద్దగా ఏడ్చింది.

" అతడు ఉన్న వైపుకు పరుగెత్తింది. కృష్ణమూర్తి మరోవంక ఎవరినో చూస్తూ 'హాయ్.... కమింగ్ " అన్నాడు.

భామ ఏడుస్తూ పరిగెత్తుతుంటే ఆశ్చర్యంగా చూశాడు శ్రీధరం.

అక్కడ కిమోజీ "భామా..భామా...ఇట్రా.." అని పిలుస్తున్నాడు. కిమోజీ

దగ్గరకు పరుగెత్తింది భామ.

"మాత్రలేసుకోవాలి. కాఫీ,మంచినీళ్ళు తెమ్మని అరగంటైంది కదూ" ఓవర్ యాక్షన్ చేస్తున్నాడు కృష్ణాజీ.

"అలాగేనండి. తెస్తాను" అన్నది భామ.

భర్త దూరమౌతాడేమోనని బెదురు, నాటకం బయటపడితే పరువుపోతుందన్న ఆందోళన భామను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

"నీ కసలు లక్ష్యం లేదు" నలుగురూ చూస్తున్నారని మరింత గట్టిగా దగ్గుతూ అరిచాడు కృష్ణాజీ.

"కృష్ణాజీ గారు ...ప్లీజ్..."దుఃఖాన్ని దిగమింగుకుంటూ బ్రతిమిలాడింది భామ.

అంతలో కృష్ణమూర్తి ఒక ఆఫీసు బాయ్‌తో ఏదో పాకెట్ పట్టుకుని అటువైపు వెళ్తున్నాడు. "ఏమండీ....ఒక్క క్షణం .." పెద్దగా పిలిచింది భామ.



కానీ ఆ పిలుపు వినిపించుకోకుండా వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

అవును! తన భర్త పలుకుకు తాను అర్హురాలేనా? గతంలో ఆయన తను చెప్పేది వినమన్నప్పుడు ఎలా ప్రవర్తించింది? "దీని కూడా సంజాయిషీలుంటాయా" అని తను నిలదీసినపుడు "వుంటాయి. ఉన్నాయి. కానీ చెప్పను. ఎందుకో తెలుసా? అది వినవలసిన వారికి వినే యోగ్యత పోయింది" అని బదులిచ్చాడతను. నిజంగానే ఆ యోగ్యత తను కోల్పోయింది.

అతని వెంటనే పరుగెత్తింది భామ. శ్రీధరం దంపతులు హోమం పూర్తి చేసి దంపతి తాంబులాలు ఇవ్వడానికి సిద్ధమయ్యారు. వాటి నందుకోడానికి దంపతులు క్యూలో నిలబడ్డారు. కృష్ణమూర్తి అందరినీ వరుసగా పంపిస్తున్నాడు. భామ అక్కడకు పరిగెత్తు కొచ్చింది. భామ వెనుకే కృష్ణాజీ పరిగెత్తుకొచ్చాడు.

"శంకరంగారూ..నిలబడండి.. అమ్మా... ఒక్కడుగు వెనక్కు వెయ్యండి" లైన్లో నిలబడ్డ వారికి చెబుతున్నాడు కృష్ణమూర్తి.



భామను చూసి "భామగారూ... రండి.. ఆదర్శ దంపతులు. అగ్రతాంబులం మీదే.." అన్నాడు.

"ఏమండీ" దుఃఖంతో అన్నది భామ.

భామ వెనుకే నిలుచున్న కృష్ణాజీ తన పాత్రను అమోఘంగా పోషిస్తూ" ఎక్కువ సేపు నిలుచోలేను, మాత్ర మింగనేలేదు" అరిచాడు.

" మిస్టర్ కె.కె...వన్ సెకండ్.." అన్నది భామ.

కొండ్రావు వచ్చి "కొంచెం నువ్వు అలా ఉండమ్మా" అని భామను వెనక్కు పంపి తన భార్యను పిలిచాడు.

శ్రీధరం, మంగళ నూతన వస్త్రాలు, దక్షిణతో కొండ్రావుకు నమస్కరించి అందించాడు. "బాబాయ్ ..అంతా మీ చలువ" అన్నాడు చెమర్చిన కళ్ళతో కృతజ్ఞతా భావంతో!

"కాదు అంతా దేవుడి దయ, అమ్మాయి చేసిన పూజలు" అన్నాడు కొండ్రావు ఆశీర్వదిస్తూ.

భామ ఏడుస్తూనే ఉన్నది.

"వాళ్ళాయనకు నడుం విరిగింది. కేరళా వైద్యం చేయిస్తున్నది. మొత్తం కుటుంబానికంతా ఈ అమ్మాయి జీతమే ఆధారం " శ్రీధరంతో చెప్పింది మంగళ. ఆ మాటల్లో ఎంతో అప్యాయత!

భామకు ఏం చెయ్యాలో తోచడం లేదు. ఎదురుగా అసలు మొగుడు. పక్కనే కిరాయి మొగుడు!

"రామ్మా "పిలిచింది మంగళ.

"ముందుకు రండి" ఇద్దరినీ పిలిచాడు శ్రీధరం ఆదరంగా.

ఎదురుగా హోమజ్వాల ఎగిసి పడుతునే ఉంది. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన పతిని వదిలి కిరాయి భర్తతో తాంబూలం అందుకోవడం ఎలా? పాపభీతి భామను దహించి వేస్తున్నది. కృష్ణాజీ కూడా వీలైనంత పెద్దగా దగ్గుతూ "పద...పద.." అంటూ నెడుతున్నాడు భామను. భామ అడుగుముందుకు పడటం లేదు. కృష్ణాజీ దగ్గును కొనసాగిస్తునే చేతికర్రను ఊపుతూ కుంటినడక నడుస్తున్నాడు. ఆ చేతికర్ర ఊపడంలో హోమగుండం వద్దనున్న నెయ్యి గిన్నెకు తగిలి గిన్నెలో నెయ్యి ఒలికిపోయి హోమంలో పడి అగ్నిజ్వాల ఉవ్వెత్తున లేచింది. శ్రీధరం, మంగళ కంగారుగా వెనక్కు నడిచారు.



ఎగిసిపడుతున్న హోమాగ్ని జ్వాలను తదేకంగా చూడసాగింది భామ.

తాంబూలం అందుకోమ్మా" మళ్ళీ పిలిచాడు శ్రీధరం.

"కదులు...తాంబూలం అందుకో.." ఒత్తిడి చేస్తున్నాడు కృష్ణాజీ.

భామ పెద్దగా ఏడుస్తూ శ్రీధరం, మంగళ చేతుల్లోని తాంబూలపు పళ్లాన్ని నెట్టివేసింది. హద్దులు దాటిపోయిన మానసిక సంఘర్షణతో భామకు స్పృహ తప్పింది. ఇదంతా గమనిస్తున్న కృష్ణమూర్తి వేగంగా వచ్చి భామ కిందపడకుండా ఒడిసిపట్టుకున్నాడు. ఆమె కన్నీళ్ళను తుడిచాడు. కృష్ణమూర్తి ముఖంలో చిరునవ్వు. బాధపడొద్దని ఊరడింపు! భామలో దుఃఖం స్థానే మెల్లగా చల్లని మందహాసం!! తన పతిదేవుడు తనకు దూరం కాలేదన్న ఊరట!!



కృష్ణమూర్తి చేతుల్లో ఒదిగిపోయింది సత్యభామ.

తమ కళ్ళ ముందు జరుగుతున్న సంఘటనను చూసి నివ్వెరపోయారంతా.

"అరిచి నిజం చెప్పి నిన్ను నేను నమ్మించడంకంటే ఆ నిజమేదో నువ్వే తెలుసుకోవడం మంచిదని నేను నిన్ను బాధపెట్టాను. ఈ బాధ మంచిదే. అవసరం. అగ్నిలో నీ మనసు శుద్ధం అయిపోయింది. నీ కన్నీరు నీ గుండెను కడిగి శుభ్రం చేసింది. ఇంక కీడు క్రీనీడ కూడా మన మీద పడదు. ఇకనుంచీ మనపెళ్ళి పుస్తకంలో అన్నీ మంచీ పేజీలే. మన కథ మహా సరదాగా సాగిపోతుంది" అన్నాడు కృష్ణమూర్తి నవ్వుతూ.



చేయిచేయి అనించి లేచి శ్రీధరం, మంగళలకు నమస్కరించారు.

"సార్..మేమిద్దరం ఒక అబద్ధం ఆడి రెండు నిండు ప్రాణాలు కాపాడాలనుకున్నాం. అగ్నిసాక్షిగా పెళ్ళిచేసుకున్న భార్యాభర్తలం" చెప్పాడు కృష్ణమూర్తి.

నిర్ఘాంతపోయాడు శ్రీధరం.

"మిరిచ్చే పెద్దజీతాలకు ఆశపడి మొగుడు పెళ్ళాలం కాదని అబద్ధం చెప్పాం. ఇప్పుడు మా పెళ్ళికే గండం వచ్చింది. ఆరు నెలలు ఈ అబద్ధాన్ని పోషించినా, ఈ హోమాగ్ని ముందర, మీ పుణ్యదంపతుల ముందర,

అబద్ధం చెప్పలేకపోయాం. మాకు డబ్బువద్దు. ఉద్యోగాలు కూడా వదులుకుంటాం. మేం కోరేది మమ్మల్ని క్షమించమని" దీనంగా అర్థించారు కృష్ణమూర్తి,భామ.



షాక్ నుంచి తేరుకోలేక పోయాడు శ్రీధరం. "నేనూ... తెలిసే కాదు తెలియక కూడా తప్పు చెయ్యను అని నాకో ధీమా.. ఓ పొగరు. కానీ తప్పు చేశానని తెలిశాక మాత్రం బుకాయించను. సిగ్గులేకుండా తప్పు చేశానని ఒప్పేసుకుంటాను. ఇప్పుడూ ఒప్పుకుంటున్నాను. మీ బతుకులతో చెడుగుడాడినందుకు గాను, నా తప్పులకు నేనే జరిమానా వేసుకుని మీకొక లక్షరూపాయలు పైనుగా చెల్లించుకుంటున్నాను" అన్నాడు అందరి హర్షాతిరేకాల మధ్య.

శేషు, వసుంధరల దగ్గరికొచ్చింది మంగళ. కృష్ణమూర్తి, సత్యభామలను చూపించి" అమ్మా వసూ...పెళ్ళంటే ఇలాంటి స్నేహం. స్నేహానికి పునాది నమ్మకం, గౌరవం. విడిపోవాలనుకున్నా వీలవ్వని గట్టి బంధం. మీరు కూడా ఇంత చక్కని దంపతులుగా బ్రతకాలి, తెలిసిందా?" బోధించింది.

చేతిలో చెయ్యి కలిపి చిరునవ్వుతో వీడ్కోలు తీసుకున్నారు కృష్ణమూర్తి, సత్యభామ.



వెళ్తూ వెళ్తూండగా కృష్ణమూర్తి భామతో "అవునూ....నీకా కిమోజీ గాడెలా తెలుసు?" అన్నాడు.

"నారాయణా.." పక పక నవ్వింది సత్యభామ.

భారతంలో పద్దెనిమిది పర్వాలుండచ్చు. రామాయణంలో ఆరుకాండాలే ఉండచ్చు. కానీ జీవన భారతంలో ఎన్నో పర్వాలు. ఆలుమగలే రచయితలుగా సాగే పెళ్ళిపుస్తకంలో ఎన్నో పర్వాలు. ఎన్నో కాండాలు,ఎన్నో ఆశ్వాసాలు. కొన్ని తియ్యగా ఉంటాయి. కొన్ని చప్పగా ఉంటాయి. అన్నింటినీ సమదృష్టితో స్వీకరించి జీవన రామాయణాన్ని సమన్వయించుకుంటే అన్నీ సుందరకాండలే!

(ఈ వెండితెర నవలను స్వయంగా చదివిన వారికి, చదవగా విన్నవారికి, తద్వారా పొందిన ప్రేరణతో ఈ సినిమాను మళ్లీ మళ్లీ చూసినవారికి అందమైన సంసారాలు ఒనగూరాలని రమా'రమణుడు', 'లక్ష్మీనారాయణుడు' అయిన ఆ సర్వాంతర్యామి ఆశీర్వదించుగాక)

శుభమ్

శ్రీ సీతారామా ఫిలింస్

| | |
|---|---|
| పాటలు | : ఆరుద్ర |
| సంగీతం | : కె.వి.మహదేవన్ |
| సహాయకుడు | : పుహళేంది |
| నేపథ్యగానం | : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, పి.సుశీల, వాణీజయరాం, శైలజ, పూర్ణచందర్ |
| పాటల రికార్డింగ్ | : రవి (ఎ.వి.యం.'జి') |
| రీ-రికార్డింగ్ | : స్వామినాథన్ (కోదండపాణి ఆడియో లాబ్) |
| కెమెరా | : ఆర్.కె.రాజు |
| ఎడిటర్ | : అనిల్ మల్నాడ్ |
| కళ | : కె.రామలింగేశ్వరరావు |
| నృత్యం | : శీను |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : శ్రీరమణ |
| స్క్రీన్‌ప్లే- మాటలు- నిర్మాత | : ముళ్లపూడి వెంకట రమణ |
| దర్శకుడు | : బాపు |
| కథ మూలం | : రావి కొండలరావు |
| సహకార దర్శకులు | : కె.వి.రావు, డి.కనకసేన |
| మేకప్ | : శ్రీనివాసరావు, నాగేశ్వరరావు, సుబ్బారావు |
| దుస్తులు | : పెద్దిరాజు, ప్రసాద్ |
| డైలాగ్ రికార్డింగ్ | : రెడ్డి, రాజశేఖర్ (ప్రసాద్ ఫిల్మ్ లేబ్, హైదరాబాద్) |
| స్పెషల్ సౌండ్ ఎఫెక్ట్స్ | : సేతు |
| ప్రొడక్షన్ ఇన్‌చార్జ్ | : సి.ఎస్.ఆర్.బాబు |
| స్టిల్స్ | : శ్యామలరావు |
| సహాయకుడు | : రమేష్ |
| పబ్లిసిటీ | : లంకభాస్కర్ |
| సహాయకుడు | : రమణ |
| ప్రెస్ రిలేషన్స్ | : ఉమామహేశ్వరరావు |
| పోస్టర్ ప్రింటింగ్ | : దినకర్ లిథో ప్రింటర్స్(విజయవాడ) |
| ప్రోసెసింగ్ అండ్ ప్రింటింగ్ | : ప్రసాద్ ఫిల్మ్ లెబొరేటరీస్ (ప్రై) లిమిటెడ్ (హైదరాబాద్) |
| ఔట్‌డోర్ యూనిట్ | : పద్మాలయా (హైదరాబాద్) ఆనంద్ సినీ సర్వీస్ (హైదరాబాద్) |
| స్టూడియోస్ | : పద్మాలయా (హైదరాబాద్) అన్నపూర్ణా (హైదరాబాద్) |
| స్పెషల్ ఎఫెక్ట్స్ | : అజీమ్, సత్యనారాయణ (ప్రసాద్ ప్రొడక్షన్స్ ప్రై లిమిటెడ్) |
| ఆఫీస్ నిర్వహణ | : సి.హెచ్.వి.సత్యనారాయణ(మద్రాస్) విఠల్ రెడ్డి, వెంకటేశ్వరరెడ్డి (హైదరాబాద్) |

**సహాయకులు**

| | |
|---|---|
| ఫోటోగ్రఫీ | : దాస్, హనుమంతు, గణేష్, శీను |
| ఎడిటింగ్ | : రాజా, శీను |
| సౌండ్ | : రత్నవేలు |
| మేకప్ | : నాని, చంద్ర |
| కళ | : లింగం, అర్జున్, రవి |
| నృత్యం | : దుర్గాప్రసాద్, రీటా |
| దుస్తులు | : జయచంద్ర, చలపతి |
| నిర్మాణం | : రమేష్, వెంకటేశ్వరరావు, కృష్ణ, సుబ్రహ్మణ్యం, కురుపయ్య |
| ట్రాన్స్‌పోర్ట్ | : ప్రభాకర్, రషీద్, రెడ్డి, మూర్తి, సెల్వం, కృష్ణ |
| జూనియర్ ఆర్టిస్ట్ సప్లయ్ | : మోహన్ , చెన్నప్ప |

**తారాగణం :**

రాజేంద్రప్రసాద్, దివ్యవాణి,సింధూజ, గుమ్మడి, సుధాకర్, ఝాన్సీ, రాధాకుమారి, రావి కొండలరావు, సాక్షిరంగారావు, శేషు, శాఖమూరి వేణుగోపాల్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, అశోక్‌కుమార్, యం.యస్.ఆర్.మూర్తి, విజయ్‌కుమార్, నర్రావుల రాము, కట్టా రాంబాబు, అనంత్, గణపతిశాస్త్రి, తిలక్, మధుసూదనాచార్య, విజయ, శ్రీనివాస్, కె.వి.వి.పంతులు

# జీవనంలోనూ..,
# మరణంలోనూ...



19.11.1917 - 31.10.1984

"దేశసేవలో నేను మరణించినా అది నాకు గర్వకారణమే! నా ఒక్కొక్క రక్తబిందువు ఈ జాతి అభ్యుదయానికి తోడ్పడుతుందని, దాన్ని మరింత చైతన్యవంతం చేసి బలోపేతం చేస్తుందని నా నమ్మకం."

- ఇందిరాగాంధీ

**ఉగ్రవాదానికి వ్యతిరేకంగా కడదాకా పోరాడతామని**
**జాతి పునః ప్రతిజ్ఞ చేస్తున్నది**

సమాచార ప్రసార మంత్రిత్వ శాఖ, భారత ప్రభుత్వం

davp 2004/375

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కొమ్మా కొమ్మా కోకిలమ్మా 18



- ఇంద్రగంటి జానకీబాల

సినిమా పరిశ్రమలో ధగధగ మెరిసే తారామణులు కొందరుంటే, వారికి సుదూరంలో మినుకు మినుకుమనే తారలు మరికొందరు వుంటారు. ఆకాశంలో ఆ తారల వైపు చూసినప్పుడు అనిర్వచనీయమైన ఆనందం కలిగినట్లుగానే అప్పుడప్పుడు తెరమీద వెలిగే ఈ మినుకు మినుకుమనే తారల్ని చూసినప్పుడూ ఎంతో ఆనందం కలుగుతుంది.

పాడుతూ నటించిన వారు కొందరు కొన్నాళ్ళు పోయాక కేవలం నటనకే పరిమితమై పాటని వదిలేసిన సందర్భాలు కనబడతాయి. ముప్ఫై ఏళ్ళు దాటితే హీరోయిన్‌గా పనికిరారు. అక్కలుగా, వదినలుగా, మోసగింపబడిన అభాగినులుగా పాత్రలు పోషించవలసిందే. నిజానికి వారు పాటని నమ్ముకుని, నేపథ్య గాయనుల పోటీకి తట్టుకోగలిగితే కొన్నాళ్లు ప్లేబ్యాక్ పాడచ్చు. గాత్రాన్ని కాపాడుకోవాలి. దీక్షగా పాట మీదే మనసు నిలపాలి. అది ఒక్కోసారి అసాధ్యమవుతుంది. అందుకే చాలామంది నటనకే పరిమితమై, నటననే ఆశ్రయించుకుని వుండిపోయారు.

టి.జి.కమలాదేవిని గురించి ప్రస్తావించుకుంటే మహా చక్కని విషయాలు తెలుస్తాయి. ఆమె ఏ సినిమాలో ఏ పాత్ర పోషించినా, ఏ పాట పాడినా చక్కగా అతికినట్టుగా అందంగా అమరిపోతుంది. మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తుంది. అయినా ఆమెకు వచ్చిన పాత్రలు తక్కువే- పాడిన పాటలూ తక్కువే. దీని మర్మం ఎంత ఆలోచించినా అర్థం కాదు. ఇది కూడా సినిమా పరిశ్రమలో అర్థం కాని రహస్యం.

చిత్తూరు జిల్లా కార్వేటినగరంలో తోట కృష్ణస్వామినాయుడు, లక్ష్మమ్మలకు 1929, డిసెంబరు 29న జన్మించిన కమలాదేవి చాలా చిన్న వయసులోనే అపురూపమైన కళానైపుణ్యాన్ని ప్రదర్శించారు. ఆమె పదకొండేళ్ళ




వయసుకే శాస్త్రీయ సంగీతం నేర్చుకుని అందులో పాండిత్యం ప్రదర్శించగల శక్తి సంపాదించారు.

విద్యార్థిని దశలో 'కనకతార' నాటకంలో తార పాత్ర ధరించి, అందర్నీ మెప్పించి తన నట జీవితానికి నాంది పలికారు. చదువుకి స్వస్తిచెప్పి, నటనయందు తన దృష్టిని నిలిపారు. రంగస్థల నటిగానే కాక, రేడియోలో నాటక కళాకారిణిగా గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నారు. ఈమె రేడియోలో నాటకాలు వేయడమే కాదు, లలిత సంగీత గీతాలు అనేకం పాడారు. పదకొండవ ఏటనే ఓడియన్ గ్రామఫోను కంపెనీ వారికి 'లవకుశ' గ్రామఫోను రికార్డు యిచ్చారు.

పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో ముఖ్యపాత్రలు పోషించారు. 'సావిత్రి'లో నారదుడు, 'వరూధిని'లో వరూధిని, 'కీచకవధ'లో ఉత్తర, 'తులాభారం'లో కృష్ణుడు, ఇలా సత్యభామ, సక్కుబాయి, మనోరమ, రుక్సానా, దమయంతి, తులసి లాంటి పాత్రలు రంగస్థలం మీద చేసి, గొప్ప పేరు సంపాదించు కున్నారు. స్థానం, బందా, సి.ఎస్.ఆర్., ఏ.వి.సుబ్బారావు, రఘురామయ్య, సూరిబాబు, జగ్గయ్య వంటి మహానటుల సరసన నటించి భేష్ అనిపించుకున్నారు. కమలాదేవి పాడిన లలితగీతాల గ్రామఫోను రికార్డులు అందర్నీ ఎంతో అలరించాయి. టి.జి.కమలాదేవి పాడుతూ నటించే నటిగా సినీరంగ ప్రవేశం చేశారు.

"చిత్తూరు వి. నాగయ్యగారి ప్రోత్సాహంతో, ఆశీర్వాదంతో నేను సినీరంగ ప్రవేశం చేశాను. నా గురించి నాగయ్యగారి ద్వారా విన్న వాహినీ సంస్థవారు నన్ను పిలిపించి, నన్ను మూడు సినిమాలకని అగ్రిమెంట్ యిచ్చారు. వాటిలో 'సుమంగళి' అనే సినిమాలో ఒక

ముఖ్య పాత్ర పోషించవలసి వుంది. కానీ నేనా పాత్ర వేయలేదు. ఆ తర్వాత అదే సంస్థ నిర్మించిన 'గుణసుందరికథ', 'మల్లీశ్వరి'లలో నటించాను. నాకు వాటిలో మంచి పేరొచ్చింది" అంటారు కమలా చంద్రబాబు.

"నిజమే! నేను సినిమాల్లో చేయగలిగినన్ని చిత్రాలు చేయలేదు. కారణం చెప్పడం కష్టం. కానీ చేసినవి మంచి చిత్రాలనే సంతృప్తి నాకుంది".

ఈమె "చూడామణి" చిత్రంలో సి.ఎస్.ఆర్. చెల్లెలుగా (అదే తొలిచిత్రం), 'దక్షయజ్ఞం' లో రోహిణి పాత్ర, హెచ్.ఎమ్.రెడ్డి గారు దర్శకత్వం వహించిన 'తెనాలిరామకృష్ణ' అలాగే 'పార్వతీకల్యాణం', 'గరుడగర్వభంగం', 'సీతారామ జననం'లలో రకరకాల పాత్రలు ధరించారు. గూడవల్లి రామబ్రహ్మంగారి 'మాయలోకం', 'ముగ్గురు మరాఠీలు', 'పల్లెటూరు', 'చక్రపాణి', 'తోడుదొంగలు' మొదలైన చాలా సినిమాల్లో నటించినా ఆమె 'పాతాళభైరవి' లో చేసిన నృత్యం, పాట "ఇతిహాసం విన్నారా - ఆ అతి సాహసులే వున్నారా" ఎంతో ప్రజాదరణ పొంది, ఆమెనందరూ గుర్తుంచుకునేలా చేసింది. అలాగే 'గుణసుందరి కథ'లో చివరి భాగంలో పరమశివుడూ పార్వతీ కోయవాళ్ళలా వచ్చి పాడిన పాట, నడిపిన కథా అందర్నీ ఎంతో ఆకర్షించింది.

"ఢమ ఢమ ఢమ ఢమ - ఢమరుక నాదం
వరమశివేదం- వరమ రహస్యం
తెలుసుకోండయా"

అందరి పెదవులపైనా అప్పట్లో తారట్లాడింది. 'మల్లీశ్వరి'లో రాణివాసంలో మహారాణిగారి ఇష్టసఖి భానుమతి అయితే భానుమతికి అంతరంగికురాలు, సఖీ కమలాదేవి (జలజపాత్ర). ఈ పాత్రలో ఆమె ఎంతో సంయమనంతో నటించి, భానుమతి సరసన ధీటుగా నిలిచారు. ఆ సినిమాలో ఆమె పాడిన 'ఝుంఝుంఝుం' పాట, అభినయం ఆ కథకే మలుపునిచ్చి కమలాదేవిని మర్చిపోకుండా చేశాయి. ఆమె డైలాగ్ చెప్పే విధానం చాలా సహజంగా వుంటుంది. అభినయించే తీరు సున్నితంగా వుంటుంది.

"రేడియో నాటకాలలో తిరుగులేని కళాకారిణిగా వుంటూ, సినిమాల్లో కాస్త వెనుకబడ్డారా?" అంటే

"కావాలని నేను వెనుకబడలేదు. అక్కడుండే పాలిటిక్స్ వల్ల కొంత, వేషాలు వేసుకునే బతకవలసిన అవసరం లేకపోవడం వల్ల కొంత నేను ఎక్కువ సినిమాలు చేసే అవకాశాలు రాలేదు" అన్నారు నవ్వుతూ.

ఆమె భర్త ఇంజనీర్ కావడం, సుఖమైన, చిరాకులు లేని కుటుంబంలో ఇమిడిపోవడం ఆమె ఎంతో ఆనందంగా చెప్తారు. అంజలీదేవి నటించిన 'గొల్లభామ' చిత్రంలో ఆమెకి కమలాదేవి ప్లేబ్యాక్ పాడారు. వివాహం తర్వాత ఆమె కమలా చంద్రబాబుగా ప్రసిద్ధి పొందారు.

కొన్నాళ్ళు పరిశ్రమకి దూరంగా వున్నప్పటికీ తర్వాత 'కంచుకోట','పెత్తందార్లు', 'కథానాయకుడు', 'బంగారు పంజరం', 'బంగారు సంకెళ్ళు', 'అసాధ్యుడు' చిత్రాలలో నటించారు.

ఏమైనా ఆమె పాడిన పాటలు చక్కగా వున్నప్పటికీ అవే ప్రధానపాత్రలు కానందున అవి ఒక పక్కగా వుండిపోయాయి.

'గుణసుందరి కథ'- ఈ వనిలో కోయిలనై, 'సీతారామజననం'లో -ఆహా ఆహా<నా జన్మ తరియించెనుగా (అహల్య పాత్రకి), 'త్యాగయ్య'లో - ఏ పూజ చేసేవో (పేరంటాళ్ళ పాట), 'ముగ్గురు మరాఠీలు'లో - ఫిరోజి నా చిన్నిబావా పాటలు గురించి ఆ కాలం వాళ్ళు తల్చుకుంటారు. గొప్పగా చెప్పుకుంటారు. 'భక్తరామదాసు'లో కన్నాంబకి ఒక పాటకి గళమిచ్చారీమె.

"తెరమీద కనిపించినప్పుడు మగవారి కళ్ళను ఆకర్షించే శక్తి ఆమెలో లేదు. చాలా మంచిగా, సుగుణాలరాసిగా వుంటే అంతవరకు బాగానే వుంటుంది గానీ, మళ్ళీ మరో సినిమాకి బుక్ అవడం జరగదు" అంటారు సినిమాల విమర్శలో ఆరితేరిన కొందరు. ఇది మగదృష్టి కావచ్చు.

బి.సరోజాదేవి, పద్మినిలాంటి వారికి ఆమె గాత్రం అరువిచ్చారు. డబ్బింగ్ చెప్పారు.

ఇంతవరకు కమలా చంద్రబాబు గురించి ఒకవైపు తెలుసుకున్నాం. మద్రాసులో వున్న చెన్నపురి ఆంధ్ర మహాసభతో ఆమెకెంతో అనుబంధం వుంది. ఆమె 1950లో అందులో మెంబరయ్యారు కానీ 1956నుంచి ఆమె కార్యదర్శిగా వున్నారు.

కమలా చంద్రబాబు బిలియర్డ్స్, స్నూకర్ ఆటలలో అత్యంత ప్రవీణురాలు. అఖిల భారతస్థాయిలో ఈ ఆటలలో అనేక ట్రోఫీలు గెలుచుకున్నారు.

చెన్నపురి ఆంధ్ర మహిళా సభలో ఇప్పటికీ కీలక పాత్ర వహిస్తూ, అక్కడ సాంస్కృతిక, కళా, క్రీడా రంగాల అభివృద్ధికి కృషి చేస్తున్నారు. యువతరానికి బిలియర్డ్స్, స్నూకర్ ఆటలలో తర్ఫీదు నిస్తున్నారు. జాతీయస్థాయిలో క్రీడా రంగంలో మంచి గుర్తింపు పొందిన కమలాచంద్రబాబు, నటి, గాయని, క్రీడాకారిణి-అయినా ఆమె సౌమ్యశీలి. సినిమా ట్రిక్కులు తెలియని మాములు మహిళ. ఇంటికొచ్చిన వారిని గౌరవిస్తూ ప్రేమగా, ఆదరంగా చూడటంలో ఆమె వ్యక్తిత్వం తెలుస్తుంది.

ఇప్పటికీ వయసు గురించి ఆలోచించక, చలాకీగా తిరుగుతూ, మాట్లాడుతూ అతిథుల్ని అప్యాయంగా వలకరిస్తూ వుండే కమలాచంద్రబాబు సినిమా రంగంలో గుర్తుంచుకోదగ్గ తారామణి.

## కమలాదేవి హిట్స్

**చిత్రం : మల్లీశ్వరి రచన : దేవులపల్లి కృష్ణశాస్త్రి**
**సంగీతం : సాలూరి రాజేశ్వరరావు**

ఝమ్ ఝమ్ ఝమ్ ఝమ్ ఝమ్ ఝమ్
తుమ్మెదా తుమ్మెదా దిగులెందుకు తుమ్మెదా
వగపెందుకు తుమ్మెదా
వన్నెలు వన్నెల పువ్వులు కన్ను విప్పి చూచెనోయ్
చిన్ననాటి వలపు మరల చివురులెత్తి పూచెనోయ్
పొద పొదలో నీ కోసము పొంచి పొంచి చూసెనోయ్
పువు పువులో తేనెలూరి పొంగి పొంగి పొరలెనోయ్

**చిత్రం : గుణసుందరి కథ**
**రచన : పింగళి నాగేంద్రరావు**
**సంగీతం : ఓగిరాల రామచంద్రరావు**

ఈ వనిలో కోయిలనై, కోయిలపాడే గానమునై
గానముకోరే చెవినై , నా చెవిలో నేనే ధ్వనిస్తా
మింట చనే మేఘమునై, మేఘము లోని చంచలనై
చంచలకోరే గురినై, నా గురిలో నేనే నటిస్తా॥
నా హృదిలో మోహమునై, మోహము చూపే ప్రేమమునై
ప్రేమనుకోరే ప్రియునై, నా ప్రియునీ నేనే వరిస్తా॥

**చిత్రం : పాతాళ భైరవి**
**సంగీతం : ఘంటసాల**
**రచన : పింగళి నాగేంద్రరావు**

ఇతిహాసం విన్నారా - ఆ
అతి సాహసులే ఉన్నారా
హెచ్చరికో - హెచ్చరిక - హై
హెచ్చరికో - హెచ్చరిక
యక్షుల నిధులు అందరివండీ
ప్రక్షిప్తాలవి పాతాళంలో
రక్ష వుంటవీ... లక్షశక్తులూ
దక్షసాహసికె దక్కేనండోయ్ ॥ఇతి॥
జగతి సాహసమె జయకథ కాగా
యుగయుగానికొక కథానాయకుడు
జగన్మంగళము సాధించేనూ
ప్రగల్భమణిగా వెలిగేనూ... ॥ఇతి॥
శూలాగ్రానికి సూటిగ గురియై
క్రీలిన సాహస విక్రమార్కుడు
మట్టిబొమ్మలను మహారణానికి
జట్టునడిపినా శాలివాహనుడు ॥హెచ్చ॥
విజయసాధనల వింతకథలతో
ఉజ్జయినీపురి నుజ్వలించిరే ॥హెచ్చ॥
నాటివారివలె నేటివారునూ
చాటగలరయా సాహసమంటూ
ఘాటుఘాటుగా కథ నడిపింపగ
నేటికెవడు మరి కథానాయకుడు.
నీవా....నీవా...నీవా...

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు



**భమిడిపాటి వెంకటేశ్వరరావు (రుద్రారం)**

ప్ర॥ చమత్కారి అయిన కండక్టర్?

జ॥ మీ 'ఆర్టీసీ' వారు ప్రదర్శించిన నాటకంలో నీదే పాత్ర అనడిగితే ఏదో 'చిల్లరపాత్ర' యిచ్చారులే అని బదులు చెప్పేవాడు.

**ఆదిరాజు, చక్రపాణి (చందానగర్)**

ప్ర॥ తినలేని పళ్లు, తియ్యగా ఉండని పళ్ళు ఏమిటి?

జ॥ మిరపపళ్ళు.

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| ఆది | - | ఆనేటి దివాకర్ |
| సోమ | - | సోడిపల్లి మంజుల |
| మంగళ | - | మందిగ సరళ |
| బుధ | - | బుడుమూరు ధనరాజ్ |
| గురు | - | గున్నా రుక్మిణి |
| శుక్ర | - | శున్నేపాటి చక్ర |
| శని | - | శంఖాల నిరంజన్ |

**-బి.వెంకటరావు, కె.యమ్.పేట.**

## పేరు - రిపేరు




మా అన్నయ్య - ధర్మదాత - మా వదిన - మా ఇంటి మహాలక్ష్మి-
మా బాబు - సిసింద్రీ చిట్టిబాబు.

**-పి.వి.యల్. ప్రశాంతి, హైదరాబాద్.**

దోస్త్ - నీకోసం - నేనున్నాను

**- దేవుల పల్లి రామమూర్తి, విజయవాడ.**

ఆ నలుగురు - మాస్ - ఐతే ఏంటి

**- వి. సునీల్‌రెడ్డి, విశాఖపట్నం.**



## చిలిపి లిపి




*

| | | |
|---|---|---|
| 1/2 కు | - | అరకు |
| TT రు | - | పైరు |
| Sun daughter | - | సూర్యకుమారి |
| Cell bird | - | జైలుపక్షి |

**-కె.పి.ఆర్. శర్మ, కర్నూలు.**

## డబుల్ రోల్




భారతీయ మహిళ **చీరకట్టు**తోనే **ఆకట్టు**కుంటుంది

**వాలు** చూపుతోనే కొందరు మహిళలు స**వాలు** చేస్తారు

**వగలు** కూడా వనితకు **నగలు** వంటివే!

**ప్రసన్న** బాగా **సన్న**బడింది!

**పోటా** పోటీగా స**పోటా**లు తింటున్నారా?

**- బద్ది నాగేశ్వరరావు, అనకాపల్లి**

# పేరడీ పెరేడ్







సాకీ : ఇల్లంత రోతగా గోడంత మరకగా
ఒళ్లంత కంపుగా మారిపోయే...
గ్యాసేమో అందదు.... కిరోసిన్ను దొరకదు...

పల్లవి : పేడను తెచ్చి... పిడకలు చేసి..
కొట్టేము గోడకు బారుగా
ఎండలో ఉంచి పొయ్యిలో పెట్టి
చేసేము వంటను బాధగా .... ॥పేడను॥

చరణం: అడవుల్ని సృష్టించినావు, దయతో నీవు
వాటిని వండేందుకే మేము వాడేములే
అడవుల్ని సృష్టించినావు, దయతో నీవు
వాటిని వండేందుకే మేము వాడేములే
కలపంత తరిగి వనరంత మిగిలి
గాఢాంధకారాన రగిలేములే
ఏ దిక్కులేక... బేజారు కాగా...
ఏ దిక్కులేక... బేజారు కాగా...
ఈ పిడకలే మాకు దిక్కాయెలే... ॥పేడను॥

చరణం: గ్యాస్ స్టవ్‌లను పంచేసినారు ఏలిన వారు
అందుకు ఆనందముగ మేము పొంగేములే
సబ్సీడీ కోత, బడ్జెట్టు మోత
దాంతో అటకెక్కిపోయేనులే
కిరోసిన్ను కూడా భగ్గనీ మండా
కిరోసిన్ను కూడా భగ్గనీ మండా
ఈ పిడకలే మాకు దిక్కాయెలే... ॥పేడను॥

(దేవత సినిమాలో "బొమ్మను చేసి ప్రాణము పోసి" పాటకు పేరడీగా...)

**-యం. అంజిరెడ్డి, ఒంగోలు.**

# చిలిపి కవిత



ప్రియా !
నా కళ్లల్లో కన్నీళ్లు
అవిశ్రాంతంగా
ఇవ్వాళ నువ్వు నా పక్కన ఉంటే ఎంత బావుండేది!
ఈ రెండు కిలోల ఉల్లిపాయల్ని తరిగే దానివిగా ...

**-యస్.వి.మహేష్‌బాబు, చిత్తూరు.**

# ఈ రూటే వేరు




Quarter hens -పావుకోళ్ళు

**-దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

చారుమతి - ఏ పనికైనా నాలుగు రకాలుగా ఆలోచించేది లేదా వంట వండాలనుకున్నప్పుడు చారుతప్ప ఇంకేమి మతిలోనికి రానివ్వనిది.

**-రాధాకృష్ణ, చిత్తూరు.**

గోరోజనం - గోళ్ళు పెంచే జనం.

**-పి. ప్రియాంక, విశాఖపట్నం.**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన యం. అంజిరెడ్డి-ఒంగోలు గారికి 'సామ్రాట్' ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**

SOHAN MUSIC



# జంధ్యా మారుతం





13

ఇది ఒక తెలుగు మాస్టారి లైఫ్ స్టోరీ! తండ్రి గారాబంతో పెంకి ఘటంలా మారి... నోరు విప్పితే బూతులే తప్ప ఇంకే మంచి మాట రాని మొండి కుర్రాడిని దారిలో పెట్టి 'రాముడు మంచి బాలుడు' లా తయారు చేసి ఓ తెలుగు మాస్టారు మోగించిన విజయభేరి!!

సింపుల్‌గా చెప్పాలంటే ఓ టీచర్‌కీ, స్టూడెంట్‌కీ మధ్య జరిగిన కథ ఇది. తల్లితండ్రులు తమ పిల్లల్ని ఎలా క్రమశిక్షణలో వుంచాలో, శ్రుతి తప్పిన బాలరాగాన్ని ఎలా దారిలోకి తెచ్చుకోవాలో ఈ సినిమాలో స్పష్టంగా విత్ కామెడీ టచ్‌తో చూపించారు జంధ్యాల.

అజ్ఞానాన్ని పారద్రోలి జ్ఞానబోధ చేసే ఉపాధ్యాయ వృత్తి పరమ పవిత్రమైన వృత్తి. ఈ చిత్రంలోని పాత్రలు, స్వభావాలు, హాస్యరస పోషణకి ఉద్దేశించినవే తప్ప ఉపాధ్యాయుల్ని కించపరచడానికి కాదని టైటిల్స్‌కి ముందే ప్రేక్షకులకి జంధ్యాల సగౌరవంగా మనవి చేసుకున్నారు .

జంధ్యాలకు ఆప్తుడైన ఆదివిష్ణు ఈ చిత్రానికి కథనందించారు. "నవల రాద్దామని తయారు చేసుకున్న కథాంశమిది. ఈలోగా జంధ్యాలకు నచ్చి తెరకెక్కించడం జరిగింది. 'హై హై నాయకా' టైటిల్ కూడా నేనే చెప్పాను. ఈ సినిమాలో బూతు రాయడానికి ఆస్కారమున్నా గానీ వీసమెత్తు కూడా ఆ ప్రయత్నం చేయలేదు. జంధ్యాలతో నేను కలిసి పని చేసిన ఆఖరు సినిమా ఇదే. అలాగే రచయితగా కూడా నాకిదే అఖరి సినిమాగా చెప్పొచ్చు" అని చెప్పారు ఆదివిష్ణు.




ఆదివిష్ణును జంధ్యాల గురువులా ట్రీట్ చేస్తారనడానికి ఈ సినిమా టైటిల్సే ఒక ఉదాహరణ. టైటిల్స్‌లో ఆదివిష్ణు పేరు వచ్చినప్పుడు 'గురువంటే గుండ్రాయి కాదు' అని పాట బిట్ వినిపిస్తుంది.

టైటిల్స్‌లో ఛమక్కులు చూపడం జంధ్యాల కు సర్వసాధారణమే. ఇందులో కూడా టైటిల్స్‌లో కొత్తదనం చూపించారు. సినిమా స్టార్ట్‌కాగానే జంధ్యాల తెర మీద ప్రత్యక్షమై 'నరేష్, రెడీ' అని అనగానే మేకప్ వేసుకుంటున్న నరేష్ 'రెడీ' అని చెప్పడంతో టైటిల్స్ మొదలవువతాయి. జంధ్యాల 'స్టార్ట్ కెమెరా' అని చెప్పడం... ఇలా షూటింగ్ నేపథ్యంలోనే టైటిల్స్ రావడం జంధ్యాలకే చెల్లిన గమ్మత్తయిన ప్రయోగం. టైటిల్స్‌లో ఆయా టెక్నిషియన్లు కూడా కనిపిస్తారు. ప్రముఖదర్శకుడు ఇవివి సత్యనారాయణ, ప్రముఖ నిర్మాణ సంస్థ శ్రీబాలాజీ ఆర్ట్స్ అధినేతలు దాసరి దానయ్య, జె.పుల్లారావులను టైటిల్స్‌లోవచ్చే టెక్నీషియన్ల గ్రూప్‌లో చూడొచ్చును.

సమాజంలో సహజంగా తెలుగు మాస్టార్లంటే చాలామందికి చిన్న చూపే. ఆ విషయాన్ని ఒక చిన్న సీన్‌లో బాగా విడమర్చి

చూపించారు జంధ్యాల. సూర్యకాంతం ఇంటికి పెళ్ళి సంబంధం కలుపుకోవడానికి వచ్చిన వాళ్ళు 'నరేష్ తెలుగు మాస్టారు' అని తెలియగానే 'మళ్ళీ కలుస్తాం' అని వెళ్ళిపోతారు. ఆ తర్వాతి సీన్‌లో తెలుగు మాస్టారైన చిట్టిబాబు రిక్షా తొక్కి ఫ్యామిలీని పోషిస్తుంటాడు. అతని ఉపదేశం ఫలితంగా నరేష్ 'అజంతా ఫ్యాన్సీ స్టోర్స్'లో ఉద్యోగానికి చేరతాడు.

ఇందులో నరేష్‌కి తెలుగంటే పంచప్రాణాలు. ఎవరైనా తెలుగుని తప్పుగా ఉచ్చరిస్తుంటే అస్సలు ఊరుకోలేడు. ఆ అతి ప్రేమ వల్లనే ఫ్యాన్సీ స్టోర్‌లోనూ, పెట్రోల్ బంకులోనూ, కాఫీ హోటల్‌లోనూ ఉద్యోగం కోల్పోవలసి వస్తుంది.

నరేష్ పుట్టినరోజు అని వాళ్ల బామ్మ కొత్తబట్టలు కాలేజీకే తీసుకొచ్చి వేసుకోమంటుంది. అది బాగా టైట్ డ్రెస్. అది వేసుకుని నానా ఇబ్బందులు పడతాడు నరేష్. ఈ టైట్ డ్రెస్ ఎపిసోడ్ చూస్తుంటే 'పడమటి



సంధ్యారాగం'లో గుమ్మలూరి శాస్త్రి గుర్తుకొస్తారు. ఆయన కూడా ఒక సన్నివేశంలో ఇలాగే టైట్‌డ్రెస్‌తో ఇబ్బందులు పడతారు.

నరేష్‌కి ఈ సినిమాలో బోలెడన్ని గెటప్స్‌లో కనిపించే అవకాశం వచ్చింది. చిట్టిబాబు ఉపదేశమిచ్చే సీన్‌లో అర్జునుడుగానూ, తిమ్మాపురం స్కూల్‌లోకి ఎంటరయ్యే చోట శ్రీకృష్ణుడుగానూ, అలెగ్జాండర్‌గానూ, చిత్రకారుడుగానూ కనిపిస్తారాయన.

అలాగే చిట్టిబాబు, 'ఉపదేశం' సీన్‌లో శ్రీకృష్ణుడుగా కనిపిస్తారు.

ఇందులో నరేష్ బామ్మగా సూర్యకాంతం కనిపిస్తారు. జంధ్యాల దర్శకత్వంలో సూర్యకాంతం నటించిన ఏకైక చిత్రమిది.

ఈ సూర్యకాంతం అన్నగారుగా పుచ్చా పూర్ణానందం నటించారు. హరికథలు చెప్పే

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| రామకృష్ణ ప్రసాద్ | : నరేష్ |
| రాధారాణి | : శ్రీభారతి (తొలిపరిచయం) |
| సూర్యకాంతమ్మ | : సూర్యకాంతం |
| హెడ్మాస్టర్ సర్వలింగం | : వేలు |
| పటేల్ | : బ్రహ్మానందం |
| ఊర్వశి | : శ్రీలక్ష్మి |
| రుద్రమదేవి | : సంధ్య |
| పెద్దరాయుడు | : కోటశ్రీనివాసరావు |
| గవ్వరాజు(స్కూల్ బంట్రోతు) | : మల్లిఖార్జునరావు |
| | : రాంబాబు |
| వాసూరావు | : అశోక్‌కుమార్ |
| అవధాన్లు | : పొట్టిప్రసాద్ |
| రామకృష్ణ తాతయ్య | : పుచ్చాపూర్ణానందం |
| రిక్షావోడు | : చిట్టిబాబు |
| రాజా | : విన్నకోట విజయరాం |
| కామేశ్వరరావు | : హనుమంతరావు |
| డి.ఇ.వో | : జిత్‌మోహన్‌మిత్ర |
| సైన్స్ లెక్చరర్ | : అగస్త్యశాస్త్రి |
| | : కుయిలీ |
| గోపీ | : మాస్టర్ విన్నకోట కిరణ్ (నూతన బాలనటుడు) |
| లవకుమార్ | : మాస్టర్ శ్రీకాంత్ |
| వల్లభరావు | : సుబ్బరాయశర్మ |
| రంభ | : మద్దాలి సుశీల |

మరియు

సిహెచ్. కృష్ణమూర్తి, గుంటూరు శాస్త్రి, వంగల శ్రీరామమూర్తి, పి.వి.యల్. శ్రీనివాస్, తాతా అప్పారావు, సురేఖ.

అందమైన అమ్మాయే కావాలంటూ బ్రహ్మచారిగా వుండిపోతాడాయన. కాటికి కాళ్ళు జాపుకున్న వయసులో కూడా పెళ్ళి సంబంధాల కోసం ఊళ్ళు పట్టుకుని తిరుగుతూ వుంటాడు. చివరకు శ్రీలక్ష్మి అక్కతో ఆయన పెళ్ళి జరుగుతుంది.

ఇందులో సైన్స్ లెక్చరర్‌గా కనిపించే అగస్త్యశాస్త్రి 'చూపులు కలిసిన శుభవేళ' లో సుత్తి వీరభద్రరావుకి డూప్‌గా చేశారన్న సంగతి పాఠకులకు విదితమే. 'హైహైనాయకా' లో అనుకోకుండానే ఈ పాత్ర పోషించడం జరిగింది. "ఈ సినిమా కథా చర్చలకి నన్ను కూడా రాజమండ్రి తీసుకెళ్ళారు జంధ్యాలగారు. నలుగురు గుమాస్తాల్లో ఒకరిగా చేయమంటే అంత చిన్న వేషం నేను వేయనని చెప్పేశాను. నేను హైదరాబాద్ బయలుదేరుతుంటే ఒకరోజు వేషమని చెప్పి ఈ లెక్చరర్ వేషం వేయించారు" అని ఆ పాత్రను తానెలా చేసిందీ వివరించారు అగస్త్యశాస్త్రి.

**రిలీజ్**
**23-2-1989**

**నిర్మాణ ప్రాంతాలు**
రాజమండ్రి, వేమగిరి, దొమ్మేరు, కొంతమూరు, రాజోలు, వైజాగ్.

వేలు - శ్రీలక్ష్మి ఇందులో కూడా జంటగా కనబడతారు. వీళ్ళిద్దరూ ప్రేమించుకుంటారు గానీ, పెళ్ళి చేసుకోవడానికి వీలుకాదు. ఎందుకంటే శ్రీలక్ష్మి అక్కకి వయసు ముదురుతున్నా పెళ్ళికాదు. అక్క పెళ్ళి అయితేగానీ శ్రీలక్ష్మి పెళ్ళి చేసుకోనంటుంది. 44 ఏళ్ళు వచ్చినా తనకింకా పెళ్ళి కాలేదని తెగ చింతిస్తూ వుంటాడు వేలు. ఏదైనా షాకింగ్ న్యూస్ వింటే చాలు



మూర్ఛపోవడం అతని కలవాటు. "మా అక్కకి పెళ్ళి కుదిరిపోయింది. ఇక మనకి రూట్ క్లియర్ అయ్యింది. లేవండి" అని శ్రీలక్ష్మి ఆయనగారి చెవిలో చెప్పగానే ఉలిక్కిపడి లేవడం వేలుకి మరో అలవాటు.

ఇక బ్రహ్మానందం - సంధ్యలది మరో బాధ. బ్రహ్మానందంకు నలుగురు అన్నయ్యలుంటారు. వాళ్ళకి పెళ్ళైతేగానీ వీళ్ళకి పెళ్ళికాదు. అందుకే వేలు - శ్రీలక్ష్మిలతో తనను దత్తత తీసుకోమని పోరుతుంటాడు. వాళ్ళేమో "మాకే పెళ్ళికాక మేం ఏడుస్తుంటే, మధ్యలో నీ గోలేంటి?" అని విసుక్కుంటుంటారు. చివరకు నరేష్‌ని కూడా దత్తత తీసుకోమని బతిమాలుతుంటాడు బ్రహ్మానందం.

సోషల్ మాస్టారు వల్లభరావుగా నటించిన సుబ్బరాయశర్మకి ఆయన వృత్తికి

# 'హై హై నాయకా' లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్



- నీ మొహం తగలెయ్య.. నువ్వు నాకు మహా బాగా నచ్చావయ్యా
- బామ్మా.. ఇట్రా..
  నేను రావడం ఏంట్రా తింగరి సన్నాసి.. నువ్వే ఇటొొచ్చి కొత్త బట్టలు నలుగురుకీ చూపించు.
  ఇటురా నిన్ను చంపేస్తానంతే..
  హ..హ..హ... ముక్కు మీద కోపం శుంఠకి.
  చూడవే చూడు... ఎంత బిగుతుగా కుట్టి చచ్చాడో చూడు... వాడు నీ వయసు వాళ్లకి జాకెట్లు, జేబురుమాళ్లు కుట్టడానికి తప్ప మాకు పాంట్లు కుట్టడానికి పనికిరాడని చెప్తే విన్నావా.. విన్నావా ... చూడు.
  ఇప్పుడేమయింది రా కాస్త బిగుతుగా ఉన్నాయంతే. ఈ బట్టల్లో నువ్వెలా ఉన్నావో తెలుసా.. ఇంగ్లాండ్ మహారాజులా ఉన్నావు.
  ఇంగ్లాండ్ మహారాజులా కాదు అమెరికాలో అడుక్కు తినే వాడిలాగా తగలడ్డాను.
  అయ్యో .. అయ్యో అవేం మాటలురా పుట్టినరోజు పూటా అప్రాచ్యపు కుంకా.
- అలా మూలకెళ్లి దాక్కుంటావేంట్రా పిచ్చి కుంకా... రా.... వచ్చి దణ్ణం పెట్టు.
  క్షమించు బామ్మా... నేను అశక్తుడ్ని. నేను ఒంగోలేను.. నో...
- బాబూ...నాకో ఉత్తరం రాసి పెట్టాలి రాసి పెడతావా?
  చెప్పండి. ప్రేమలేఖా?
  అవును..
  మొదటి ప్రేమలేఖా?
  అదే..
  అయితే ఇంకేం చెప్పకండి. నేను రాసేస్తాను. నీకు ప్రేమలేఖ రాయడం వచ్చా?
  మా బాబాయ్‌కి, మా మావయ్యకి కొన్నివందల ప్రేమలేఖలు రాశానండీ బాబూ...



తగ్గట్టుగా ఓ ఊతపదం పెట్టారు. 'క్రీస్తుశకం...' అంటూ ఆయన ప్రతి విషయాకీ ఫ్లాష్‌బ్యాక్‌కి వెళ్ళిపోతుంటారు.

ఇక ఈ సినిమాలో కీలకమైన, కథకు మూలకమైన 'గోపీ' పాత్రను మాస్టర్ విన్నకోట కిరణ్ అభినయించాడు. ఈ కుర్రాడు విన్నకోట రామన్నపంతులుకి మనవడు, జంధ్యాల స్నేహితుడైన విన్నకోట విజయరాం కొడుకు.

'నీ యబ్బ' అన్న మాట వింటేనే పరిగెత్తుకు వెళ్ళి గోదావరిలో పదహారు మునకలు మునిగి బంకమట్టితో చెవులు తోముకుని వచ్చే పొట్టిప్రసాద్ తిమ్మాపురం స్కూల్‌కొచ్చిన మొదటి రోజునే మాస్టర్ విన్నకోట కిరణ్ ఉపయోగించిన వరుస బూతు ప్రయోగాలతో అతని మెదడు విచ్చుకుని పిచ్చివాడైపోతాడు. చివర్లో తన వల్ల పిచ్చివాడైపోయిన పొట్టిప్రసాద్‌ను క్షమించమని అడగడంతో పాటు, వెంటపడి భోజనం పెట్టి మాములు మనిషిచేసే సీన్స్‌ని హృదయానికి హత్తుకునే విధంగా చిత్రీకరించారు జంధ్యాల.

నరేష్ తిమ్మాపురం స్కూల్‌కి కొత్తగా వస్తాడు. కొత్త మాస్టారొచ్చాడని స్కూల్‌కి విన్నకోట కిరణ్ వస్తున్నప్పుడు బ్యాక్‌గ్రౌండ్‌లో 'కోర్ కోర్ శరణు కోర్..హై హై నాయకా' అంటూ 'మాయాబజార్' రీరికార్డింగ్ బిట్ ఉపయోగించడం మంచి థాట్.

కోట శ్రీనివాసరావు, మాస్టర్ విన్నకోటకిరణ్ బూతులు మాట్లాడినప్పుడల్లా బ్యాక్‌గ్రౌండ్‌లో 'బూతు..బూతు' అని సౌండ్ ఎఫెక్ట్ ఇవ్వడంతో పాటు తెరమీద 'ఇది బండబూతు','ఇది భారీ బూతు...' అని టైటిల్స్ వేయడం భలే కుదిరింది.

కోట నోట బూతులు దొర్లకుండా వుండటానికి నరేష్ ఓ టెక్నిక్ చెబుతాడు. బూతు మాట్లాడాలనిపించినప్పుడల్లా ఎదురుగా వున్న ఓ వస్తువు పేరు చెప్పమంటాడు. ఇదే టెక్నిక్‌ని ఉపయోగించి చాలామంది బూతులు మాట్లాడేవాళ్ళు తమ అలవాటు మార్చు కోగలిగారట.

నరేష్ కాలేజీలో ఓ అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆమె ఇతన్ని అపార్థం చేసుకుని చెంపదెబ్బ కొట్టినా ఆమెని మరిచిపోలేక పోతాడు. ఎన్ని పెళ్ళి సంబంధాలొచ్చినా తిరస్కరించి ఆ అమ్మాయి కోసమే ఎదురుచూసి, చివరకి తన ప్రేమను పండించుకుంటాడు.

నరేష్, శ్రీభారతిల పెళ్ళితో పాటు వుచ్చావూర్ణానందం -మద్దాలి సుశీల, వేలు-శ్రీలక్ష్మి, బ్రహ్మానందం- సంధ్యలపెళ్ళి






కొందరు లవ్ లెటర్‌ను లీవ్ లెటర్‌లా రాస్తారు. ఇంకొందరు ఉద్యోగానికి అప్లికేషన్‌లా రాస్తారు. అబ్బెబ్బె అది పద్ధతి కాదు.. నేను రాసిస్తాను చూసుకోండి. నేను ప్రేమలేఖ రాసానంటే అవతల పిల్ల ఠక్కున ప్రేమలో పీకలోతు మునిగిపోవలసిందే.

బాబ్బాబు... ఆపని చేసిపెట్టు. మా ఇద్దరికీ పెళ్లయి పిల్లాడు పుడితే వాడికి నీ పేరే పెట్టుకుంటాం.. ఇంతకీ నీ పేరేమిటి నాయనా...?

లవకుమార్

✦ ఏడిశావులే వెర్రిచచ్చినాడా... నీ కాళ్లమీద నువ్ నిలబడదామనా. వెధవ దొడ్డికాళ్లూ నువ్వూను.

✦ నేను పెళ్లికనర్హుడ్ని.

అంటే...?

నేనీ పెళ్లి చేసుకోలేను.

పోనీలే బాబూ... ఇప్పుడు వైద్యరంగం చాలా అభివృద్ధి చెందింది. మంచి డాక్టర్‌కు చూపించి నీ లోపం నేను సరిచేయిస్తా కదా..

సార్...పెళ్లికనర్హుడ్నంటే మీరనుకునే టైప్‌లో కాదు సార్. అపార్థం చేసుకోకండి.

✦ కాయా? పండా?.. చెప్పరా పిచ్చి సన్నాసి.

కాయా? పండా?..

మొక్కజొన్న పొత్తు.

పోనీలే... పొత్తు కుదిరింది కదా.. అమ్మయ్య బామ్మా.. లోపలకెళ్లి ఓ కత్తిపీట పట్టుకురావె.. రోకలైనా ఫర్వాలేదు.

ఇప్పుడవి దేనికిరా తిక్క సన్నాసి.

నిన్ను చంపేయటానికి. కత్తిపీటయితే పీక కోస్తాను... రోకలయితే పచ్చడి చేస్తాను.

అదేమిట్రా తింగరి కుంకా

✦ కుక్కలొచ్చేస్తున్నాయ్ం బాబో... కుక్కలొచ్చేస్తున్నాయ్...

కుక్కలొస్తున్నాయంటే.. ఆ తిక్క మనిషి కూడా వస్తున్నట్టే లెక్క.

✦ ఆ కుర్రాడెవండీ ?

మా గుంటడు.

అలాగా.. ఆ కళే చెప్తుందిలెండి

✦ చూడండి బాబూ.. ఇప్పుడు మిమ్మల్ని నేను కొన్ని ప్రశ్నలేస్తాను. జవాబులు చెప్పాలి.

ఐదైదులెంత? బాబూ చెప్పు నాయనా

పన్నెండొందల పదకొండు.

ఆఁ.. మనిషికి గుండెక్కడుంటుంది?

తలలో.

సుభాష్ చంద్రబోస్ ఎవరు?

మా పాలేరు.

✦ మీ అక్కకు పెళ్లి కాకుండా నీకు కాదు. మీ అక్కకేమో నేను బ్రతికుండగా కాదు. నేనేమో నిన్ను తప్ప ఇంకెవర్నీ చేసుకోలేను. ఆజన్మాంతం పై ఇంట్లో నేను క్రిందింట్లో నువ్వు పడుండాల్సిందే తప్ప ఒకింటి వాళ్లం కాలేము. ఇదంతా నా జాతకం.






కూడా ఒకే వేదిక మీద జరిపి ఒకేసారి 'శుభం' పలికారు జంధ్యాల.

ఈ సినిమాకి సంబంధించి 1988 సంవత్సరానికి ఉత్తమ ఎడిటర్‌గా నంది అవార్డునందుకున్నారు గౌతంరాజు.

బుల్లితెరపై బిజీనటుడిగా వెలుగొందుతున్న జాకీ ఈ చిత్రానికి కెమెరా అసిస్టెంట్‌గా పనిచేశారు.

'హై హై నాయకా' అనగానే అందరికీ తొలుత 'ఇది సరిగమ లెరుగని రాగము...' పాటే గుర్తుకొస్తుంది. ఈ పాటతోనే సంగీత దర్శకుడిగా తన స్వరపయనాన్ని ప్రారంభించారు మాధవపెద్ది సురేష్ చంద్ర.

1974నుంచి సాలూరి, కెవిమహాదేవన్, పెండ్యాల , జెవి రాఘవులు, రమేష్ నాయుడు, జి.కె.వెంకటేష్, నౌషాద్, లక్ష్మీకాంత్ ప్యారేలాల్, ఆర్.డి. బర్మన్, హంసలేఖ వంటి సుప్రసిద్ధ సంగీత దర్శకుల వద్ద పనిచేసిన మాధవపెద్ది సురేష్ 'హై హై నాయకా' లో తనదైన ముద్ర కనబరిచారు.

తన స్వర జీవన ప్రస్థానంలోని తొలి మజిలీని మాధవపెద్ది సురేష్‌చంద్ర ఇప్పటికీ తన మనసుపొరల్లోనే భద్రంగా పదిలపరుచుకున్నారు. ఆ మనసు పొరలు విప్పి ఆయన పంచిన అనుభవాలివి.

"అది 1988 ఆగస్ట్ 18వ తేదీ. ఉదయం సమయం. వర్షం భోరున కురుస్తోంది. ఈలోగా ఫోన్ మోగింది. అటు వైపు జంధ్యాల. వెంటనే బయలుదేరి పామ్‌గ్రోవ్ హోటల్‌లోని కాటేజ్ నెంబర్ 77కి రమ్మని పిలుపు. వానలో అర్జంట్ పనేమిటన్నాన్నేను. 'నీతోనే పెద్ద పని పడింది. నువ్విప్పుడు నా సినిమాకి సంగీత దర్శకుడివి' అని అటువైపునుండి జంధ్యాల చెప్పగానే ఇటు నేను ఊహించని థ్రిల్‌కి గురయ్యాను. గాలిలో తేలుతున్నట్టుగానే పామ్‌గ్రోవ్‌కి బయలుదేరాను. మద్రాసులోని ఈ హోటల్‌లోని ఆ రూమ్ అంటే కె. రాఘవేంద్రరావుగారికి, వేటూరిగారికి, అలాగే జంధ్యాలకి ఓ ప్రత్యేకమైన మక్కువ. ఒక రకంగా సెంటిమెంట్ కూడానూ. జంధ్యాలని కలిసి చాలాసేపు మాట్లాడాను.

ఆ రోజు సాయంత్రమే మ్యూజిక్ సిట్టింగ్స్ మొదలయ్యాయి. ఉదయం జంధ్యాల దగ్గరికి బయలుదేరే ముందు బాత్రూమ్‌లో స్నానం చేస్తున్నప్పుడు ఓ ట్యూన్ అనుకున్నాను. ఆ ట్యూన్‌నే సిట్టింగ్స్‌లో తొలిసారి వినిపిస్తే వెంటనే

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| బేనర్ | : లక్ష్మీకృప ప్రొడక్షన్స్ |
| సంగీతం | : సురేష్‌చంద్ర |
| సమర్పణ | : శ్రీమతి మద్ది సీతాయమ్మ |
| కథ | : ఆదివిష్ణు |
| పాటలు | : ముళ్ళపూడి శాస్త్రి, జొన్నవిత్తుల |
| ప్లేబ్యాక్ | : యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, యస్.జానకి, చిత్ర, మంజునాథ్, జో జో |
| నృత్యాలు | : తార, లలితామణి |
| పబ్లిసిటీ ఆర్టిస్ట్ | : సురేష్‌అంజన్ |
| ప్రెస్‌రిలేషన్స్ | : ఐ. అర్జునరావు |
| ఆపరేటివ్ కెమెరామెన్ | : మోహన్ |
| సహాయకులు | : భగవాన్, జాకీ |
| మేకప్ | : బి.భాస్కర్ |
| దుస్తులు | : బాల |
| స్టిల్స్ | : శ్రీనివాస్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : దోనేపూడి ప్రసాద్ |
| మేనేజర్ | : సైపుమురళి, దాసరిదానయ్య |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : బత్తుల రామకృష్ణ, జె.పుల్లారావు |
| ఛీఫ్ అసోసియేట్ డైరెక్టర్ | : ఇ.వి.వి. సత్యనారాయణ |
| కూర్పు | : గౌతంరాజు |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : దివాకర్ |
| సహనిర్మాత | : యం.బాలాజీ |
| నిర్మాతలు | : యన్.గోవర్ధన్ , యం.గుణశేఖర్ |
| రచన, దర్శకత్వం | : జంధ్యాల |

ఓకే చేసేశారు జంధ్యాల. అదే 'ఇది సరిగమలెరుగని రాగము...' పాట. నా తొలి పాటని జొన్నవిత్తుల రాశారు. ఇందులో పల్లవి పూర్తయ్యాక ఓ ఫ్లూట్ బిట్ వాయిస్తే, అది జంధ్యాలకు బాగా నచ్చి దానికి తగ్గట్టుగా పల్లవిని పొడిగించి 'ప్రేమగానము' అంటూ కొత్తపదాన్ని జోడించి కొత్తందం తీసుకువచ్చారు.

అగస్ట్ 21,22,23 తేదీల్లో పాటల రికార్డింగ్ జరిగింది. సినిమా ఇండస్ట్రీకొచ్చిన 15 ఏళ్ల తర్వాత సంగీత దర్శకుడిగా వచ్చిన అవకాశం ఇది. అందుకే పెద్దలందరి ఆశీర్వాదం తీసుకోవాలనుకుని కెవిమహాదేవన్, కె.విశ్వనాథ్, ఎస్.జానకి.... ఇలా నలభైమంది దగ్గరికి వెళ్లి కలిశాను.

ఆగస్ట్ 21న రికార్డింగ్ మొదలయింది. మధ్యాహ్నం 2 గంటల నుండి రాత్రి 9 గంటల వరకూ కాల్షీట్. ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం, జానకిలతో 'ఇది సరిగమలెరుగని రాగం..' పాట రికార్డ్ చేయాలనుకున్నాం. సరిగ్గా ఆ సమయానికి బాలసుబ్రహ్మణ్యం అమెరికా వెళ్లాల్సి వచ్చింది. దాంతో మా అన్నయ్య మాధవపెద్ది రమేష్ ట్రాక్ పాడాడు. ఈ పాట రికార్డింగ్ టైమ్ లో హీరో నరేష్ వచ్చి నన్ను అభినందించారు. కె.విశ్వనాథ్‌గారు ఫోన్ చేసి తాను వేరే చోట ఉన్నానని, అందుకే రాలేక పోతున్నానని చెప్పి నాకు బెస్టాఫ్‌లక్ చెప్పారు. ఈ రోజునే తొలిపారితోషికంగా నిర్మాత చేతులమీదుగా 10 వేల రూపాయలు అందుకోవడం జరిగింది.

ఆగస్ట్ 22న ఎవిఎం 'జి' థియేటర్‌కి సాలూరి రాజేశ్వరరావు గారు వచ్చి రమేష్ పాడిన ట్రాక్‌ని రెండుసార్లు విని ఆనందించారు.

సాలూరి రాజేశ్వరావు కుటుంబంతో మా మాధవపెద్ది కుటుంబాలకి యాభై ఏళ్ళకి పైగా అనుబంధం వుంది. 1974 నుంచి సాలూరి వారి ఆర్కెస్ట్రాలో అప్పుడప్పుడూ ఎకార్డియన్ ప్లేయర్‌గా పనిచేసేవాడ్ని. అందుకే నా తొలిపాట రికార్డింగ్‌కి సాలూరి రాజేశ్వరరావుగారు విచ్చేసి మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు. 'ఇతను మంచి కీబోర్డు ప్లేయర్‌గా పేరు సంపాదించాడు. భవిష్యత్తులో ఉత్తమ సంగీత దర్శకుడుగా అద్భుతంగా రాణిస్తాడు' అని సాలూరి వారు జంధ్యాలగారితో చెప్పారట కూడా.

సంగీత దర్శకుడు హంసలేఖ కేవలం నన్ను అభినందించటం కోసమే బెంగుళూరు నుంచి వచ్చారు. ఆయన దగ్గరే పర్మినెంట్‌గా వంద సినిమాలకుపైగా కీబోర్డ్ ప్లేయర్‌గా పని చేయటంతో మా మధ్య మంచి సాన్నిహిత్యం ఏర్పడింది.

23న రికార్డింగ్ పూర్తయ్యాక జంధ్యాల నాకు పార్టీ ఇచ్చారు. విశేషమేమిటంటే ఆ రోజున అన్నయ్య రమేష్ బర్త్‌డే కూడానూ.

మా అన్నయ్య రమేష్ ద్వారా జంధ్యాల 1969లో నాకు పరిచయమయ్యారు. జంధ్యాల,

## పాటలు

అచ్చులు పదహారు నా వయసల్లే
నా కళలల్లే

అభినయం : కుయిలీ, నరేష్

ఇది సరిగమలెరుగని రాగం
ఇది భాషలేని భావం

అభినయం : నరేష్, శ్రీ భారతి

గురువంటే గుండ్రాయి కాదు
బుడుగంటే బుడిచెంబు కాదు

అభినయం : నరేష్, మాస్టర్ విన్నకోట కిరణ్

ముద్దొచ్చేసాపా
ముంచావే కొంపా

అభినయం : నరేష్, శ్రీ భారతి



మాధవపెద్ది సురేష్



## 'హై హై నాయకా'లో ప్రజాదరణ పొందిన డైలాగ్స్

✦ మెనీ హ్యాపీ రిటర్న్స్ ఆఫ్ ది డే శరభం గారూ...
ఆ...
పుట్టిన రోజు నాడు అలా దిగులుగా కూర్చున్నారేమిటి?
ఏం చేయమంటావ్ ఊర్వశి. నలభై నాలుగేళ్లు నిండిపోయాయి. ఒక్కో పుట్టినరోజుకి ఒక్కో మైలు చొప్పున శ్మశానానికి దగ్గరైపోతున్నాను. పెళ్లీ పెటాకులు లేకుండానే ఎప్పుడో ఇలా బ్రహ్మచారికుంకలాగానే బాల్చీ తన్నేస్తామోనని ప్రతి పుట్టినరోజు నాడు నేను బాధ పడుతూనే ఉన్నాను.

✦ మా నాన్న రేపు నిద్ర లేచి బెజవాడ వెళ్తానన్నారు.
ఎందుకు అక్కడ నిద్రపోవటానికా.. !?

✦ పితృపాదు లేదూ జీరపాదు లేదు ఊరుకోవయ్యా
మాకు పితృపాదులు, జీరపాదులు, దొండపాదులు, బెండ పాదులు, అన్ని పాదులూ మీరే నాన్నగారు.

✦ ఈ ఆగమేమిటి మాస్టారూ?
ఇది ఆగం కాదు మాస్టారు...
రోగమా?
అదీ కాదు నాన్నగారూ... మీరు నన్ను వెంటనే దత్తత తీసుకోవాలి నాన్నగారూ..
దత్తతా?... నేనా? ఎందుకు?
నాకు నలుగురు అన్నయ్యలున్నారు నాన్నగారూ. వాళ్లకు ఈ జన్మలో పెళ్లిల్లు అవ్వవు. అందరిలోకి చిన్నవాడ్ని. నాకూ వాళ్ల పెళ్లిళ్లకు లింక్ ఉంది. ఆ లింక్ తెగదు. అంచేత మీరు నన్ను దత్తత చేసుకుంటే ఆ లింక్ తెంపేసుకుని, ఇంటి పేరు మార్చేసుకుని రుద్రమదేవిని వెంటనే వివాహం చేసుకుంటాను.
ఆహా.. నీ పెళ్లి నా పిండాకూడల్లే వుంది, నా పెళ్లికొచ్చి కూడొండమన్నాడంట వెనకటికొకడు ఎవడో నీలాంటి వాడే. మాకే ఇంకా పెళ్లి కాలేదని కుమిలి ఛస్తూంటే మేం నిన్ను దత్తత తీసుకోవాలా?

✦ కనిష్కులా... వాళ్లెవర్రా?
మన తురుష్కుల తమ్ముళ్లు...

✦ అయ్యో అయ్యో ఈ అపశకునపు మాటలేంట్రా అయోమయం సన్నాసి.

✦ వెధవ కాకిగోల అయిపోయింది. ఎంతమంది నాన్నలు కావాలిరా నీకు?
ఎవరు కావాలి?
మీరు మా అన్నగారు. కురూరపు వర్మగారు.
అహా.. ఏం కావాలట?
ఇక్కడ వీరికి నమవయస్కులైన వధువువుందని తెలిసి పెళ్లిచూపులు చూసుకోవటానికి వచ్చాం.
అలాగా? ఉంది. రంభ అని ఓ వృద్ధ కన్య ఉంది.
అమ్మాయి పేరు రంభట.
ఆ.. రంభా.. శెభాష్.
అనలింతవరకూ వీరు పెళ్లెందుకు చేసుకోలేదో?
పదేళ్లకో సంబంధం చొప్పున ఇప్పటికి నాలుగు సంబంధాలు చూసారండి మా అన్నగారు. అన్నీ కుదిరి ముహూర్తాలు పెట్టుకునే సరికి ఆ నలుగురు పెళ్లి కూతుళ్లూ చీమలు కుట్టి, కప్పలు కరిచి చచ్చిపోయారు. అందుకే ఈసారికి మా అన్నగారు ఏలినాటి శని వెళ్లిపోయేదాకా ఆగి ఇప్పుడొచ్చారు.
రంభ గారూ... రంభగారూ... మిమ్మల్ని చూడటానికి పెళ్లివారు వస్తున్నారండీ.
ఉహూ.. నాకు సిగ్గుగా ఉంది బాబూ.
వెంకట్రావు గారూ... లేవండీ, మీ అమ్మాయికో మంచి సంబంధం వచ్చింది.
సర్లెండి... పిల్లను చూసుకుని వెళ్లమనండి. నేను ఇప్పుడే ఓ పదహారు గంటల క్రితమే పడుకున్నా.
అదేమిటి... ఆయన మూర్ఛపోయారా?
లేదండీ... మూర్ఛపోలేదు. టోటల్‌గానే పోయారు. ఇదివరకటి నాలుగు పెళ్లి చూపుల్లో పెళ్లి కూతుళ్లు పోయారు. ఇదో పెళ్లిచూపులో అన్నగారే వెళ్లిపోయారు.

రమేష్‌నాయుడుల కాంబినేషన్‌లో రూపొందిన అన్ని సినిమాలకీ నేను కీబోర్డ్ ప్లేయర్‌గా వర్క్ చేశాను. అందుకే నా తొలిపాటని రమేష్ నాయుడు గారికి వినిపించాలనుకున్నాను. బాలు, జానకిల వాయిస్ మిక్స్ అయ్యాక వినిపిద్దామనుకునే లోపే ఆయన కాలం చేశారు. అలా నా కోరిక తీరకుండా పోయింది.

బాలు, జానకిలు పాట పాడటానికి వచ్చి 'కీబోర్డ్ ప్లేయర్‌వి కదా, అంచేత పాటలు రిథమ్ ఓరియెంటెడ్‌గా వుంటాయని భావించాం. కానీ పాటలు చాలా బాగున్నాయి' అని మెచ్చుకున్నారు. ముఖ్యంగా బాలు గారికి 'ఇది సరిగమలెరుగని రాగం...'పాటలోని, 'కలహంసలా....' అనే చరణమంటే చాలా ఇష్టం. 'ఆ చరణంలో కొన్ని బిట్స్ నౌషాద్‌లా చేశావు' అని బాలు అభినందించడం ఇప్పటికీ నాకు గుర్తుంది.

తెలుగు భాషలోని అచ్చులు,




హల్లులు, సంధులు, సమాసాలు ఉపయోగించుకుని తమాషాగా 'అచ్చులు పదహారు... ' పాటను రాయించుకున్నారు జంధ్యాల. ఈ పాటకు సాహిత్యానికి తగ్గట్టుగా ట్యూన్ కట్టాను.

ఈ సినిమా ద్వారా ఇద్దరు కొత్త సింగర్స్‌ని పరిచయం చేశాను. ఒకరు మంజునాథ్, ఇంకొకరు ఎం.ఎం.శ్రీలేఖ.

ముళ్లపూడి శాస్త్రి రాసిన 'గురువంటే గుండ్రాయి కాదు...' పాటలో ఓ చిన్నపిల్లాడి వాయిస్ కావాలి. సడన్‌గా నాకు కన్నడంలో హంసలేఖ దగ్గర పాటలు పాడిన మంజునాథ్ అనే కుర్రాడు గుర్తుకొచ్చాడు. ఆ కుర్రాడిని పిలిపించి ఆ పాటను పాడించడం జరిగింది. ఈ కుర్రాడే తర్వాత 'మాల్గుడి డేస్' సీరియల్‌లోనూ, 'స్వాతి కిరణం' సినిమాలోనూ నటించాడు.

'ముద్దొచ్చే పాపా ముంచావే కొంపా...' పాటలో చిన్న బిట్‌ను ఎం.ఎం.శ్రీలేఖతో తొలిసారిగా పాడించడం జరిగింది. అయితే ఆ బిట్ ఆడియో

క్యాసెట్‌లో వుంటుందిగానీ, సినిమాలో మాత్రం తీసేశారు.

సౌత్ ఆఫ్రికా నుండి వచ్చి ఇక్కడ సెటిల్ అయిపోయిన 'జోజో' తో ఒక పాటలో చిన్న బిట్ పాడించాను.

ఈ సినిమా ఆడియో ఫంక్షన్‌కి జంధ్యాల రావడానికి కుదర్లేదు. 'లియో' వాళ్లు ఈ పాటల్ని రిలీజ్ చేశారు. విశేషమేమిటంటే నా తొలి డివోషనల్ ఆల్బమ్ 'ఓం ఓం సాయిరాం'ని కూడా 1990లో 'లియో' ఆడియో కంపెనీ వాళ్లే రిలీజ్ చేశారు.

నాకు 'మాయాబజార్' సినిమా అంటే ప్రాణం. ఈ సినిమాలోని ఓ థీమ్ మ్యూజిక్‌ని నా సినిమాలో సందర్భోచితంగా ఉపయోగించుకున్నాను. 'మాయాబజార్'లో ఘటోత్కచుడు వస్తుంటే 'కోర్ కోర్ శరణుకోర్' అనే బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ వస్తుంది. 'హై హై నాయకా'లో పిల్లాడు పిల్ల రాక్షసుడు కాబట్టి ఆ బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌ని ఉపయోగించాను. ఇది జంధ్యాలకు బాగా నచ్చింది.

ఈ సినిమా రీరికార్డింగ్ చాలా నీట్‌గా చేశానని జంధ్యాల మెచ్చుకోవడం జరిగింది. ఎవియం వారి 'రాము' సినిమా గుర్తుంది కదూ. ఆ సినిమాలో'రాము'గా నటించిన రాజ్‌కుమార్ 'ఇది సరిగమలెరుగని రాగం..' పాటకి కీబోర్డ్ వాయించాడు.

షూటింగ్ జరుగుతుండగా నన్ను రమ్మని ఆహ్వానించారు జంధ్యాల. నేను, జొన్నవిత్తుల కలిసి రాజమండ్రి షూటింగ్‌కు వెళ్లాం. అక్కడే నాకు కోటశ్రీనివాసరావు గారు పరిచయమయ్యారు.

టైటిల్స్‌లో నా పేరు సురేష్‌చంద్ర అని వుంటుంది. నా పూర్తి పేరు మాధవపెద్ది సురేష్‌చంద్ర. సురేష్‌చంద్ర అయితే మోడ్రన్‌గా వుంటుందని జంధ్యాల టైటిల్స్‌లో అలా వేశారు. ఈ ఒక్క సినిమాలోనే నా పేరు అలా కనిపిస్తుంది.

## కథాంశం

రామకృష్ణ తన క్లాస్‌మేట్ రాధారాణిని గాఢంగా ప్రేమిస్తాడు. ఆమె పుట్టినరోజు నాడు ముద్దుపెట్టుకోబోతే చెంప దెబ్బ కొడుతుంది. తెలుగు మాస్టారిగా ఉద్యోగంలో చేరిన రామకృష్ణ కొన్నాళ్ళకే ఉద్యోగం కోల్పోతాడు. దాంతో ఏదో ఒక పని చేసి బతకాలనుకుంటాడు. బామ్మ సూర్యకాంతమ్మ, మనవడిని ఎలాగైనా ఓ ఇంటివాడిని చేయాలని ప్రయత్నిస్తూ వుంటుంది. తిమ్మాపురంలోని శ్రీసర్వారాయుడు హైస్కూల్‌లో ఆ స్కూల్ యజమాని, ఊరిపెద్ద అయిన పెద్దరాయుడు పుత్రరత్నం గోపికి చదువు చెప్పించడం కోసం నానా ఇబ్బందులు పడతారు టీచర్స్. ఆ కుర్రాడు నోరు విప్పితే అన్నీ బూతులే. ఆ కుర్రాడికి ఆరు నెలల్లోగా సరైన శిక్షణ ఇవ్వకపోతే ఉద్యోగాలు ఊడిపోతాయని హెచ్చరిస్తాడు పెద్దరాయుడు. దాంతో టీచర్స్ ముప్పుతిప్పలు పడ్డా ప్రయోజనం కనబడదు. దాంతో తెలుగు టీచర్ ఉద్యోగానికి రామకృష్ణను రప్పిస్తారు. గోపిని బుద్ధిమంతుడుగా మార్చుతాడు రామకృష్ణ. ఈ గోపి అక్కే రాధారాణి. తన స్నేహితురాలు ప్రేమ విఫలమై ఆత్మహత్య చేసుకుంటుంది. అదే మార్గంలో వస్తున్న రామకృష్ణని అపార్థం చేసుకుంటుంది రాధారాణి. చివరకు రామకృష్ణలోని నిజాయితీని అర్థం చేసుకుంటుంది రాధారాణి. రామకృష్ణ, రాధారాణిల పెళ్ళితో కథ సుఖాంతం అవుతుంది.

సంగీత దర్శకునిగా నా తొలి సినిమాలో పి.సుశీల, ఎస్.జానకిలతో పాడించాలనుకున్నాను. కానీ సుశీల గారితో పాడించే అవకాశం కుదర్లేదు. అందుకే 'లక్ష్మీకృపా ప్రొడక్షన్స్' బేనర్ ఎంబ్లమ్‌ను ఆవిడతో పాడించి నా ఆశ నెరవేర్చుకున్నాను. ఈ సినిమాలో ఒక్క పాట పాడకున్నా, కేవలం నా కోసం, నా మీద అభిమానంతో ఎంబ్లమ్‌కి పాడారావిడ.

అందుకే కృతజ్ఞతగా 'భైరవద్వీపం'లో సుశీలగారి కోడలు సంధ్యను గాయనిగా పరిచయం చేశాను.

కొసమెరుపు ఏమిటంటే మా బాబాయ్‌లు మాధవపెద్ది గోఖలే, సత్యంలు ఒక స్థాయికి చేరుకోవడానికి కారణం విజయా వారి చిత్రాలే. నేను పరిచయమైన తొలి సినిమా టైటిల్ విజయా వారి సినిమాలోని డైలాగ్ కావడం యాదృచ్ఛికమే అయినా అదృష్టంగా భావిస్తాను.

ఈ చిత్రనిర్మాత, దర్శకుడు ఇప్పుడు లేరు. కానీ 'హై హై నాయకా'లోని 'ఇది సరిగమలెరుగని రాగం...' పాట విన్నప్పుడు వాళ్లిద్దరూ గుర్తుకొచ్చి మనసు కలుక్కుమంటుంది." అన్నారు మాధవపెద్ది సురేష్‌చంద్ర.

ఇలా 'హై హై నాయకా' సినిమాతో 'హహ్హహ్హ నవ్వండిక' అంటూ జంధ్యాల కితకితలు పెట్టకుండానే తెలుగు ప్రేక్షకుల మదిలో నవ్వుల పువ్వులు పూయించారు. ఇప్పటికీ ఆ పువ్వులు వాడలేదు. ఆ పరిమళం తగ్గలేదు.

దటీజ్ జంధ్యాల!

-పులగం చిన్నారాయణ




ఈ సారి 'జంధ్యామారుతం' ని
స్పాన్సర్ చేసినది
'మా టీవీ'లో ప్రతీ ఆదివారం రాత్రి
8.30 గంటలకు ప్రసారమవుతున్న
'సంబరాల రాంబాబు'
కామెడీ సీరియల్ తరఫున
శ్రీ శివాజీరాజా



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం





నౌషాద్ సంగీత దర్శకత్వంలో రఫీ, లతా యుగళాలు అపురూపమైన అందాన్ని, మాధుర్యాన్ని సంతరించుకున్నాయి. నౌషాద్‌కు శాస్త్రీయ సంగీతంలో ఉన్న ప్రావీణ్యం, రఫీ, లతాల గానప్రావీణ్యంతో దీటుగా ఉండడం వల్ల, వీరి కాంబినేషన్ లోని యుగళ గీతాల్లో స్వరవిన్యాసం అద్భుతంగా ఉంటుంది. అలాంటిదే ఒక పాట 'లీడర్' లోని **తెరీ హుస్న్‌కీ క్యా తారీఫ్ కరూ.**

ఇక్కడ శ్రవ్య, దృశ్యాలకు కావలసిన అన్ని కాంబినేషన్‌లు చక్కగా అమిరాయి. తెరపైన దిలీప్‌కుమార్, వైజయంతిమాల! తెర వెనక రఫీ, లతా, శకీల్ - నౌషాద్‌లు - సినిమా ఫ్లాప్ అయినా, ఈ సన్నివేశం అందానికి ఏం కొదవలేదు. నౌషాద్ స్వరకల్పనలో సరదా టోన్ తక్కువే. కానీ ఈ పాట ప్రధానంగా సరసపు మూటే! శాస్త్రీయ బాణీని త్యాగం చేయకుండా కూడా సరదా పాట ఎలా చేయవచ్చో నౌషాద్ ఇందులో చేసి చూపించాడు. కొంతవరకు ఇది సంవాద ధోరణికి చెందిన పాట.



అతనంటాడు:

**తేరీ హుస్న్ కీ క్యా తారీఫ్ కరూ**
**కుఛ్ కెహతే హువే భీ డర్‌తా హూ**
**కహీ భూల్ సే తూ న సమఝ్ బైఠే**
**కి మై తుఝ్ సే మొహబ్బత్ కర్‌తా హూ**

ఆమె సమాధానం:

**మేరే దిల్ మే కసక్ సీ హోతీ హై**
**తేరే సామ్‌నే జబ్ మై గుజర్‌తీ హూ**
**ఇస్ బాత్ సే యే న సమఝ్ లేనా**
**కీ మై తుఝ్ సే మొహబ్బత్ కర్ తీ హూ**

మొదటి చరణం : అతను పాడతాడు

**తేరి బాత్‌మే గీతోంకే సర్‌గమ్**
**తెరీ చాల్‌మే పాయల్ కీ చమ్‌చమ్**
**కోయీ దేఖ్‌లే తుఝ్‌కో ఏక్ నజర్ - 2**
**మర్ జాయే తేరీ ఆంఖోంకీ కసమ్**
**మైభీ హూ అజబ్ ఏక్ దీవానా**
**మర్‌తా హూ న ఆహే భర్‌తా హూ** ॥కహీ॥



రెండో చరణం : ఆమె పాడుతుంది.

**మేరే సామ్ నే జబ్ తూ ఆతాహై**
**జీ థక్ సే మేరా హో జాతా హై - 2**
**లేతీ హై తమన్నా అంగ్‌డాయీ -2**
**దిల్ జానే కహా ఖోజాతా హై**
**మెహసూస్ యే హోతా హై ముఝ్ కో**
**జైసే మై తేరా దమ్ భర్‌తీ హూ** ॥ఇస్ బాత్॥



ఇది అల్లరి పాట. ఒకర్నొకరు ప్రేమించుకుంటున్నట్టు చెప్పకనే చెప్పుకునే పాట.. ప్రేమ, ఆకర్షణ కలగడం వల్ల కలిగే స్పందన గురించి చెబుతూనే, 'పొరపాటున నేను నిన్ను ప్రేమిస్తున్నా ననుకునేవు సుమా' అని దొంగమాటలు పలికే చల్లని పాట.

పల్లవి :

హుస్న్ అంటే అందం. తారీఫ్ కర్‌నా అంటే ప్రశంసించడం. భూల్‌సే అంటే పొరపాటున. మొహబ్బత్ అంటే ప్రేమ.

**నీ సౌందర్యాన్ని ఏమని పొగడను?**

ఏదైనా అనాలన్నా భయం వేస్తోంది
నువ్వు గానీ పొరపాటున ( నా పొగడ్తలు విని)
నిన్ను ప్రేమించేస్తున్నానని అనుకుంటావేమో!, అని అతనంటాడు.
ఆమె కూడా ఏం తీసిపోలేదు అతనికి.
కసక్ అంటే అలజడి. రాహ్ అంటే దారిలో. గుజర్ నా అంటే వెళ్ళడం.
నా మదిలో ఏదో అలజడి రేగుతుంది
నీ దారంటే నేను వెళ్తున్నప్పుడు
అంత మాత్రాన నువ్వు పొరపాటు పడి
నిన్ను ప్రేమిస్తున్నానని అనుకోకు

1వ చరణం :
బాత్ అంటే మాటలు; సర్‌గమ్ అంటే శ్రావ్యత; చాల్ అంటే నడక; పాయల్ అంటే గజ్జెలు. చమ్ చమ్ అంటే సవ్వడి. ఏక్ నజర్ అంటే ఒక్కచూపు. కసమ్ అంటే ఒట్టు.
నీ పలుకుల్లో పాటలోని శ్రావ్యత
నీ నడకలో గజ్జెల గలగల
నిన్ను ఒక్కసారి చూస్తే చాలు
చావడం ఖాయం - నీ కళ్ళ మీద ఒట్టు
నేను ఉన్నాను ఓ పిచ్చి వెధవని
చావనూ చావను; అలా అని నిట్టూర్పులూ మానను
పొరబాటున అనుకునేవు సుమా!
నేను నిన్ను ప్రేమిస్తున్నానని

ప్రేమ లక్షణాలన్నీ చెబుతూ, తన 'చావు' లక్షణాలు చెప్తూ, నవ్వు దాచుకుంటున్నట్టు రఫీ పాడిన పద్ధతి అద్భుతం. ఎక్కువ పదాలు ఉన్నప్పటికీ,ఎక్కడా మధ్యలో మ్యూజిక్ రాకుండా పూర్తిగా వేగంగా చరణం పాదాలు నడిపించడంలో నౌషాద్ చూపిన ప్రతిభ అసాధారణం. ఇద్దరి మనసులోని కంగారు, కొత్తగా ప్రేమలో పడిన తడబాటు, ఈ వేగం వల్ల, అతిగా ప్రయోగించే పదాలు వల్ల, మధ్యలో మ్యూజిక్ విరామం లేనందువల్ల వ్యక్తమై, పాటకు గొప్ప అందాన్నిచ్చాయి.

2వ చరణం:
ఆమె అంత చిలిపిగానూ తన మనసును విప్పి చెప్పుతుంది.
సామ్‌నే అంటే ఎదురుగా, జీ ధక్ సే అంటే గుండె కలవరపడ్డం; తమన్నా అంటే కోరిక;
అంగ్‌డాయి అంటే ఒళ్ళు విరుచుకోవడం (పురి విప్పడం). మెహసూస్ అంటే అనుభూతి చెందడం.
నీవు నా ఎదురుగా వస్తే చాలు
గుండె గబగబా కొట్టుకుంటుంది
కోరికలు పురివిప్పుతాయి
మనస్సు ఎటో వెళ్ళిపోతుంది
నీ శ్వాసే నాకు ఆలంబన
అనిపిస్తుంది ఎందువల్లనో
అంతమాత్రాన అనుకోవద్దు
నేను నిన్ను ప్రేమిస్తున్నానని

రెండో చరణంలో బాణీ కొంత మారుతుంది. లతా చరణంలో మాధుర్యం, అనుభూతి ఎక్కువ. రఫీ పాడిన బాణీలో వేగం, చురుకుదనం ఎక్కువ. ముఖ్యంగా 'మేరే సామ్‌నే జబ్ తూ ఆతా హై' అన్నప్పుడూ, 'లేతీహై తమన్నా అంగ్‌డాయి' అని రెండుసార్లు పాడినప్పుడూ ఒక విహ్వలత, కోరిక ఆ రాగంలో, లతా స్వరంలోనే వినిపిస్తాయి. దుడుకు నాయకుడికి ఒక ట్యూను, ముద్దుగుమ్మ అయిన నాయికకు ఒక ట్యూను వేసి, ఈ పాటను ఆద్యంతం రక్తి కట్టించాడు నౌషాద్. సప్తస్వరాధికారి అయిన నౌషాద్‌కి ఇది పెద్ద కష్టం కాదు!

- మృణాళిని

జస్ట్ ఫర్ ఫన్

# చేప ఎందుకు ఎండ లేదంటే...

అనగనగా ఒక రాజు. ఆ రాజుకి ఏడుగురు కొడుకులు. ఏడుగురు కొడుకులూ వేటకెళ్లి ఏడు చేపలు తెచ్చారు. ఎండ బెట్టారు. అందులో ఒక చేప ఎండలేదు.
"చేపా! చేపా! ఎందుకు ఎండలేదూ?"
"అపార్ట్‌మెంట్లు అడ్డమొచ్చాయి..."
"అపార్ట్‌మెంట్లూ! అపార్ట్‌మెంట్లూ! ఎందుకు అడ్డమొచ్చారూ?"
"ఆకాశం అందటం లేదు.."
"ఆకాశం ఆకాశం ఎందుకు అందటం లేదూ?"
"మబ్బులు అడ్డమొచ్చాయి"
"మబ్బులూ! మబ్బులూ! ఎందుకు అడ్డమొచ్చారూ?"
"నీళ్లు లేక వలస పోతున్నాము.."
"నీళ్లూ నీళ్లూ ఏమైపోయారూ?"
"చెట్లు లేక వర్షాల రూపంలో పడటం లేదు"
"చెట్లూ చెట్లూ ఏమైపోయారూ?"
"మనిషి మమ్మల్ని నరికేస్తున్నాడు.."
"మనిషీ! మనిషీ! ఎందుకు నరికేస్తున్నావూ?"
"నా పక్కోడు అపార్ట్‌మెంట్స్ కడుతుంటే నేను కట్టొద్దా!?"
అదండీ సంగతి...!!



- జాస్తి రమాదేవి, పాల్వంచ

# కోటి సంవత్సరాల క్యాలండర్

2004 సంవత్సరానికి వీడ్కోలు చెబుతూ 2005 సంవత్సరానికి స్వాగతం పలుకుతూ పాఠకుల కోసం 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక యిది.

| సాధారణ సంవత్సరాలు (ఎ) | లీపు సం॥లు | నంబర్ కోడ్ |
|---|---|---|
| 01, 07,18, 29, 35, 46, 57, 63, 74, 85, 91 | 24,80, 52 | 4 |
| 02, 13, 19, 30, 41, 47, 58, 69, 75, 86, 97 | 08, 36 64, 92 | 5 |
| 03, 14, 25, 31, 42, 53, 59, 70, 81, 87, 98 | 20, 48, 76 | 6 |
| 09, 15, 26, 37, 43, 54, 65, 71, 82, 93, 99 | 04, 32 60, 38 | 0 |
| 10, 21, 27, 38 , 49, 55, 66, 77, 83, 94 | 16, 44 72, 00 | 1 |
| 05, 11, 22, 33, 39, 50, 61, 67, 78, 89, 95 | 28, 56 84 | 2 |
| 06, 17, 23, 34, 45, 51, 62, 73, 79, 90 | 12, 40, 68, 96 | 3 |

| నెలలు (బి) | సాధారణ | లీపు |
|---|---|---|
| జనవరి | 0 | 0 |
| ఫిబ్రవరి | 3 | 3 |
| మార్చి & నవంబర్ | 3 | 4 |
| ఏప్రిల్ & జూలై | 6 | 0 |
| మే | 1 | 2 |
| జూన్ | 4 | 5 |
| ఆగస్ట్ | 2 | 3 |
| డిసెంబర్ & సెప్టెంబర్ | 5 | 6 |
| అక్టోబర్ | 0 | 1 |

| వారాలు (సి) | |
|---|---|
| ఆది | 1 |
| సోమ | 2 |
| మంగళ | 3 |
| బుధ | 4 |
| గురు | 5 |
| శుక్ర | 6 |
| శని | 0 |

**ఉపయోగించే విధానం :** ఒక తేదీ (ఉదా॥కి 15-8-1947) తీసుకోండి. ఆ సంవత్సరం ఉన్న శతాబ్దంలో మొదటి సంవత్సరాన్ని తీసుకోండి. అంటే 1947 అయితే 1901 తీసుకోవాలి. 1857 అయితే 1801 తీసుకోవాలి. ఆ సంవత్సరాన్ని 7 చేత భాగించి శేషాన్ని ఒక పక్కగా వేసుకోవాలి. 1901ను 7 చేత భాగిస్తే శేషం [4] వస్తుంది. దాన్ని ఓ కాగితం మీద వేసుకోండి. ఇప్పుడు 'ఎ' పట్టిక చూడండి. ఆ సంవత్సరంలోని చివరి రెండు అంకెలు ఏ వరుసలోచ్చాయో చూసి దానికి ఎదురుగా నంబర్‌కోడ్ కాలమ్‌లో ఉన్న అంకె తీసుకోవాలి. 1947 అయితే నంబర్ కోడ్ [5] అవుతుంది. (1857 అయితే 4 అవుతుంది.) ఈ అంకెను ఇందాకటి శేషం (4) తర్వాత వేస్తే ఓ సంఖ్య వస్తుంది. 1947 విషయంలో అది [4][5]. దాన్ని 7 చేత భాగించి వచ్చిన శేషాన్ని 3 ఓ పక్కగా పెట్టండి. ఇప్పుడు నెలకు ఎదురుగా ఉన్న కాలమ్(బి)లోని అంకెను కలపండి. 1947 ఆగస్టు 15 విషయంలో ఆగస్టు నెలకు ఎదురుగా 'సాధారణ సం॥ కాలమ్‌లో 2, 'లీపు సం॥' కాలమ్‌లో 3 ఉన్నాయి. 1947 లీపు సంవత్సరం కాదు (4 చేత నిశ్శేషంగా భాగింపబడదు కాబట్టి). అందువల్ల సాధారణ సం॥లో కాలమ్‌లోని [2] ను తీసుకుని, దాన్ని ఇందాకటి శేషం '3'కు కలపండి. అంటే మొత్తం 2+3=5 దీనికి తారీకు కలపండి. ఆగస్టు 15 అన్నాం కాబట్టి [15] కలపగా 20 వస్తుంది. దాన్ని 7 చేత భాగిస్తే శేషం [6] వస్తుంది. ఈ 6కి ఎదురుగా ఉన్న వారం (సి)లో కనబడుతుంది. 6కు ఎదురుగా ఉన్నది శుక్రవారం. అంటే 15-8-1947 శుక్రవారం అన్నమాట!

**మరొక ఉదాహరణ :** ఈ 'హాసం' సంచిక వెలువడిన తేదీ (16-12-2004) ఏ వారం?

2004 అంటే 2001 తీసుకోవాలి. దాన్ని 7 చేత భాగిస్తే శేషం [6]

04 'ఏ' పట్టికలో లీపు సం॥ క్రింద 4 వ వరుసలో ఉంది. దాని నంబర్ కోడ్ [0]. '6' పక్కన '0' అంటే [60] దాన్ని 7 చేత భాగిస్తే శేషం [4]. డిసెంబరు ఎదురుగా ఉన్న 'లీపు' సంఖ్య 6.

[4+6=10] దీనికి తారీకు [16] కలిపితే [26] దాన్ని 7 చేత భాగిస్తే శేషం [5].

'సి'లో 5కు ఎదురుగా ఉన్నది గురువారం. 16-12-2004 గురువారమే కదా!

**ఈ క్యాలండర్‌ను రూపొందించిన వారు :** వై.వి.మోహన్ 48-11/3-1, కరెన్సీ నగర్, గుండాల, విజయవాడ, ఆం.ప్ర., భారతదేశం.

# యుగళ గీతాలలో రఫీ...



తస్‌వీర్ తేరీ దిల్ మే - జిస్ దిన్ సే ఉతారీ హై
ఫిరూ తుఝే సంగ్ లేకే - నయే నయే రంగ్ లేకే
సప్‌నోంకీ మెహఫిల్ మే (మాయా)

హిందీ పాటల అభిమానుల్లో ఈ పాటను ఎరగనివారు బహు తక్కువ ఉంటారు. రఫీ, లతాల స్వరాలు కోయిల కూజితాల్లా రకరకాల పరవళ్ళు తొక్కి, శ్రోతలను మధురమైన అనుభవంతో నింపేసే పాట ఇది. సంగీత దర్శకుడు - సంక్లిష్ట స్వరరచనకు పేరు పొందిన సలీల్ చౌధురి. ఇతని సంగీత దర్శకత్వంలో వీరిద్దరికి చెప్పుకోదగ్గ సంఖ్యలో పాటలు లేవు. కానీ ఇది మాత్రం ఆల్ టైమ్ హిట్. ఇలా ఒకటీ, రెండు యుగళ గీతాలతో, రఫీ, లతాల సాయంతో అమర గీతాలను అందించిన సంగీత దర్శకులు కొందరున్నారు. వారికి అనివార్యంగా వీరిద్దరూ పాడకున్నా, పాడిన కొన్ని చాలా ప్రజాదరణ పొందాయి.

అలాంటివి కొన్నిటిని స్మరించుకుంటే..

ఎస్.ఎన్. త్రిపాఠీ సంగీత దర్శకత్వంలో

'జరా సామ్‌నే తో ఆవో చలియే
చుప్‌చుప్ చల్‌నే మే క్యా రాజ్ హై
యూ చుప్‌నా సకేగా పర్‌మాత్మా
మేరీ ఆత్మా కీ యే అవాజ్ హై'
(జనమ్ జనమ్ కే ఫేరే)

'ఉన్ పర్ కౌన్ కరేగీ విశ్వాస్'
(కవి కాళిదాస్ )

రఫీ, లతా యుగళాల్లో అత్యధిక ప్రచారం పొంది ఈనాటికీ తరచు రేడియోలో వినవస్తుండే పాటలు.

అతి తక్కువ సినిమాలకు సంగీతం అందించిన రామ్‌లాల్ పాటల్లో అప్పుడూ, ఇప్పుడూ అదే తరచుదనంతో వినిపించే పాట రఫీ, లతాల యుగళమే. అదే ' సెహరా' లోని

'తుమ్ తో ప్యార్ హో - సజ్‌నీ
ముఝే తుమ్ సే ప్యారా ఔర్ న కోయీ'

ఇక మదన్ మోహన్ సినిమాల్లో యుగళాల సంఖ్యే తక్కువ. సోలోలే ఎక్కువుంటాయి. అందులోనూ, అతను రఫీ, ఆశాలకు ఎక్కువ పాటలు ఇచ్చాడు, యుగళాల్లో. (సోలోల్లో లతా కే పట్టం కట్టినప్పటికీ ) అయినా,

అ: అగర్ మై పూఛూఀ జవాబ్ దోగే
దిల్ క్యోం మేరా తడప్ రహా హై
ఆ: తేరే హీ దిల్ మేఀ హై ప్యార్ కుఛ్ కుఛ్
మేరే భీ దిల్ మేఀ జరా జరా హై
అ: అగర్ మై పూఛూఀ జవాబ్ దోగే
బురా న మానా తో మై అప్‌నే హాథోం
యే బిఖరీ జుల్ఫేఀ, సఀవార్ దూఀ మైఀ
హసీన్ పల్‌కోం కీ ఛాంవ్ మేఀ అబ్
యే సారా జీవన్ గుజార్ దూ మైఀ
ఆ: యే దిల్‌కీ బాతేఀ కోయీ న సున్‌లే
సనమ్ జమానా బడా బురా హై
అ: అగర్ మై పూఛూఀ జవాబ్ దోగే
ఆ: నజర్ బచాకే అగర్ మై జావూఀ
తో మేరా దామన్, నా థామ్‌లేనా
కోయీ జో పూఛే, యే క్యా హువా హై
కభీ భీ మేరా న నామ్ లేనా
అ: లగాకే దిల్‌సే రఖేంగే హమ్ తో
యే దర్ద్ తేరా దియా హువా హై,
అ: అగర్ మై పూఛూఀ జవాబ్ దోగే
యే ఠండీ ఠండీ , మచలతీ లహరేఀ
హమారే దిల్ కో జలా న జాలే
ఉఠే హై తూఫాఀ దిల్ ఏ నజర్ మేఀ
కిసే బచాయేఀ కిసే సంభాలేఀ
ఆ: న చైన్ తుమ్‌కో నా హోశ్ హమ్‌కో
అ: యే క్యా హువా హై
ఆ: యే క్యా హువా హై
అ: ॥అగర్॥



చిత్రం : షికారీ (1963)
సంగీతం: జి.ఎస్. కోహ్లీ
రచన: ఫారుఖ్ కైసర్
గానం : లతా, రఫీ

ఈ ముగ్గురి కాంబినేషన్ లోని

'దో ఘడీ వో జో పాస్ ఆ బైఠే

హమ్ జమానే సే దూర్ జా బైఠే' (గేట్ వే ఆఫ్ ఇండియా) బహుశా రఫీ, లతా ఆల్ టైమ్ ఉత్తమ గీతాల్లో ఒకటన్నా అతిశయోక్తి కాదు.

హేమంత్ కుమార్ సినిమాల్లో కూడా యుగళాలు తక్కువే. మిస్సమ్మ రీమేక్ అయిన మిస్ మేరీ లో మాత్రం రఫీ, లతాల యుగళాలున్నాయి. ఆ ఉన్న రెండు పెద్ద హిట్లే.

మొదటిది తెలుగు పాట 'బృందావనమది అందరిదీ' రాగంలోని 'బృందావన్ కా కృష్ణ కన్హయ్యా సబ్‌కీ ఆంఖోంకా తారా',

'రావోయి చందమామా' మాత్రం బాణీ మారింది.

'వో రాత్ కే ముసాఫిర్ చందా జరా బతాదే

మేరా కసూర్ క్యాహై తూ ఫైసలా సునాదే'

ఇలాంటి తెలుగు రాగమే హిందీలో కూడా వీరిద్దరి కాంబినేషన్‌లో సూపర్ హిట్టయిన పాట, 'సువర్ణసుందరి'లోని

'కుహూ కుహూ బోలే కోయలియా' (హాయి హాయిగా ఆమని సాగె)

ఆదినారాయణరావు సంగీత దర్శకత్వంలో వీరిద్దరి ఏకైక యుగళ గీతం ఇది.

కొన్నేళ్ళకొకసారి సంగీతం అందించినా మరపురాని పాటలు సమకూర్చే అపురూపమైన సంగీత దర్శకుడు ఖయ్యాం. అతని పాట పాడ్డమే ఒక గౌరవంగా గాయకులు భావిస్తారు.

'శోలా ఔర్ శబ్‌నమ్' చిత్రంలోని రఫీ సోలో గానీ (జానే క్యా ఢూంఢ్ తీ రెహతీ హై) రఫీ,లతాల యుగళంగానీ అలాంటి మధురగీతాలే. ఆ యుగళం ఇది -

జీత్ హీ లేంగే బాజీ హమ్ తుమ్

ఖేల్ అధూరా చూటేనా

ప్యార్ కా బంధన్ - జనమ్ కా బంధన్

జనమ్ కా బంధన్ టూటేనా, ప్యార్ కా బంధన్ టూటేనా'

ఈ పాటను రఫీ, లతా మంద్రస్థాయిలో, ఒకరికొకరు నచ్చజెప్పుకుంటున్నట్టుగా అద్భుతంగా ఆలపించారు. వీళిద్దరి స్వరాలు 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' లా ఎందుకుంటాయో, ఎలా ఉంటాయో చెప్పడానికి ఈ పాట కూడా ఒక ఉదాహరణ. ఇలాంటిదే మరొకటి -

'పియా కైసే మిలూ తుఝుసే - మేరీ పావ్ పడీ జంజీర్

దునియాసే హై క్యా శిక్‌వా - మేరీ రూఠ్‌గయీ తక్‌దీర్'

సర్దార్ మల్లిక్ సంగీత దర్శకత్వంలోనిది. ముఖేష్ పాటలకు సుప్రసిద్ధ చెందిన 'సారంగా' చిత్రంలోని రఫీ లతాల యుగళం.

చాలావరకు రఫీ, లతా పాటలు, ముఖ్యంగా '50,'60 దశకాల్లో వచ్చినవి, కొంచెం గాంభీర్యం పాలు ఎక్కువున్నవే. విషాదం, విరహం, లోకతిరస్కారం, పరస్పరసాంత్వనం, లేదా కలిసి ఉండంలోని ఆనందం, చివరికి ఆధ్యాత్మికం కలగలసిన పాటలే.

ఆ రోజుల్లో అల్లరి చిల్లర యుగళాలు ఆశాకే వెళ్లేవి. అయితే రఫీ, లతాలకు ఇలాంటి పాటలిచ్చి మనల్ని అలరింపజేసిన సంగీత దర్శకులు కూడా లేకపోలేదు.

జి.ఎస్.కోహ్లీ అంటే ఈ తరం శ్రోతలకు పేరే తెల్సివుండదు. కానీ 'షికారీ' లో రఫీ, లతాల స్వరంలోని రెండు యుగళ గీతాలు ఈ నాటికీ, వివిధ్‌భారతి, సిలోన్‌లలో మార్మోగుతుంటాయి.

'చమన్ కి ఫూల్ భీ తుఝుకో గులాబ్ కెహతే హై

హమీ నహీ- హమ్ హీ నహీ హై

సభీ - లా జవాబ్ కెహతే హై'

మరోటి

అగర్ మై పూఛూ - జవాబ్ దోగే

దిల్ క్యూ మేరా ధడక్ రహాహై

చిత్రం : మాయా(1961) సంగీతం: సలీల్ చౌధురి
రచన: మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం : లతా, రఫీ

ఆ: తస్‌వీర్ తేరీ దిల్ మేఁ, జిస్ దిన్ సే ఉతారీ హై ॥2॥
ఫిరూ తుఝే సంగ్ లేకే, నయే నయే రంగ్ లేకే
సపనోం కీ మహ్‌ఫిల్ మేఁ....
అ: తస్‌వీర్ తేరీ దిల్ మేఁ, జిస్ దిన్ సే ఉతారీ హై
ఫిరూ తుఝే సంగ్ లేకే, నయే నయే రంగ్ లేకే
సపనోం కీ మహ్‌ఫిల్ మేఁ...
తస్‌వీర్ తేరీ దిల్ మేఁ
ఆ: మాథే కీ బిందియా తూ హై సనమ్
నైనోం కా కజరా పియా తేరా హమ్ ॥ మాథే కీ॥
నైనా కే నీచే నీచే, రహూఁ తేరే పీఛే పీఛే
చలూఁ కిసీ మంజిల్ మేఁ.... ॥తస్వీర్ ॥
అ: తుమ్‌సే నజర్ జబ్ గయీ హై మిల్
జహాఁ హై కదమ్ తేరే వహీఁ మేరా దిల్ ॥ తుమ్‌సే॥
ఝుక్‌కే జహాఁ పల్‌కేఁ తేరీ, ఖులే జహాఁ జుల్ఫేఁ తేరీ
రహూఁ ఉసీ మంజిల్ మేఁ ॥తస్వీర్ ॥
ఆ: తూఫాన్ ఉఠాయేగీ దిల్ మగర్
రుక్‌నే సే భీ గా దిల్ కా సఫర్ ॥తుఫాన్॥
అ: యూహీ నజర్ మిల్‌తీ హోగీ
యూహీ షమా జల్‌తీ హోగీ తేరీ మేరీ మంజిల్ మే
ఆ: తస్‌వీర్ తేరీ దిల్ మేఁ, జిస్ దిన్ సే ఉతారీ హై
ఫిరూ తుఝే సంగ్ లేకే, నయే నయే రంగ్ లేకే
సపనోం కీ మహ్‌ఫిల్ మేఁ....
ఇ: ॥తస్‌వీర్॥



చిత్రం : సెహ్రా(1963) సంగీతం: రామ్‌లాల్
రచన: హస్రత్ జైపురి గానం : లతా, రఫీ

ఆ: తుమ్‌తో.... తుమ్‌తో.... ప్యార్ హో సజ్‌నా ॥2॥
ముఝే తుమ్‌సే ప్యారా ఔర్ న కోయీ ॥తుమ్‌తో॥
అ: తుమ్‌తో.... తుమ్‌తో.... ప్యార్ హో సజ్‌నీ ॥2॥
ముఝే తుమ్‌సే ప్యారా ఔర్ న కోయీ ॥తుమ్‌తో॥
ఆ: ఆ....ఆ....ఆ.... కిత్‌నా హై ప్యార్ హమ్‌సే కిత్‌నా బతాదో
అ: అంబర్ పే తారే జిత్‌నే ఇత్‌నా సమఝ్‌లో
ఆ: సచ్..? మేరీ కసమ్... !?
అ: తేరీ కసమ్ తేరీ యాద్ ముఝే లూటే
ఆ: అప్‌నే తో కాలేవాలే హోతే హై ఝూటే
చల్ జావో హట్ జావో దిల్‌కా బాలమ్ ఛోడో
అ: ॥తుమ్‌తో॥
ఓ...ఓ....ఓ....ఆకే న జాయే కభీ ఐసీ బహార్ హో
ఆ: తుమ్ భీ హో సారే లియే జీవన్ తోహార్ హో
అ: సచ్.. మేరీ కసమ్..!?
ఆ: తేరీ కసమ్ తూ హై ఆంఖ్ కే దిల్ మే
తుమ్‌భీ చుపీ మేరి శీషాయే దిల్ మే
తూ మేరే హమ్‌దమ్ మేరే
హమ్‌దమ్ మేరీ బాత్ కో మానో
అ: ॥తుమ్‌తో॥



ఓ - తేరే భీ దిల్‌మే హై ప్యార్ కుఛ్ కుఛ్
మేరే భీ దిల్ మే జరా జరాసీ'

ఇలాంటి మరో అల్లరి పాటే ఉషాఖన్నా సంగీత దర్శకత్వంలో 'ఆవో ప్యార్ కరే' చిత్రంలోని 'తుమ్ అకేలే తో కభీ బాగ్ మే జాయా నకరో'. సంగీత దర్శకుడు రవి కూడా యుగళ గీతాల్లో ఆశా కే పెద్ద పీట వేశాడు. అసలు అతని సినిమాల్లో యుగళాలు తక్కువ. రఫీ పాటల్లో కూడా ఇతని సంగీత దర్శకత్వంలో సోలోలే సూపర్ హిట్లు. అయినా 'గృహస్థి' వంటి చిత్రాల్లో రఫీ,లతా యుగళాలున్నాయి. మన తెలుగువారికి కూడా ప్రియమైన యుగళం 'దో కలియా' (తెలుగులో లేత మనసులు) లో

'తుమ్హారీ నజర్ క్యూ ఖఫా హోగయీ
ఖతా బక్ష్ దో గర్ ఖతా హోగయీ'.

ఇలా ఒక్కొక్క సంగీత దర్శకుడు అపుడపుడు రఫీ, లతాలతో పాడిస్తూ, అపురూపమైన గీతాలందించిన రోజుల్లో వారినే సంపూర్ణంగా నమ్ముకుని, మొదటి నుంచి చివరిదాకా తన కెరీర్‌ని నిర్మించుకున్న సంగీత దర్శకుడు చిత్రగుప్త్. (ఇప్పటి ఆనంద్, మిలింద్‌ల తండ్రి). ఇతని సంగీతంలో వీరిద్దరూ అద్భుతంగా పాడిన గీతాలెన్నో ఉన్నాయి.

భాభీ చిత్రంలోని 'చలీ చలీరే పతంగ్ చలీ చలీరే' హిట్ పాట కాగా 'ఛుపాకర్ మేరీ ఆంఖోంకో - వో పూఛే కౌన్ హై జీ హమ్' మరింత సుందరమైన పాట. ఈ పాటలో లతా స్వరంలోని మార్దవం అనితర సాధ్యం!

రఫీ చిలిపితనంతో అలరించే మధుర యుగళం 'మై చుప్ రహూంగీ' లోని ' చాంద్ జానే కహా ఖోగయా -
తుమ్ కో చెహరే సే పర్దా హటానా నథా'

అయితే, ఈ సినిమాలోనే ఈనాటికి చాలామందికి ఫేవరేట్ పాట

'కోయి బతాదే దిల్ హై జహా - క్యా హోతా హై దర్ద్ వహా
తీర్ చలాకే యే తో న పూఛో - దిల్ హై కహా ఔర్ దర్ద్ కహా'

చిత్రగుప్త్ సంగీతంలోని ప్రధాన లక్షణం ప్రతి స్వరంలోనూ సౌమ్యత, ఆహ్లాదం వెల్లివిరియడం. రఫీ, లతాల యుగళాల్లో కూడా అవే ప్రతిధ్వనిస్తాయి.

'కాలీ టోపి లాల్ రుమాల్ ' లోని 'లాగీ ఛూటేనా - అబ్ తో సనమ్'

జబక్ లోని 'తేరీ దునియా సే దూర్ - చలే హోకే మజ్‌బూర్ - హమే యాద్ రఖ్ నా' 'చాంద్ మేరీ ఆజా' లోని చాంద్ కో దేఖోజీ - మస్తీ లుటాయే' మొదలైనవి. 1970 దశకంలో హిందీ యుగళ గీతాల్లో గోల ప్రారంభమైన తర్వాత చిత్రగుప్త్, రఫీ, లతా కాంబినేషన్లో మాధుర్యమే ప్రధానమైన యుగళాలు వచ్చాయి. దీనికి ఓ రెండు ఉదాహరణలు చాలు.

వాస్నా చిత్రంలోని 'యే పర్‌బతోం కీ దాయ్‌రే - యే శామ్ కా ధువా
ఐసేమే క్యూ న ఛేడ్ దే - దిలోంకీ దాస్తాన్'
ప్యార్ కా సప్నా చిత్రంలోని
'ఐ మేరీ జిందగీ - తూ నహీ అజనబీ
తుఝ్ కో దేఖా హై పెహలే కభీ, ఐ మేరే హమ్ సఫర్
ముఝ్‌కో పెహచాన్‌లో మై వహీ హూ వహీ హూ వహీ'

ఈ పాటలు మళ్లీ '50 దశకంలోని మాధుర్యాన్ని గుర్తు చేస్తాయి. అవే 'వింటేజ్ చిత్రగుప్త్ ' అంటే!

అలా ఎంతోమంది సంగీతదర్శకుల స్వరకల్పనా సామర్థ్యాన్ని సార్థకం చేసిన గాన సామ్రాజ్యం రఫీ,లతా ది.

**- మృణాళిని**

రచన: సాహితి **1** గానం: మనో, రవివర్మ

అ: మాస్... మ... మ.. మాస్ హెయ్ మళ్లా
అన్న నడిచొస్తే మాస్ అన్న నించుంటే మాస్
అన్న లుక్కేస్తే మాస్.. మ... మ.. మాస్ ఏయ్ రో మాస్...
అన్న ఫాంటేస్తే మాస్ అన్న షర్టేస్తే మాస్
అన్న మడతెడితే మాస్ అయ్యా మాస్.. అదీలెక్క
అన్న కళ్లెర్రబడి అట్టే చూస్తేనే
అలా భూమే గుడ్డవుతుందిరా మాస్
అన్న కాళ్లెత్తి మరీ అట్టా అడుగేస్తే
ఇక అడ్డే ఎవడొస్తుడురా మాస్
హే.. మంచిగ ఉంటే మంచిని పంచే మనిషే కాడంట
మరి మాయలు చేస్తే ఎవ్వడికైనా
మద్దెల చప్పుడు తప్పదు పొమ్మంటా...
అన్నా... ఒక్కసారి పాడన్నా..
హే.. బగులు... బిగులు.. సెబలు.. అబ్బలు
మనం అడుగుపెడితే విజిల్ విజిలు
హే.. బగులు... బిగులు.. సెబలు.. అబ్బలు
మనం మొదలుపెడితే పిడత పగులు ॥అన్న నడిచొస్తే॥
కో: ఉయ్... ఉయ్.. ఉయ్... ఉయ్..
అ: హెయ్.. చిందే చిరునవ్వుతో ఇలా పెంచుకునే స్నేహాలతో
నీ సాటివారికందరికీ ప్రేమ పంచరా
ఆ ప్రేమకింక ప్రాణమైన పణముపెట్టరా
హెయ్... వస్తే ఓ బుద్ధుడిలా ఇస్తూ వస్తాను ఇలా
దోస్తీ కట్టేస్తా బిడ్డా మాస్.... మాస్.. మాస్...
చేసే మా కష్టమిలా మోస్తూ పోతూంటే
ఇక శాస్తి చేసేస్తదిరా మాస్..
హేయ్.. మంచిగ ఉంటే మంచిని పంచే మనసే మాసంట
అరె మాయలు చేస్తే ఎవ్వరికైనా
మద్దెల చప్పుడు తప్పదు పొమ్మంట ॥ హే.. బగులు...॥
కో: ఆ.... ఆ... ఆ.. ఆ...
అ: సరిగమ పద పమగరిస కో: హె... హె....
పస్సా పప పద పద కో: హె.. హె....
హే... మారో మారో కుర్రో భలే గుంతలక చిలకమ్మరో
ఇది ధూల్‌పేట అడ్డా కాదు నాటు సరుకురో
ఛలో మలక్‌పేట మలుపు దాక దుమ్ము దులపరో
హెయ్.. పొట్టా చేపట్టుకుని పనినే చూపెట్టమని
లొల్లే పెట్టెయ్యదురా రా మాస్... మాస్.. మాస్...
పొట్టే చేపట్టుకుని ఏదో పని పట్టుకుని కారం నేర్పేస్తదిరా మాస్
హేయ్.. మంచిగ ఉంటే మంచిని పంచే మనసే మాసంట
అరె మాయలు చేస్తే ఎవ్వరికైనా
మద్దెల చప్పుడు తప్పదు పొమ్మంట ॥ హే.. బగులు...॥
కో: అన్న నడిచొస్తే మాస్ అన్న నిలబడితే మాస్
అన్న లుక్కేస్తే మాస్.. మ... మ.. మాస్
అ: మ... మ.. మాస్
కో: అన్న ఫాంటేస్తే మాస్ అన్న షర్టేస్తే మాస్
అన్న షూ వేస్తే మాస్ అయ్యా మాస్.. హే మాస్

రచన: భాస్కరభట్ల రవికుమార్ **2** గానం: కార్తీక్

సాకి: నా బూరెలాంటి.. బుగ్గ చూడు... ఉ....మ్మా...
కారు మబ్బులాంటి కురులు చూడు...
వారెవ్వా.... క్యా హెయిర్ స్టయిల్ యార్...
కో: (వచనం) అన్నా సూపర్ అన్నా కంటిన్యూ కంటిన్యూ
అ: హెయ్... ఓ..ఓ.. వాలు కళ్ల వయ్యారి తేనె కళ్ల సింగారి
నా గుండెలోకి దూరి మనసులోకి జారి చంపినావె కావేరి
హో.. హో... హో.. బూరె బుగ్గ బంగారి చేప కళ్ల చిన్నారి
బుంగ మూతి ప్యారి నంగనాచి నారి లవ్వు చేయ్ ఓసారి
నిన్ను చూసినాక.... ఏమయిందో పోరి
వింత వింతగుంటోంది ఏమిటో ఈ స్టోరి
నువ్వు కనపడకుంటే తోచదే కుమారి
నువ్వు వస్తే మనసంతా సరిగపమగరి
వాలు కళ్ల వయ్యారి తేనె కళ్ల సింగారి
నా గుండెలోకి దూరి మనసులోకి జారి
చంపినావె కావేరి
నన్ను ముంచినావె దేవేరి
నీ... హృదయంలో నా... కింత చోటిస్తే
దేవతల్లే చూసుకుంటా... నీకు ప్రాణమైనా రాసి ఇస్తా
అలా... కోపంగా నా... వైపు నువ్వు చూస్తే ...
దీవెనల్లె మార్చుకుంటా దాన్ని ప్రేమలాగ స్వీకరిస్తా..
నా కోసం పుట్టినావని, నా మనసే చెప్పినాదిలె
ఈ బంధం ఎప్పుడో ఇలా పై వాడు వేసినాడులె
ఒప్పుకో తప్పదె ఇప్పుడే ఇక్కడే నీకు నేను ఇష్టమేనని
ఓ.... వాలు కళ్ల వయ్యారి
ఆ: వాలు కళ్ల వయ్యారి
అ: తేనె కళ్ల సింగారి
ఆ: తేనె కళ్ల సింగారి
అ: నా గుండెలోకి దూరి మనసులోకి జారి
చంపినావె కావేరి నన్ను ముంచినావె దేవేరి...
కో: వాహ్.. వాహ్.. హో... వాహ్.. వాహ్.. హో...
కుర్రాడు మంచివాడుగా ఒప్పుకో
వాహ్.. వాహ్.. హో... వాహ్.. వాహ్.. హో...
ఆరడుగుల అందగాడు ఒప్పుకో
అ: ఈ.. ముద్దుగుమ్మే నా వైపుగా వస్తే బంతిపూల దారి వేస్తా
లేత పాదమింక కందకుండా
ఈ... జాబిలమ్మే... నా లైఫ్‌లోకొస్తే
దిష్టి తీసి హారతిస్తా ఏ పాడు కళ్లు చూడకుండా
నాలాంటి మంచివాడిని మీరంతా చూసి వుండరే
ఆ మాటే మీరు ఈమెతో ఓసారి చెప్పి చూడరే
ఒప్పుకో తప్పదె ఇప్పుడే ఇక్కడే నువ్వు నాకు సొంతమేనని..
॥ఓ.... వాలు కళ్ల వయ్యారి॥

రచన: సాహితి **3** గానం: రంజిత్, కల్పన

ఆ: ఇందురూడు సెందురూడు సూపుతోనె సూది గుచ్చి సంపుతాడు
అందగాడు అందగాడు మాటతోనే మత్తు మందు చల్లుతాడు ॥ఇందు॥
కారంగ నవ్వే నవ్వి చురకేసే పిలగాడు
కమ్మంగ చిట్కా చేసి చుట్టూ తిప్పుకున్నడు
మెల్లంగ మీసం దువ్వి మెలికేసే తుంటరోడు
చల్లంగ మస్కా కొట్టి మనసే గుంజుకున్నడు...
వాలు చూసి వీలు చూసి ముగ్గులోకి దించినాడు
కాలుకేస్తే వేలుకేసే మాయదారి చచ్చినోడు హెయ్... హెయ్... ఓ... ఓ..
ఓలమ్మో..... ఓరయ్యో.... లేత.. గుమ్మడిపండే నా సొగసు
వెన్నల్లె కరిగించి పులుసల్లె మరిగిస్తాడే ఈ వయసు
అ: ఏంటమ్మో ఎదురొచ్చి జివ్వంటూ లాగేస్తే ఆగేదెలా
మోహమాటం వదిలించి మోచెంత దాచేస్తా ఈ.. వే....ా
ఆ: అబ్బ ఏమి చెప్పనమ్మో చుప్పనాతి సోకులోడు
పైట చెంగు ఒంటినిండ కప్పుకుంటె ఊరుకోడు
సందె ఈట నడుముకాడ తేనె కాటు వేసినాడు
పట్టపగలే మిట్ట సోకు కళ్లు కుట్టు పోకిరోడు
ఇందురూడు సెందురూడు అందగాడు అందగాడు
కో: ఓ మాన్... మాంగల్యం తంతునానేనా మమ జీవన హేతునా
కంఠే బధ్నామి శుభ హే త్వం జీవితం శరదాంశతం
హే... గుళ్లో పెళ్లికాని లవ్ లవ్ చేసుకుంటూ
మిల్క్‌షేక్ వర్క్‌షాప్ లివ్వరా
ప్రేమా దిక్కులన్ని డిస్‌ప్లే చేసుకుంటూ
షకబూమ్‌బూమ్ షకబూమ్ బూమ్ షకబూమ్ బూమ్
ఎంజాయ్ చెయ్యరా అన్నయా
అ: ఓయమ్మో చిలకమ్మో చెయ్యైనా వేయక ముందే గిలిగింత
ఆ: నీ దుడుకే చూస్తుంటే సిగ్గేదో కమ్మిందమ్మ ఒళ్లంతా
అ: ఇన్నాళ్లు ఊరించి ఈనాడే సిగ్గంటే వేగేదెలా
ముద్దుల్లో ముంచెత్తి నీ దోర కుచ్చిళ్లే లా...గా..లా..
ఆ: అయ్యో రామా ఇంతలోనే ఎంత పని చేసినాడు
అందులోని ఇందులోని అంతులేని తొందరోడు
కొంతకాలం ఆగమన్నా ఆగలేని కోడెగాడు
కోడికూత వేళలోపే కొంపగిట్టా వచ్చినాడు ॥ఇందురూడు॥

రచన: సాహితి (4) గానం: టిప్పు, ప్రసన్న

అ: కొట్టు కొట్టు కొట్టు రంగు తీసి కొట్టు రంగులోనే లైఫ్ ఉందిరా ॥2॥
అ: కొట్టు కొట్టు కొట్టు డోలు దెబ్బ కొట్టు ఒంటినిండా సత్తు వుందిరా॥2॥
అ: హె.. ఎర్ర రంగులోన చూడు కో: రబ్బా రబ్బా
అ: కుర్ర గుండె జోరు ఉంది కో: రబ్బారే
అ: పచ్చరంగులోన చూడు కో: రబ్బా రబ్బా
అ: పడుచుకళ్ల గీర ఉంది కో: రబ్బారే
అ: రంగు ఏదైనగానీ ఊరు వేరైనగానీ రారో మనమంత ఒక్కటే
అ: హోలి హోలి హోలి రంగుల రంగోలి
కో: హోలి హోలి హోలి రంగుల రంగోలి నింగినేల రంగే మారాలి
హోలి హోలి హోలి రంగులోన తేలి చెమ్మచెక్క జలకాలాడాలి
అ: ॥ కొట్టు కొట్టు ॥
ఆ: హె... కోరమీసపు రోసగాడివే ఓరకంట నన్ను చూడవెందుకు
అ: కొంటె కోణంగి పిల్లవే నా సూరునుంటి కొంపే కొల్లేరు చేస్తవె హాయ్..
ఆ: అన్ని ఊళ్లకి అందగత్తెని చెంతకొచ్చి పలకరించవెందుకు
అ: అమ్మో సందిస్తె చాలులే అరగంటలోనె మెళ్లో జడగంటలేస్తవే
ఆ: నవ్వే ఓరందగాడ నువ్వే ఆ సందెకాడ నాతో సరసాలు ఆడ రావె రావె
అ: అట్టా కయ్యాల భామ నీతో సయ్యాటలాడా నీపై ఆశంటు ఒకటి ఉండాలె
ఆ: ఇంద్ర ధనస్సులోని ఉండే ఆ రంగులన్నీ నాలో ఉన్నాయి చూడరో...
అ: హోలి హోలి హోలి..
కో: హోలి హోలి హోలి రంగుల రంగోలి చిందులెయ్యి చిందె వెయ్యాలి
హోలి హోలి హోలి రంగులోన తేలి చీకుచింతలన్నీ మరవాలి
అ: ॥కొట్టుకొట్టు॥
కో: ఒరె లచ్చన్నా రంగులన్నీ అయిపోయినయ్ తొరగా తీసుకురండ్రా..
హోయ్... హోయ్.. ఆయిరే హోలి ఆయిరే ఓరబ్బా హోలి
రంగోకి వర్షా లాయిరే తా ధినక్ త ధినక్ త ధినక్త
తథిమ్ ధినక్త ధినక్ త ధినక్త థితాంగ్ థితాంగ్ త
అ: క్యా బాత్ హై
ఆ: కాటుకెట్టిన కళ్లమాటున దాచుకున్న కన్నె ఊసులెందుకు
అ: నీలా నీలాల నింగిలో ఆ గాలి మేడలెన్నో కట్టేయడానికే .. హెయ్
ఆ: పాల బుగ్గల చిన్నదానికి పైట చెంగు ఎగిసిపడేదెందుకో
అ: బంతి పూబంతి భామనీ ఓ పూల కట్టి బంతులాగించటానికే
ఆ: నన్నే పెళ్లాడువాడు తాళె కట్టేటిచోట ఎట్టా ఉంటాడో ఏమో నా జతగాడు
అ: నిన్నే మెచ్చేటి వాడు బుగ్గే గిచ్చేటి తోడు రానే వస్తాడు చూడు ఓర్నాయనో
ఆ: పండే నోములన్నీ పండే నవరంగులకి చిందే బంగారు కాంతులే
అ: హోలి హోలి హోలి
కో: హోలి హోలి హోలి రంగుల రంగోలి సంబరాల సరదా చెయ్యాలి
హోలి హోలి హోలి రంగులోన తేలి సందడంతా మనదే కావాలి
అ: ॥కొట్టు కొట్టు॥

రచన : విశ్వ (5) గానం: వేణు, సునీత సారధి

అ: ల ల లాహిరే ల ల లాహిరే ఆ:ల ల లాహిరే ల ల లాహిరే
అ: గెట్ ఇట్ డౌన్ టుక్ ఇట్ డౌన్ మాన్
ఆ: ల ల లాహిరే ల ల లాహిరే
దిల్ దకదకమంటూ దరువేస్తుంటే ల ల లాహిరే
కో: నో...నో.. నో...నో...
అ: ల ల లాహిరే ల ల లాహిరే
ఛల్ ధగధగ మెరిసే ఒళ్లే చూస్తే ల ల లాహిరే ల ల లాహిరే
కో: నో.. నో.. నో...నో
ఆ: సరదాగ ఒకసారే .. ఒడికొస్తే మంజారే
గిరిగీస్తే సెన్సారే విజిలేస్తే వన్స్‌మోరే అయ్యోయ్యో
కో: కిస్‌మిస్ .....కిస్‌మిస్ చిక్ చిక్
అ: హె లిప్ చూస్తే లాలీపాప్ హిప్ చూస్తే బాప్‌రే బాప్
షాకులిచ్చే షేపు చూస్తే గుండెలే పాకప్
ఆ: ల ల లాహిరే హె హె హె... ల ల లాహిరే ల ల లాహిరే
నువ్వు తకతకమంటూ తరిమేస్తుంటే ల ల లాహిరే ల ల లాహిరే
కో: నో.. నో.. నో.. నో.... డుబ్... డుబ్.. డువి.. డువి... డువి..॥4॥
ఆ: గివ్‌మీ గివ్‌మీ జస్ట్ ఒన్ ఛాన్స్ లెట్ మీ టీచ్ యు ట్రూ రొమాన్స్
అ: సన్నాయంటి అమ్మాయి అయిపోతే అంతడ్వాన్స్
అందాలన్నీ ఆరేస్తూ చేయించకులే న్యూడాన్స్
ఆ: దిల్ కా చోర్ కర్ నే ప్యార్ ఎంచక్కా కువారా
చూపిస్తే జోర్ నే తయార్ దరికే రా రా త్వరగా రణధీరా
కో: కిస్ మిస్ కిస్‌మిస్ చిక్ చిక్
అ: హె ఫ్రంట్ చూస్తే టెమ్టేషన్ బ్యాక్ చూస్తె సెన్సేషన్
సోకు అన్నమాటకే ఇది కొత్త ఈక్వేషన్... హోయ్
హె.. రుక్ రుక్ రుక్ రుక్ రుక్సానా హె.. కసి కసి కన్నుల కొరమీనా
ఆ: నిన్నీయాల అల్లేయాల మెత్తగ మురిపాల
ఒళ్లోకొస్తూ వయ్యారాల వలనే విసిరేయనా
అ: ఓ దిల్ దార్ బేకరార్ సంధించెయ్యి నీతీర్
నీ సరిరారు లేనే లేరు ఛలిగా రావె దరికే మనసారా
ఆ: యు రియల్లీ టర్న్ మీ ఆన్ యు డ్రైవ్ మీ క్రేజీ ఆల్ ఎలాంగ్
బాయ్ ఐ వానా బీ యువర్ లవ్ లెట్స్ క్యారీ ఆన్ అండ్ ఆన్
ల... ల... లాహిరే అ: కమాన్ కమాన్
ఆ: ల ల లాహిరే ల ల లాహిరే
నువ్వు తకతకమంటూ తరిమేస్తుంటే ల ల లాహిరే
కో: నో...నో.. నో...నో...
అ: ల ల లాహిరే ల ల లాహిరే
తన ధగధగ మెరిసే ఒళ్లే చూస్తే ల ల లాహిరే ల ల లాహిరే
కో: నో.. నో.. నో...నో

రచన: సాహితి (6) గానం: ఉదిత్ నారాయణ్, సుమంగళి

అ: నాతో వస్తావా నాతో వస్తావా
నా ప్రాణం అంతా నీకే ఇస్తా నాతో వస్తావా
ఆ: నీతో వస్తాలే నీతో వస్తాలే
నీ గుండెల్లోన గూడే కడితే నీతో వస్తాలే
అ: నీ అడుగు అడుగున తోడుంటా నాతో వస్తావా
ఆ: ఏడడుగులు ఇంక నను నడిపిస్తే నీతో వస్తాలే
అ: ఆకాశమైన అరచేతికిస్తా మరి నాతో వస్తావా
హోయ్... గోరి గోరి గోల్కొండ ప్యారీ రావె నా సంబరాల సుందరి
కో: హెయ్... చోరి చోరి చోరి చేయబారి కోరి
నీదే ఈ సోయగాల చోకిరి
అ: మదిలో ఆ: ఆ...ఆ...ఆ..
అ: మెదిలే ఆ: ఆ...ఆ...ఆ....
అ: ప్రతి ఆశా నువ్వు
ఆ: ఎదలో కదిలే ప్రతి అందం నువ్వు
అ: హృదయం ఆ: ఆ...ఆ....ఆ....
అ: ఎగిసే ఆ: ఆ...ఆ...ఆ...
అ: ప్రతిశ్వాసా నువ్వు
ఆ: నయనం మెరిసే ప్రతి స్వప్నం నువ్వు
అ: రేయి పగలు నా కంటిపాపలో నిండినావె నువ్వే
ఆ: అణువు అణువునే తీపి తపనతో తడిసిపోయె కలలే
అ: హె... గింగిరాల బొంగరాల టింగురంగసాని
రావె నా జింగిలాల జిగినీ
కో: హె... రంగులేని ఉంగరాలు వేలు వెంట జారి
మెళ్లో నీ తాళిబొట్టు పడనీ
అ: నాతో వస్తావా...... నాతో వస్తావా
నా ప్రాణం అంతా నీకే ఇస్తా నాతో వస్తావా
కో: హోయ్.. హోయ్...
అ: అరెరె ఆ: ఆ....ఆ...ఆ..
అ: అరెరె ఆ: ఆ..ఆ...ఆ...
అ: తేనూరే పెదవి
ఆ: మెలికే పడని తనువేదో బరువే..
అ: పడితే ఆ: ఆ... ఆ..ఆ..
అ: నదిలా ఆ: ఆ.. ఆ... ఆ..
అ: వరదయ్యే నడులు
ఆ: త్వరగా విడనీ నీదయ్యే క్షణము
అ: పరువమెందుకీ పరుగులాటలే
పరుపు చేరు వరకూ
ఆ: పడుచు వయసులో కంచిపట్టులే
బరువులాయె నాకు
అ: హోయ్... చెంతకింక చేర చేర
సిగ్గులెందుకోరి రావె నా బంతిపూల లాహిరి
కో: హోయ్.. చెంగులోన దూరి దూరి
గింగురెత్తి పోరి కొంగె గొడుకెత్తుకుంది జాంగిరి
అ: నాతో వస్తావా నాతో వస్తావా
నా ప్రాణం అంతా నీకే ఇస్తా నాతో వస్తావా
ఆ: నీతో వస్తాలే నీతో వస్తాలే
నీ గుండెల్లోన గూడే కడితే నీతో వస్తాలే

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




## తారాగణం

అక్కినేని నాగార్జున, జ్యోతిక, ఛార్మి
రఘువరన్, రాహుల్‌దేవ్, ప్రకాష్‌రాజ్,
సునీల్, జీవా, ధర్మవరపు సుబ్రహ్మణ్యం,
వేణుమాధవ్, ద్రాక్షారామం సరోజ,
స్వాతిప్రియ, సమీర్, రాజేష్, రమ్య,
నర్సింగ్ యాదవ్, అపూర్వ.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : పరుచూరి బ్రదర్స్ |
| పాటలు | : సాహితి, భాస్కరభట్ల, విశ్వ |
| సంగీతం | : దేవిశ్రీప్రసాద్ |
| ఎడిటింగ్ | : మార్తాండ్, కె. వెంకటేష్ |
| ఫోటోగ్రఫీ | : శ్యామ్.కె.నాయుడు, |
| ఆర్ట్ | : తోట తరణి |
| ఫైట్స్ | : విజయ్ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : వి. రఘురాం, ఎమ్.వి.బుచ్చిబాబు |
| పి.ఆర్.ఓ. | : ఎల్.వేణుగోపాల్ |
| పబ్లిసిటీ | : కిరణ్ పోస్టర్ యాడ్స్ |
| కో - డైరెక్టర్ | : వి.వి.ఎస్.రామప్రసాద్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : ఎ.వి. రత్నం, పి. వంశీదర్‌రావ్, మురుగేషన్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : బలగ శేషు,హర్షవర్ధన్ |
| మేకప్ | : బొమ్మదేవర రామచంద్రరావు |
| కాస్ట్యూమ్స్ | : శేఖర్ |
| సహ నిర్మాత | : వై. సుప్రియ |
| నిర్మాత | : అక్కినేని నాగార్జున |
| కథ, స్క్రీన్ ప్లే-దర్శకత్వం | : రాఘవ లారెన్స్ |


నాగార్జున అక్కినేని


రాఘవ లారెన్స్


దేవిశ్రీ ప్రసాద్


భాస్కరభట్ల


సాహితి


విశ్వ

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| తమిళం | | తెలుగు |
| --- | --- | --- |
| చిత్రం | : కర్ణన్ | కర్ణ |
| రచన | : కణ్ణదాసన్ | డా॥ సి.నారాయణరెడ్డి |
| సంగీతం | : విశ్వనాథన్-రామమూర్తి | విశ్వనాథన్-రామమూర్తి |
| గానం | : పి.సుశీల | పి.సుశీల |

బి.ఆర్.పంతులు నిర్మించిన తమిళ చిత్రం 'కర్ణన్'కు తమిళ చలన చిత్ర చరిత్రలో విశిష్టమైన స్థానం ఉంది. ఆ చిత్రంలో శివాజీగణేశన్ కర్ణుడి పాత్ర ధరించగా, ఎన్.టి.రామారావు శ్రీకృష్ణుడి పాత్ర ధరించారు. సంగీత పరంగానూ విజయం సాధించిన ఆ చిత్రానికి విశ్వనాథన్-రామమూర్తి చాలా చక్కని సంగీతం సమకూర్చారు.

ఆ చిత్రం కోసం పి.సుశీల పాడిన 'కణ్ణుక్కు కులమేదు' అనే పాట - వీరుల విషయంలో కుల ప్రస్తావన అనవసరమనీ కులాన్నిబట్టి కాక గుణగణాలను బట్టి మనుషుల మేలిమిని నిర్ణయించాలనీ చెబుతుంది. కణ్ణదాసన్ రాసిన ఆ పాట ఎంతో ప్రాచుర్యం పొందింది. 'కర్ణన్' తమిళ చిత్రాన్ని 'కర్ణ' పేరిట తెలుగులోకి అనువదించారు. అనువాద చిత్రాలకు తక్కువ పాటలు రాసిన డాక్టర్ సి.నారాయణరెడ్డి- 'కర్ణ' చిత్రం కోసం 'కణ్ణుక్కు కులమేదు' పాట చోట రాసిన 'గాలికి కులమేది' పాట తమిళంలోని మూల గీతం కన్నా వన్నెలోనూ, వాసిలోనూ మెరుగైనది.

ఆ వన్నె గురించీ వాసి గురించీ చెప్పుకునే ముందు తమిళ గీతాన్ని ఒకసారి పరిశీలించాలి.

కణ్ణదాసన్ రాసిన తమిళ గీతం ఇది :

**కణ్ణుక్కు కులమేదు కణ్ణా కరుణైక్కు ఇనం ఏదు**
**విణ్ణుక్కుళ్ పిరివేదు కణ్ణా విళక్కుక్కు ఇరు ళేదు?**
**పాలినిల్ ఇరుందే నెయ్ పిఱక్కుం - కణ్ణా**
**పరంపొరుళ్ కండే ఉయిర్ పిఱక్కుం**
**వీరత్తిల్ ఇరుందే కులం పిఱక్కుం - అదిల్**
**మేల్ ఎన్ణుమ్ కీళ్ ఎన్ణుమ్ ఎంగిరుక్కుం?**
**కొడుప్పవర్ ఎల్లాం మేలావార్ - కైయిల్**
**కొళ్పవర్ ఎల్లాం కీళావార్ - తరుబవన్ ఇల్లై మీ కణ్ణానీ**
**దరుమత్తిన్ తామే కలంగాదే**



తమిళగీతం ప్రతి పదార్థాలు :

కణ్ణుక్కు = కంటికి ; కులమేదు = కులమేది (కుల మెక్కడిది)
కణ్ణా = ప్రియా / కన్నా; కరుణైక్కు = కరుణకు; ఇనం = జాతి
ఏదు = ఏది; విణ్ణుక్కుళ్ = ఆకాశంలో;పిరివు = విభజన / తెరిపి;
ఏదు = ఏది; విళక్కుక్కు = దీపానికి, ఇరుళేదు = చీకటి ఎక్కడిది?
పాలినిల ఇరుందే = పాలలో నుంచే; నెయ్ = నెయ్యి;
పిఱక్కుం = పుడుతుంది; పరంపొరుళ్ = పరమాత్మ (పరమ పదార్థం)
కండే = చూచే,ఉయిర్ = జీవం; పిఱక్కుం = పుడుతుంది.
వీరత్తిల్ ఇరుందే = వీరం నుంచే; కులం = కులము
పిఱక్కుం = పుడుతుంది; అదిల్ = అందులో
మేల్ = పైది; ఎన్ణుమ్ = అనీ; కీళ్ = కింద; ఎన్ణుమ్ = అనీ;
ఎంగు ఇరుక్కుం = ఎక్కడుంటుంది?
కొడుప్పవర్ = ఇచ్చేవారు, ఎల్లాం = అందరూ
మేల్ ఆవార్ = మీది వారవుతారు,
కైయిల్ = చేత ,కొళ్పవర్ = తీసుకునేవారు/ అందుకునేవారు,
ఎల్లాం = అందరూ; కీళావార్ = కిందివారవుతారు,
తరుబవన్ = ఇచ్చేవాడు; ఇల్లైయా = కదా
దరుమత్తిన్ = ధర్మపు; తాయే = తల్లీ;
కలంగాదే = కలత పడకు

**ఈ పాటలో చెప్పిన భావాలు ఇవి :**

కంటికి (దృష్టికి ) కులంలేదు. కరుణకు జాతిలేదు. ఆకాశంలో అంతా ఒక్కటే. అందులో విభాగాలు కనిపించవు. దీపానికి చీకటిలేదు.

పాలనుంచి నెయ్యి పుడుతుంది. పరమాత్మ నుంచి జీవకోటి పుడుతుంది. వీరం నుంచే కులం పుడుతుంది. అందులో మీది కులమనీ కింద కులమనీ ఎక్కడుంటుంది?

ఇచ్చేవారిదే పై చేయి. చేయి చాచి అందుకునే వారు కిందివారే. నీవు ఇచ్చేవాడివి కదా! ధర్మానికి తల్లి వంటి ఆశ్రయమైన వ్యక్తివి. నీవు కలత పడ కూడదు.

ఏ మనిషికైనా గొప్పతనం పుట్టుకను బట్టికాక గుణగణాలను బట్టీ ప్రవర్తనను బట్టీ వస్తుంది. రాచ కూతురికి జన్మించినా - సూత పుత్రుడిగా పెరిగిన కర్ణుడికి అడుగడుగునా అవమానాలే ఎదురయ్యాయి. కలత చెందిన కర్ణుడికి అతని భార్య ధైర్యం చెబుతున్నట్టు పాట సాగుతుంది.

తమిళంలోని ఈ పాట ప్రాచుర్యానికి సాహిత్యం కన్నా సంగీతమే ఎక్కువ దోహదం చేసిందని చెప్పాలి. విశ్వనాథన్ - రామమూర్తి సమకూర్చిన బాణీని సుశీల తమ వాణి ద్వారా వినిపించిన తీరు ఎంతో గొప్పగా ఉంది.

ఈ తమిళగీతం కన్నా 'కర్ణ' తెలుగుచిత్రం కోసం డా॥ సి.నారాయణరెడ్డి రాసిన పాట బాగుండడానికి ముందే కూర్చిన బాణీకి సాహిత్యం సొగసుగా సార్థకంగా అమరడం కారణం.

తమిళగీతంలో 'చూపుకు కులం లేదు' అంటే మనిషిని చూడగానే కులం ఏమిటో తెలియదు అని అర్థం చెప్పుకోవాలి. కేరళలో నారాయణగురు అనే మహనీయుడు కులాతీత సంఘ సంస్కరణ కోసం ఎంతో పరిశ్రమించారు. ఒకసారి ఆయనను ఒక పెద్దమనిషి 'మీ కులం ఏమిటి?' అని అడిగితే నారాయణగురు 'చూస్తే తెలియంది, చెబితే ఎట్లా తెలుస్తుంది?' అని జవాబిచ్చారట.

తన కులం గురించి కర్ణుడు బాధపడుతూ ఉంటే - అతనిది జాతి

గాలికి కులమేది
గాలికి కులమేది
ఏదీ నేలకు కులమేది
గాలికి కులమేది
మింటికి మరుగేది ఏది
మింటికి మరుగేది ఏది
కాంతికి నెలవేది ॥గాలికి॥
పాలకు ఒకటే...
పాలకు ఒకటే తెలివర్ణం
ఏది ప్రతిభకు కలదా స్థలబేధం
వీరుల కెందుకు కులబేధం
అది మనసుల చీల్చేడు మతబేధం ॥గాలికి॥
జగమున యశమే.....
జగమున యశమే మిగులునులే
అది యుగములకైనా చెదరదులే
దైవం నీలో నిలుచునులే
ధర్మం నీతో నడుచునులే
ధర్మం నీతో నడుచునులే ॥గాలికి॥



కరుణ అనీ అతను ధర్మానికి తల్లివంటి వాడనీ పాటలో నాయిక ఊరడిస్తున్నది.

తమిళగీతాన్ని అనుసరించి తెలుగు పాట రాయవలసినట్లయితే 'కంటికి కులం లేదు' అనే పల్లవితో రాసి ఉండాలి. తెలుగు పాట గొప్పతనం పల్లవితోనే మొదలవుతుంది. 'గాలికి కులమేది' అనడంలో ప్రకృతిలో భాగమైన గాలి, కులాన్ని బట్టి ఎక్కువ తక్కువలు చూపదనే ధ్వని ఉంది. ప్రకృతిలో కులభేదం లేదు. గాలికే కాదు నేలకూ కులం లేదు అని పల్లవిని కొనసాగించడం వల్ల తెలుగు పాట అనువాద గీతంగా కాక అసలు పాట ఇదేనేమో అనిపించేంత చక్కగా రూపొందింది.

తమిళం గీతంలో 'ఆకాశానికి అంతరం లేదు' అని ఉన్న భావం తెలుగులో 'మింటికి మరుగేది' అని కనిపిస్తుంది. ఈ చిన్న పంక్తి విషయంలోనే తమిళ గీతంలోని భావాన్ని తెలుగు పాట కొంత అనువదించడానికి ప్రయత్నించినట్లు అనిపిస్తుంది. మిగతా పంక్తులన్నీ స్వతంత్రంగా రాసుకున్నవే.

'పాలనుంచి నెయ్యి పుడుతుంది','పరమాత్మ నుంచి జీవం పుడుతుంది' అని తమిళగీతంలో ఉన్నా - పాలరంగులాగా ప్రతిభ ఎక్కడున్నా ప్రకాశిస్తుందంటుంది తెలుగు పాట.

తమిళగీతం 'వీరం నుంచి కులం పుడుతుంది' అంటే తెలుగు పాట 'వీరుల కెందుకు కులభేదం ' అంటుంది.

తమిళగీతం రెండవ చరణంలో కర్ణుడి దాతృత్వ ప్రస్తావన ఉంది. ఆ ప్రస్తావనను విడనాడి 'జగమున యశమే మిగులునులే' అనడం తమిళగీతంలోని ధర్మప్రస్తావనను మరింత చక్కగా ' దైవం నీలో నిలుచునులే', 'ధర్మం నీతో నడుచునులే' అనడం డాక్టర్ నారాయణరెడ్డి తెలుగు పాటకు సంతరించిపెట్టిన అలంకారాలు.

నేటికీ ఈ తెలుగు పాటను ఎందుకు గుర్తుంచుకొన్నారంటే అందుకు కారణాలు చాలా. వాటిలో కొన్ని - పాట పల్లవి సూక్తిలాగా అమరడం., పాటంతా స్వతంత్ర గీతంలా సాగడం., తెలుగు పాటను మాధుర్యంలో ముంచెత్తిన పి.సుశీల గళం.

# బాణీ ముత్యాలు


సీతారామశాస్త్రి

సూర్యుడైనా చూపగలడా రేయిచాటున్న రేపుని
చీకటైనా ఆపగలడా వచ్చేకలల్ని వద్దనీ
పిరికి పరదా కప్పగలదా ఉరకలేస్తున్న ఆశని
దేవుడైనా చెప్పగలడా సమస్యలనేవి రావనీ
ఎన్నో అందాలు స్వాగతిస్తూ కళ్లముందుండగా
అందుకోకుండా ఆగిపోతూ ఉసూరుమంటే ఎలా

చిత్రం : ఖడ్గం
పాట పల్లవి : ముసుగు వెయ్యొద్దు మనసుమీద


సినారె

కణకణలాడే ఎండకు శిరసుమాడినా
మనకు తల నీడను అందించే చెట్టే అమ్మ
చారెడు నీళ్లైనా తాను దాచుకోక
జగతికి సర్వస్వం అర్పించే మబ్బే అమ్మ

చిత్రం : ప్రేమించు
పాట పల్లవి : కంటేనే అమ్మ అని అంటే ఎలా


సుద్దాల అశోక్‌తేజ

ఒకపూవు వాడెననీ పూదోట వదులుకుంటామా
గాయాలు అయినవనీ దేహాన్ని విడిచిపెడదామా

చిత్రం : మా ఆయన సుందరయ్య
పాట పల్లవి : ఇలలోన భార్యకు భర్తే ఓదార్చుదైవము




# తల్లిగా, గాయనిగా రాణిస్తున్న జమేలియా!

'మాతృత్వంలోనే ఉంది ఆడజన్మ సార్థకం' అని అచ్చతెలుగులో పాట పాడకపోయినా, బ్రిటన్ పాప్‌సింగర్ జమేలియా మాతృత్వంలోని మాధుర్యాన్ని ఆస్వాదించడం కోసం రెండేళ్ళపాటు కెరీర్‌కు బ్రేక్‌నిచ్చి అప్పట్లో వార్తల్లో వ్యక్తి అయింది. జయాపజయాల కారణంగానే కెరీర్ గ్రాఫ్‌లో ఎత్తుపల్లాలు ఉంటాయనుకుంటే పొరపాటే, మహిళల కెరీర్‌లో అనేక అంశాలు ఈ గ్రాఫ్ గమనాన్ని నిర్దేశిస్తాయనడానికి జమేలియా ఓ ఉదాహరణ!

ఇరవై మూడేళ్ళ జమేలియా పదిహేనేళ్ళ వయసులోనే స్కూల్ గేటు దాటి రికార్డింగ్ థియేటర్‌లోకి అడుగు పెట్టింది. ఆమెది వయసుకు మించిన గాత్రం అని ఎ అండ్ ఆర్ సంస్థకు చెందిన లాయడ్ బ్రౌన్ తెలుసుకున్నారు. రిథమ్ సీరిస్ ఆఫీస్‌లో ఆమె సొంతంగా పాటలు రాసుకుని పాడటం గమనించి, లాయడ్ ఆమెను సంగీత ప్రపంచానికి పరిచయం చేసే పనిని పెట్టుకున్నాడు.

చైల్డ్ సైకాలజీ చదవాలనుకున్న జమేలియా ట్రాక్ మార్చి మ్యూజిక్ ట్రాక్స్ వెంట అడుగులు వేసింది. పదిహేనేళ్ళ వయసులోనే ఆమెకు గాయనిగా అవకాశం వచ్చి, కాంట్రాక్ట్ పేపర్ మీద సంతకం పెట్టినా, ఆ పాట వెలుగులోకి రావడానికి మరో మూడేళ్ళు వేచియుండాల్సి వచ్చింది. మొత్తం మీద పార్లోఫోన్ రిథమ్ సీరిస్‌కు జమేలియా మొదట పాట పాడింది. ఆ తర్వాత 'రేడియో వన్'కి 'ఐ డూ' అనే పాటను పాడింది. అదే యేడాది వేసవిలో రేడియో వన్ నిర్వహించిన రోడ్ షో లోనూ జమేలియా పాటలు పాడడంతో ప్రసారమాధ్యమాల దృష్టి ఆమె మీదకు మళ్ళింది.

'ఐ డూ' గీతం 'టాప్ -40' లిస్ట్‌లోకి చేరింది. యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఆర్ అండ్ బి సంగీతంలో మంచి గాయని కోసం అప్పటికే ఎందరో ఎదురుచూస్తున్నారు. అయితే ఆ కొరతను పద్దెనిమిదేళ్ళ జమేలియా తీరుస్తుందని మాత్రం ఎవరూ ఊహించలేదు. జమేలియాకు 'మనీ' గీతం కూడా ఎంతో పేరు తెచ్చిపెట్టింది. 2000వ సంవత్సరంలో మోబో (మ్యూజిక్ ఆఫ్ బ్లాక్ ఆరిజన్) అవార్డ్స్‌లో జమేలియాకు నాలుగు నామినేషన్లు దక్కాయి. సంగీతప్రియుల్ని జమేలియా స్వరం ఆకట్టుకోవడంతో విజయపథంలో ఆమె అప్రతిహతంగా సాగిపోయింది.



సరిగ్గా అదే సమయంలో ఆమె గర్భవతి అయింది. రికార్డింగ్ థియేటర్స్‌కు వెళ్ళి పాటలు పాడలేని ఆ పరిస్థితుల్లోనూ ఆమె పాటకు దూరం కాలేదు. భవిష్యత్తును దృష్టిలో ఉంచుకుని మంచి పాటలు రాయడానికి ఆ సమయాన్ని కేటాయించింది. 2001 మార్చిలో జమేలియా ఓ ఆడశిశువుకు జన్మనిచ్చింది. తర్వాత రెండేళ్ళ పాటు ఆ బిడ్డకోసమే తన సమయాన్నంతా వెచ్చించింది. ఆ సమయంలో బ్రిటన్ సంగీత ప్రపంచంలో ఆమెలేని లోటు స్పష్టంగా కనిపించింది. ఆ లోటును పూర్తిచేయడం కోసమే 'బౌంట్ 'అనే సింగిల్‌తో మరోసారి తన సత్తాను జమేలియా చాటుకుంది.

జూన్ 2003లో'బౌంట్' విడుదలై పాప్ సంగీత ప్రపంచంలో ఆమె స్థానం సుస్థిరమని నిరూపించింది. ఆ ఆల్బమ్ విడుదల సమయంలో సాంకేతికంగా అనేక అడ్డంకులు ఎదురయినా, జమేలియా వాటిని అధిగమించి విజయాన్ని పొందింది.

సెప్టెంబర్ 15న విడుదల చేసిన 'సూపర్‌స్టార్' సింగల్‌తో జమేలియా రేంజ్ మరింత పెరిగింది. 'సాహిత్యం, సంగీతం పోటాపోటీగా ఉన్నాయని, ఆర్ అండ్ బి లో ఇదో కొత్త మలుపు' అని విమర్శకులు ప్రశంసించారు. ముఖ్యంగా 'థ్యాంక్యూ', 'లైఫ్' గీతాల సాహిత్యం అనేకమంది మన్ననలను పొందింది. శారీరక హింసను వ్యతిరేకిస్తూ జమేలియా రాసిన పాటలు యువతను బాగా ఆకట్టుకున్నాయి. అలానే ఈ పాటల బాణీలకు మంచి పేరు వచ్చింది. జమేలియా చైల్డ్ సైకాలజీ చదవకపోవటం వల్ల ఆ రంగానికి ఏదైనా లోటు జరిగి ఉంటే, అది ఆమె సంగీత ప్రపంచానికి అంకితం కావడంతో ఇక్కడ పూరించినట్లు అయ్యింది.



## బాల్యం నుండే అవగాహన అవసరం

జమేలియా మూడేళ్ళ ముద్దుల కూతురు పేరు తేజ. ఇప్పటి నుండే తన కుమార్తెను జమేలియా రికార్డింగ్ థియేటర్లకు వెంట తిప్పుతోంది. ఆ మధ్య 'బ్రాండ్ ఎయిడ్ 20' సంస్థ 'డు దేనో ఇట్స్ క్రిస్మస్?' అనే ఆల్బమ్‌ను రూపొందిస్తే తేజను వెంటపెట్టుకుని అక్కడకు వెళ్ళింది జమేలియా. ఈ విషయమై వివరిస్తూ, "ఆఫ్రికాలో లక్షలాది అన్నార్తులను దృష్టిలో పెట్టుకుని రూపొందించిన ఆల్బమ్ అది. చిన్న వయసు నుండే పిల్లలకు ఈ ప్రపంచం గురించి, తమ చుట్టూ ఉన్న వారి కష్టసుఖాలను గురించి తెలియచెప్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది. బాధల్లో మునిగి ఉన్నవారిని చూసినప్పుడు తామెంత అదృష్టవంతులమో పిల్లలకు తెలుస్తుంది. అప్పుడే వాళ్ళలో ఎదుటివారికి సాయం చేయాలనే భావనా కలుగుతుంది" అని చెప్పింది.

30 సెప్టెంబరు 2004వ తేదిన జమేలియా 'మోబో' అవార్డులు మూడు తీసుకుంది. బెస్ట్ సింగర్ (థ్యాంక్యూ), బెస్ట్ వీడియో (సీ ఇట్ ఇన్ ఎ బోయ్స్ ఐస్) లకు అవార్డులు వచ్చాయి. అలానే బెస్ట్ యు.కె. యాక్ట్ ఫర్ ద ఇయర్ అవార్డ్‌ను మరోపాప్‌సింగర్‌తో కలిసి పంచుకుంది. నిన్న మొన్నటివరకూ ఒంటరిగా జీవితాన్ని సాగించిన జమేలియా మొన్న వేసవి నుండి సూకర్ ఆటగాడు డారిన్ బైఫీల్డ్‌తో చెట్టాపట్టాలేసుకు తిరుగుతోంది. అతనిలో మంచి తండ్రి ఉన్నాడని, అతని పిల్లలకు తాను తల్లిని కావాలన్నది తన కోరికని బాహాటంగానే చెబుతుంది. భవిష్యత్తులో తామిద్దరూ జంటగా మారే అవకాశాలు లేకపోలేదని ఆశాభావంతో ఉంది జమేలియా!

- వి. అరుణసత్యవతి



ఇద్దరు స్నేహితురాళ్ళు చాలా కాలం తర్వాత కలుసుకున్నారు. ఒకామె చెప్పింది
"మా ఇంట్లో అందరం ఏదో ఒకటి రాస్తునే ఉంటాం"
" అలాగా ... మీ వారేం రాస్తుంటారు?"
"నవలలు"
"మీ అబ్బాయి ?"
"కథలు"
"మీ అమ్మాయి?"
"కవితలు"
"మరి.. నువ్వు..."
"నేను అందరికన్నా బిజీ.."
"అంటే ఏంటి రాస్తుంటావ్?"
"ఆయిల్"
"అదేంటి?"
"రాసిరాసి వాళ్ల చేతులు నొప్పిపుడితే రాయాల్సింది ఆయిలేగా "





"నువ్వు ఎన్నైనా చెప్పు.. నీ కంటే నేనే అందగత్తెను తెలుసా?"
" అదెలా చెప్పగలవు ?"
"మీ పక్కింటి అబ్బాయి నీకు రాయకుండా ప్రేమలేఖ నాకు రాసాడు కాబట్టి"



"ఏమ్మా!.. మీవారు రాత్రి బాగా తాగివచ్చి నిన్ను కొట్టినట్లున్నారు. ఎందుకట....?"
"ఏముంది, నేను వచ్చి తలుపు తడతానని తెలిసి కూడా తలుపు ఎందుకు తీసి ఉంచావని కొట్టారు పిన్నిగారూ".

"మా పార్టీని గెలిపిస్తే మీరు ఏది చేయమంటే అది చేస్తాం".
"నిజంగానే చేస్తారా..!"
''తప్పకుండా ...కావాలంటే బాండ్ పేపర్ మీద రాసిస్తా.."
"అలా అయితే మీరు ఓ వేళ అధికారంలోకి వస్తే వెంటనే రాజీనామా చేస్తానని రాసివ్వండి?"






''సార్! మీరు రచయితగా ఎన్నో ఉన్నత శిఖరాలను అధిరోహించారు గదా! మరి.. మన వర్ధమాన రచయితలకు మీరేమైనా సలహాలిస్తారా..? "
"ఏముంది... ఏ రచయిత సలహాలూ పాటించకండి... మీకు మీరుగా సాగిపోండి. అంతే."

**ఈ జోకులను పంపించిన వారు: బి.వి.యస్. బాబు, తెనాలి.**



"ఏ దిక్కుమాలిన రోజున నిన్ను కలిశానో గానీ - ఆ రోజునుండీ నా జీవితం నరకం లోకి తోయబడింది."
"మీ బర్త్‌డే పార్టీలోనే కదా మొదటిసారిగా నన్ను చూసి మీరు మనసు పడింది... మర్చిపోయారా!?"

"ఏరా ! మధ్యాహ్నం నా కారు తీసుకువెళ్లేవ్ కదూ...?"
"అవున్నాన్నా! నా ఫ్రెండ్ రామకృష్ణని రైల్వే స్టేషన్‌లో డ్రాప్ చెయ్యడానికి తీసుకువెళ్లేను."
"అలాగా! వాడి లిప్‌స్టిక్ కారులో పడిపోయింది. పాపం ఎంత అవసరంలో ఉన్నాడో ఏమిటో వెంటనే పంపించెయ్ వాడికి".



**ఈ జోకులను పంపించిన వారు: కోనే నాగవెంకట ఆంజనేయులు,విశాఖపట్నం.**



"యిప్పటికే దగ్గుకోటి, జ్వరానికోటి అంటూ రెండు ఇంజక్షన్లిచ్చారు మరి ఈ మూడోదెందుకు డాక్టర్"
"మూడు నా సెంటిమెంటు నంబరయ్యా.. అందుకనీ..."

"మీ ఆయన అలా రోజూ తాగొస్తుంటే ఊరుకుంటావేంటీ?"
"ఏం చేయను.. అది పుచ్చుకున్నప్పుడే నేను అప్సరసలా ఉన్నా నంటారు మరి"



**ఈ జోకులను పంపించిన వారు: లకనం మూర్తి, కాకినాడ.**



అప్పు : ఇవాళ్టినుండి వీధిలో ఆడుకోవద్దురా
ఇంట్లోనే ఆడుకుందాం!
పప్పు : ఎందుకూ?
అప్పు : మా అమ్మ కారు డ్రైవింగ్ నేర్చుకోవడం మొదలు పెట్టిందిరా.



హరి : అదేంట్రా ! వాడు బౌలర్ వేసిన బంతిని కొట్టకుండా బాట్ విసిరేసి కేచ్ పట్టుకున్నాడేంటి?
గిరి : వాడు బెస్ట్ వికట్ కీపర్ లే .. అందుకని...




"ఎంటయ్యా ఈ గది, వర్షం నీరు లీకౌతూనేవుంది? ఎప్పుడూ యింతేనా?"
"లేదుసార్; వర్షం వచ్చినప్పుడే".



ఇద్దరు స్నేహితులు సినిమా చూస్తున్నారు. సినిమాలో ఇద్దరు పోటీ పడుతూ సైకిల్ తొక్కుతున్నారు. ఎవరు గెలుస్తారో ఊహించడం కష్టంగా ఉంది;
మొదటివాడు : ఓరేయ్ ! నా ఉద్దేశ్యంలో ఎర్రచొక్కా వాడే గెలుస్తాడు రా'
రెండవ వాడు : కాదు నల్ల చొక్కావాడే;
చివరికి నల్ల చొక్కా వాడే గెలిచాడు;
మొదటివాడు : వాడే గెలుస్తాడని ఎలా చెప్పగలిగావు రా?
రెండవవాడు : మార్నింగ్ షోలోనూ వాడే గెలిచాడు కదా



**ఈ జోకులను పంపించిన వారు: నరసింహమూర్తి, విశాఖపట్నం.**

"ఇంతకీ మీకు వంట మనిషి దొరికిందా లేదా!?"
"లేదు... కానీ మా వారు వట్టుదల మనిషి... మొత్తానికి సాధించారు"
"అయితే దొరికిందన్న మాట.. కంగ్రాట్స్"
"దొరికిందని ఎవరన్నారు. మావారే పట్టుబట్టి వంట నేర్చుకున్నారు".





"చూడమ్మా ! నాకు దోసెలు యిష్టం, మీ మావయ్యగారికి ఇడ్లీలు యిష్టం. అబ్బాయికి పూరీలు యిష్టం. మరి నీకేదిష్టం ?" అడిగింది అత్తగారు కొత్త కోడలితో.
"వేరే కాపురం"

**ఈ జోకును పంపించిన వారు: ఎస్. శివనారాయణ, కొత్తపేట.**

శ్రీను : అదేంటి జుట్టుకి రంగు వేసుకుంటారు గాని గుండుకెవరైనా వేసుకుంటారా?
చైతన్య : ఏం చెయ్యమంటావురా మరి బయట హెల్మెట్‌లు దొరకటం లేదు కదా.



**ఈ జోకులను పంపించిన వారు: గొల్లపూడి శ్రీనివాస్, హైద్రాబాద్.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన బి.వి.యస్. బాబు-తెనాలి, కోనే నాగవెంకట ఆంజనేయులు-విశాఖపట్నం, లకనం మూర్తి-కాకినాడ, నరసింహమూర్తి-విశాఖపట్నం, ఎస్.శివనారాయణ -కొత్తపేట, గొల్లపూడి శ్రీనివాస్-హైద్రాబాద్ గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'సామ్రాట్' ఆడియో సి.డి. బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.

SOHAN
MUSIC



50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటి జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

19

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

'పండంటి కాపురం' ఆడుతున్న టైమ్‌లో వేరే షూటింగ్‌కని నేను హైదరాబాద్‌కి వచ్చాను. అప్పటికి ఆ సినిమా సూపర్బ్‌గా ఆడుతోంది. థియేటర్‌కు వెళ్లి పబ్లిక్‌లో కూర్చుని చూశాను. బయటకొచ్చేసరికి 'రాణీ మాలినీదేవి జిందాబాద్ జిందాబాద్' అని కారు వెంట పడ్డారు. కొంచెం వెలుతురు ఉన్నప్పుడే అక్కడకు వెళ్లటం వల్ల చూశాను. బైట ఉన్న ఫోటోల్లో అందరి ఫోటోలు ఉన్నాయి కానీ నా ఫోటో మాత్రం లేదు. ఎక్కడో నాలుగు తలకాయల్లో చిన్న తలకాయ ఓ మూల ఉంది. థియేటర్ ఓనర్‌ను పిలిపించి 'ఇంత మంచి పేరు వచ్చింది... ఈ క్యారెక్టర్ ఫోటో పట్టుకుని వెళ్లి ఎక్కడో మూల పడేసారు, ఎందుకు?' అని అడిగితే... 'లేదండీ మీది పెద్ద కటౌట్ 10-15 అడుగులది పెట్టాము. ఎంట్రన్స్ పోర్టికో ఉంటుంది కదా.. అక్కడ కుక్కతో ఉన్న ఫోటో పెట్టాము... చాలా రోజులు అక్కడే ఉంది.' అని అది ఉన్న ప్లేస్ చూపించారు.

ఆ రాణీ మాలినీదేవి క్యారెక్టర్ ఆడవాళ్లలో ఒక చైతన్యం తీసుకు వచ్చింది. అంతవరకూ హీరోయిన్ పాత్రంటే ఒక మనిషి తనను మోసం చేస్తే ఆత్మహత్య చేసుకోవడం, లేకపోతే గర్భం తీయించుకోవడం, లేకపోతే ఒక విషాదాన్ని నింపుకుని, విషాదాంతం అయిపోతున్న క్యారెక్టర్సే... అలాగే చూపించేవారు. అలాంటిది ఈ పాత్ర స్త్రీల మీద ఎంతగా ప్రభావం తెచ్చిందంటే ఎవడన్నా

చిత్రం : పూలరంగడు
రచన: సి.నారాయణరెడ్డి
సంగీతం : ఎస్.రాజేశ్వరరావు
పాడినవారు: ఘంటసాల, పి.సుశీల

రంగ : నీ జిలుగుపైట నీడలోన నిలువనీ నన్ను నిలువనీ
ఎంకి: నీ అడుగులోన అడుగువేసి నడువనీ నన్ను నడువనీ ॥నీ జిలుగు॥
రంగ : చిక్కని బుగ్గలపై చిటికెలు వేయనీ
సన్నని నవ్వులలో సంపెంగ లేరనీ!
గులాబి పెదవులనే అలా అలా చూడనీ!
గులాబి పెదవులనే అలా అలా చూడనీ! ॥నీ జిలుగు॥
రంగ : పచ్చిక తిన్నెలలో వెచ్చగ సాగనీ
ఎంకి : వెచ్చని వెన్నెలలో ముచ్చటలాడనీ
రంగ : ముచ్చటలాడి ఆడి, మురిసి మురిసి సాగనీ! ॥నీ జిలుగు॥
రంగ : మబ్బుల వాడలో మనసులు కూడనీ
ఎంకి : మల్లెల మేడలో మమతలు పండనీ
రంగ: బంగారు కోవెలలో కొంగులు ముడివేయనీ
ఎంకి: బంగారు కోవెలలో కొంగులు ముడివేయనీ ॥నీ జిలుగు॥



తనను మోసం చేస్తే ఈ విధంగా పగ తీర్చుకుని వాడిని పెళ్లి చేసుకోవడమో, లేకపోతే వాడిని బాధ పెట్టడమో, కోర్టులకు వెళ్లటమో లాంటి కరేజియస్ యాటిట్యూడ్ క్రియేట్ చేసింది. అలా నాకు ఫ్యాన్స్ కూడా ఉత్తరాలు రాసేవారు. ఏవండీ నాకు ఇలా జరిగింది. నన్ను ఒకతను మోసం చేసాడు. రాణీ మాలినీదేవిలాగా వాడి మీద ఎలా పగ తీర్చుకోవాలా అని చూస్తున్నాను... అంటూ!

ఆ తర్వాత నుంచి నేను బయటకు వెళితే.. అంటే షాపింగ్ , సినిమాలకు వెళితే రాణీ మాలినీదేవి జిందాబాద్ అనేవారు. అలాగే ఎవరన్నా కొంచెం పొగరుగా, వగరుగా ఉంటే.. 'ఏంటి పెద్ద... రాణీ మాలినీదేవిలాగా ఫోజులు కొడుతున్నావ్' అనేవారు. ఆ పాత్ర నభూతో... అని చెప్పాలి. నిజంగా ఆ పాత్ర లేకపోతే ఆ సినిమా ఏమిటనే ఆలోచన మనం ఇమాజిన్ చేసుకోలేం. భలే అన్‌ఫర్‌గెటబుల్ క్యారెక్టర్. థాంక్స్ టు ప్రభాకర్ రెడ్డిగారు. చాలా మంచి పాత్ర ఇచ్చారు నాకు.

ఆ చిత్రంలో ఉన్న గొప్పతనం ఏంటంటే స్టార్ ఫిట్‌నెస్ కూడా బాగా కుదిరింది. ఏ పాత్రలకు ఎవరు బాగుంటారో అలానే ఎంపిక చేశారు. దేవిక... హోమ్లీగా కనిపించింది, ఎస్వీరంగారావుగారు, సరోజాదేవి.. ఎంత స్టార్ స్టడెడ్ పిక్చర్.., అన్నిటికన్నా ముచ్చటైన విషయం ఏమిటంటే నెంబర్‌వన్ హీరోయిన్‌గా ఓ వెలుగు వెలిగిన జయసుధ ఆరోజున నా కూతురుగా చేసింది.

ఇప్పుడు మనం అన్నపూర్ణా పిక్చర్స్ గురించి చెప్పుకోవాలి. ఆ బ్యానర్ పై దుక్కిపాటి మధుసూదనరావుగారు, నాగేశ్వరరావుగారు కలిసి... కె.వి.రెడ్డి గారి దర్శకత్వంలో 'దొంగ రాముడు' తీశారు. సూపర్‌హిట్ అయింది. నా ఉద్దేశ్యంలో అదే మొదటి 100 రోజుల చిత్రం అయ్యుంటుంది నాకు. 'దొంగరాముడు' 100 రోజుల ఫంక్షన్‌కు విజయవాడలో బ్రహ్మాండమైన ప్రొసెషన్.. వీధుల్లో మమ్మల్ని ఊరేగించి తీసుకెళ్లారు థియేటర్‌కు.

ఆ తరువాత అన్నపూర్ణా వాళ్లు చాలా సినిమాలు చేశారు.. కానీ నాకు మళ్లీ అవకాశం రాలేదు... 12 సంవత్సరాల గ్యాప్ తరువాత.. 'దొంగ రాముడు' 55లో వస్తే, 67 లో నాకు అన్నపూర్ణా వారి 'పూలరంగడు'లో అవకాశం వచ్చింది. అప్పటికే నాకు పెళ్లయింది. 'పూలరంగడు' సారథి స్టూడియోలో తీశారు. ఇంచుమించు 'దొంగరాముడు' సినిమానే 'పూల రంగడు'లాగా మలిచారు. అయితే మలచటం చాలా బాగా కుదిరింది. అప్పుడు 'దొంగరాముడు'లో నేను చెల్లెలు వేషం వేస్తే ఆ వేషం 'పూలరంగడు'లో విజయనిర్మల చేత చేయించారు. నేనూ, నాగేశ్వరరావు గారు హీరో హీరోయిన్లు. అప్పుడు సావిత్రి హీరోయిన్‌గా చేసింది.

ఇందులో ప్రత్యేకత ఏమిటంటే హీరోయిన్ క్యారెక్టర్‌ను చక్కగా మలిచారు. ఒక గడ్డి కోసుకునే అమ్మాయిలాగా బాగా మాస్ అప్పీల్ ఉండేట్టు చేసేరు. డ్రస్ కూడా పల్లెటూళ్లో మాదిరి టైట్‌గా గోచి కట్టుకోవడం, గడ్డి మోపు నెత్తిమీద పెట్టుకుని అమ్ముతుండటం... ఇలా మాస్ అప్పీల్ క్యారెక్టర్‌లా చేశాను. పాటలు కూడా బ్రహ్మాండంగా ఉంటాయి దాంట్లో. ప్రత్యేకంగా ఓ డ్రీమ్ సాంగ్. 'నీ జిలుగు పైట నీడలోన నన్ను నిలవనీ' అని చాలా చక్కటి పాట. మొత్తం పిక్చర్ అంతా బ్లాక్ అండ్ వైట్‌లో ఉంటే ఈ ఒక్క పాట మాత్రం కలర్ ఉంటుంది. ఊటీలో తీశారు. ఇంకొక మంచి పాట. 'మిన మిన లాడే చినదానా...' అందులో డ్యాన్స్ మూమెంట్స్ బాగుంటాయి. ఆ తరువాత మూడో పాట పద్మనాభంతో. చాలా మాస్ అప్పీల్ సాంగ్ అది. వెయ్‌రా చిన్నోడెయ్‌రా.. అని డిక్కీ వాయిద్యం పట్టుకుని పాడే పాట. డిక్కీ నేర్పటం అన్నమాట. డిక్కీ వేయమని చెప్పటానికి ఆ పల్లవి. నేను ఒకటే గొడవ. అందులో డబుల్ మీనింగ్ ఉందని. "ఏంటి సుబ్బారావు గారూ... ఈ డబుల్ మీనింగ్ ఏంటని." అడిగితే "డబుల్ మీనింగ్ ఏంటమ్మా... ఎదురుగా డిక్కీ కనబడుతోంది. డిక్కీ నేర్పుతోంది'' అన్నారు డైరెక్టరు ఆదుర్తి సుబ్బారావుగారు.

ఆ పాటలో చాలా చక్కగా డ్యాన్స్ చేయించారు. ఈ రోజున జీన్స్ అని.. ఏవేవో అంటున్నారు కానీ.... నిజమైన సెక్స్ అప్పీల్, బ్యాక్ బ్యూటీ గానీ... లేకపోతే ఫ్రంట్‌లో కాలు వంకరగా పెట్టి నించుంటే ఉన్న సెక్స్ అప్పీలు ఈ జీన్స్‌లోగానీ.... ఎక్స్‌పోజ్ చేయటంలో గానీ లేదు. అందులో ఒక షాట్ తీశారు... గడ్డిమోపు పెట్టుకుని డాక్టర్‌గారింటికి వస్తుంది హీరోయిన్. అలా వస్తున్నప్పుడు ఓ బ్యాక్ షాట్ పెట్టారు సుబ్బారావు గారు. గడ్డి పెట్టుకుని నడుము తిప్పుకుంటూ వస్తూ ఉంటే ఆ సీన్ రాగానే విపరీతమైన విజిల్స్ నేను యాక్చువల్‌గా సినిమా హాల్లో ఈ సినిమా చూశాను... శృంగార భావన ప్రేక్షకులకు టికిలింగ్‌లా అనిపించాలి గానీ రోత పెట్టి, అసహ్యం పుట్టే లెవల్‌కు దిగజారి పోకూడదు. అలా దిగిపోయింది ఇప్పుడు. ఆ రోజుల్లో అలా ఉండేది కాదు. సెక్స్ అప్పీల్ అంటే ఏదో ఒక అందాన్ని అలా టచ్ చేసి చూపించేవారు. ప్రేక్షకుడిలో శృంగార భావాన్ని పెంచేవారు. ఇప్పుడు వచ్చేవి కామాన్ని రెచ్చగొట్టేవి. ఆ రోజుల్లో శృంగార రసంలో హృదయాన్ని చక్కలిగింతలు పెట్టినట్టుగా తీసేవారు.

'పూలరంగడు' సినిమా షూటింగ్ టైమ్‌లో జరిగిన కొన్ని తమాషా సంఘటనలు జ్ఞాపకం వస్తున్నాయి. మేము హెయిర్‌డ్రస్సరని, మేకప్ మేన్ అని, టైలరని మాకుగా వేం పెట్టుకుంటాం. ఎందుకంటే ప్రొడక్షన్ మేకప్‌మాన్ అని అనుకుంటే మేం క్యూలో ఉండాలి. అందుకని మేమే పే చేసి తెచ్చుకునేవాళ్లం. అప్పట్లో మేం మద్రాస్‌లోనే ఉండేవాళ్లం. ఈ సినిమా ఫస్ట్ షెడ్యూల్ లో నా మేకప్‌మాన్‌ని, నా హెయిర్ డ్రెస్సర్‌ని తెచ్చుకున్నాను. హెయిర్ డ్రస్సరేమో మా గురువుగారి వైఫ్. ఇందులో పెద్ద హెయిర్ స్టయిల్ ఏమీ లేదు. ఊరికే కొప్పు పెట్టుకోవటం అంతే. ఫస్ట్ షెడ్యూల్ అయిపోయింది. ఆ రోజుల్లో హెయిర్ డ్రస్సర్‌కి రోజుకి 35 రూపాయలు ఇచ్చేవారు. ఫస్ట్ షెడ్యూల్ అంతా ఇంటీరియర్. అది అయిపోయిన తరువాత పేమెంట్ ఇవ్వమంటే వచ్చే షెడ్యూల్‌లో ఇస్తామన్నారు. సరే నెక్స్ట్ షెడ్యూల్ వచ్చేటప్పటికి నాకు ఫోన్ చేసారు... 'ఏమండీ ప్రొడ్యూసర్‌గారు చెప్పారు. మీ మేకప్ బాగా లేదంట. మా వాళ్లు ఇక్కడ ఉన్నారు. వేస్తారు అన్నారు.' అన్నారు. అదేంటయ్యా 'మంగమ్మ శపథం' లాంటి పిక్చర్‌లకు అతనే వేశాడు. పాతిక ముప్పై పిక్చర్‌లనుండీ అతను నాకు పర్మనెంట్. మధ్యలో ఒక షెడ్యూల్ అయిన తరువాత తీసెయ్యమనడం అదేం ధర్మం" అని చెప్పి అంటే "... లేదండీ చెప్పమన్నారు" అన్నారు. సరే వచ్చాను. నిజంగా జీవితంలో ఫిల్మ్ ఆర్టిస్ట్‌గా కావాలని ఎవరినీ ఎప్పుడూ ఏడిపించలేదు కానీ వీళ్లను మాత్రం బాగా ఏడిపించాను... అంటే ఒక నగ్న సత్యాన్ని వారికి తెలియజేశాను.

సాధారణంగా మేకప్‌కి ఏడు గంటలకు వస్తాను. మామూలుగా అయితే గంట గంటన్నర, మైథలాజికల్ అయితే నగానట్రా తగిలించుకోవాలి కాబట్టి రెండు గంటలు పట్టేది. అంటే 9.30 లోపల సెట్‌లోకి వెళ్లటం జరిగేది. ఫస్ట్ రోజు మామూలుగానే వెళ్లాను. ఎవరూ లేరు. నేనూ, నాగేశ్వరరావుగారే కాబట్టి కరెక్ట్ టైమ్‌కే సెట్‌కు వెళ్లిపోయాం. తరువాత రోజు నేను నా టైమ్ ప్రకారం ఏడు గంటలకు వెళ్లేటప్పటికి ఓ డజను మంది అప్పటికే అక్కడ ఉన్నారు. ఓ ముగ్గురికి ఆయన మేకప్ వేస్తున్నారు. వాళ్లకు సగం వేశారు. మిగతాది మీరు వేసుకోండి అని వాళ్లను దింపేశారు. సరే అసిస్టెంట్స్ వచ్చి ముందు వీళ్లు కావాలి, వాళ్లు కావాలి అని చెబుతారు కదా... సరే నాకు మేకప్ వేసి, నా రూమ్ కెళ్లి డ్రస్సింగ్ చేసుకుని, హెయిర్ డ్రస్సింగ్ అంతా చేసుకుని సెట్‌కు వెళ్లేటప్పటికి 10.30, 11 గంటలు అయింది. అక్కడే దుక్కిపాటిగారు ఉన్నారు. ఆయనకు మేం





ఓ పేరు పెట్టుకున్నాం. రింగ్ మాస్టర్ అని! ఆయనంటే మాకు గౌరవంతో కూడిన భయం. అందుకని ఆయనను ఏమీ అనలేక అలా అనుకునే వాళ్లం.

నేను 11 గంటలకు వెళ్లేటప్పటికి ఆయనకు కోపం వచ్చింది. ఏంటమ్మా 11 గంటలకా వచ్చేది... ఏంటి ఇది అన్నారు కోపంగా. "అవును సార్ ఏం చేయమంటారు. రేపు 12 గంటలు కూడా కావచ్చు. లాస్ట్ టైమ్ మా మేకప్ మేన్ ఉన్నప్పుడు నేను 9.30కల్లా సెట్‌లోకి వచ్చాను. మరి మీరేదో స్పెషల్ మేకప్ వేయిన్నన్నారు కదా అందుకని లేటవుతోంది, అదీగాక అక్కడ బోలెడు మంది ఉన్నారు. క్యూలో చేయించుకోవాలి. ఏం చేయాలి" అని నేనూ కొంచెం గట్టిగానే సమాధానం చెప్పాను. అదయిపోయింది. ఇంచుమించు ఆ షెడ్యూల్ అంతా అలాగే జరిగింది. ప్రతిసారీ 10.30, 11 గంటలకు సెట్ మీదికి వెళ్లేదాన్ని. నాదేమీ తప్పులేదు. అక్కడ క్యూ ఉంటే ఎవరేమి చేస్తారు.

ఇలా అవుతూ ఉంటే ఇక నాలుగో రోజున ఏం చేసారంటే... "మేడమ్ మేడమ్ లిప్‌స్టిక్ మీరేసుకొండి, ఐబ్రోస్ మీరు దిద్దుకోండి" అని కుర్చీలో నుండి దిగిపొమ్మన్నారు. అప్పుడు నేనన్నాను... "నా మేకప్ బాగోలేదనే కదా.. దుక్కిపాటి గారు మిమ్మల్ని పెట్టింది... రేపొద్దున్న లిప్‌స్టిక్ పైకి పోయింది, ఐ బ్రోస్ వంకర పోయింది అని మళ్లీ కాల్షీట్లు అడిగితే నేను ఎక్కడినుండి తేను. కాబట్టి పూర్తి మేకప్ మీరే వేయాలి, నేను కుర్చీ దిగను" అని మొండికేసి కుర్చీలోనే కూర్చున్నాను. కంప్లీట్ రెండు రోజులు అలాగే చేశాను. దే హేవ్ టు నో... ఎందుకు నేను లేట్‌గా వస్తున్నానని. సరే ఆ షెడ్యూల్ అయిపోయింది. ఈ రెండు షెడ్యూల్స్‌కు అక్కయ్యాగారే నాకు హెయిర్ డ్రస్సర్.

అక్కయ్య గారంటే దుగ్గిరాలలో ప్రసాద్ లింగం గారని మా హెడ్ మాస్టరు. ఆయన దగ్గర మేం చదువుకున్నాం. ఆయన రిటైరైపోయిన తరువాత నేను అడయార్ ఇంట్లో ఉన్నప్పుడు ఆయన ఉత్తరం రాసారు. అమ్మా నేను రిటైరైపోయాను. చాలా కష్టాల్లో ఉన్నాను అని. ఆయనకు అప్పులు అవి ఏవో ఉన్నాయి. అవి తీర్చుకోవాలి. "నేను డాన్స్‌తో ఏదో నాటకం పెట్టుకున్నాను. నువ్వు, జగ్గయ్య వస్తే ఏదో ఫండ్ రైజ్ చేసుకుని అప్పులు తీర్చుకుంటాం" అన్నారు. సరేనని నేనూ, జగ్గయ్య గారూ వెళ్లాం. పాపం ఆయనకు టిక్కెట్లు అమ్ముటం రాలేదు. ఆ వచ్చిన

నే నూ నా పా ట లు



| చిత్రం:పూలరంగడు | రచన:సి.నారాయణరెడ్డి |
|---|---|
| సంగీతం:ఎస్.రాజేశ్వరరావు | పాడినవారు:ఘంటసాల,సుశీల |

మిసమిసలాడే చినదానా!
ముసి ముసి నవ్వుల నెరజాణా
సిగ్గులు చిలికి సింగార మొలికి చేరగ రావేమే,
నా చెంతకు రావేమే
సొగసరి చూపుల చినవాడా!
గడసరి మాటల మొనగాడా
సరసాలాడే సరదాతీరే సమయం రానీరా
ఆ సమయం రానీరా!
చారెడు కళ్లకు కాటుకపెట్టి
దోసెడు మల్లెలు సిగలోచుట్టి
చిలకలాగ నువు కులుకుతుంటే,
ఒలికిపోకదే నా సొగసు
ఉలికిపడతదే నా మనసు! ॥మిస॥
కులుకును చూసి నువు ఉలికితివా?
తళుకు చూసి నువు మురిసితివా?
కులుకును మించిన తళుకును మించిన
వలపే దాచితిలేరా, అది కలకాలం నీదేరా! ॥మిస॥
ఏటిపొడ్డున ఇల్లు కట్టుకొని
నీటి అద్దమున నీడచూచుకొని
గువ్వలజంటగ నువ్వూనేను
కువకువలాడుతు వుందామా?
కొత్తరుచులు కనుగొందామా
కళ్లు కళ్లు కలిసిననాడే
మనసు మనసు తెలిసిననాడే
నీవు నేను ఒకటైనామని
కోవెల గంటలు పలికెనులే
దీవెనలై అవి నిలిచెనులే! ॥మిస॥







డబ్బులు కూడా అందరూ మింగేసి ఈయనకు హేండ్సప్ అన్నారు. దాంతో పాపం... మళ్లీ ఆయన ఉత్తరం రాశారు... "అమ్మా నేను చాలా కష్టాల్లో ఉన్నాను. మీరు హెల్ప్ చేసినా నేను నిలబెట్టుకోలేక పోయాను. ఎలాగా" అన్నారు. అప్పుడు నేనన్నాను... మాస్టారూ చిన్నప్పటి నుండీ మీ అమ్మాయిలాగా మీ దగ్గర నేను పెరిగాను. మీరు ఇక్కడకు వచ్చేయండి. నేను మిమ్మల్ని చూసుకుంటాను అన్నాను. పాపం ఆయనకు పిల్లలు లేరు. మా మాస్టర్ గారి మిసెస్ మల్లికాదేవి. ఆవిడని అక్కయ్యా అని పిలిచేవాళ్లం. ఆవిడ బాగా పాడేది. ఔట్ హౌస్ మంచిది ఇచ్చి నా దగ్గరే ఉంచుకున్నాను. 40 ఏళ్లు వాళ్లు నా దగ్గర ఉన్నారు.

తర్వాత మాస్టర్ గారు పోయారు. ఆవిడకు 85 సంవత్సరాలు. పరిమి అని తెనాలి దగ్గర విలేజ్‌లో ఇప్పుడు ఉంటున్నారావిడ. మా పిల్లలిద్దర్నీ ఆవిడే పెంచారు. అందుకే మా పిల్లలకు ఆవిడంటే ఇష్టం - నాకంటే కూడా! చాలా మంచి వాళ్లు. ఈ రోజుల్లో అంత మంచి వాళ్లని మనం చూడలేం. ఒక్క రోజు కూడా ఆవిడ తన లిమిట్స్ దాటి వెళ్లేదు కాదు ఆవిడ. బీరువా తాళాలతో సహా ఆవిడ దగ్గరే ఉండేవి. ఇప్పటికీ అదే సింప్లిసిటీ.

సరే అప్పటికి నాతో మా నాన్నగారు ఉన్నా కూడా నాతో కూడా ఓ లేడీ ఉండాలి కదాని ఆవిడను తీసుకు వెళ్లేదాన్ని. సరే ఊరికే ఎందుకు ఉండటం... హెయిర్ డ్రస్ అదీ నేనే చేస్తాను. అదేదో నాకు ఇప్పించ కూడదా అని ఆవిడ అన్నారు.

'పూలరంగడు' రెండు షెడ్యూల్స్‌కు ఆవిడ చేసింది. రోజుకు 35 రూపాయలు. మూడో షెడ్యూల్‌కు వచ్చిన తరువాత ఆ డబ్బులిప్పించమంటే ఆ ప్రొడక్షన్ మేనేజర్ ఇప్పించలేక పోయాడు. ఎప్పుడడిగినా ఇదిగో అదిగో అంటాడు. నాకు విసుగు పుట్టింది. ఇన్ని లక్షలు పెట్టి సినిమా తీస్తూ నా మేకప్‌మేన్‌ను వద్దన్నారు, హెయిర్ డ్రస్సర్‌కి కూడా డబ్బులిప్పించకపోతే ఎలా... సరే అని నెక్స్ట్ డే అక్కయ్యగారి చేతికి ఓ ప్లాస్టర్ చుట్టేసి రూమ్‌కు వెళ్లిపోయాను. మేకప్ అయిపోయింది. జుట్టు విరబోసుకుని కూర్చున్నాను. తరువాత మన మీద నింద ఉండకూడదని.. వాళ్ల అసిస్టెంట్‌ని పిలిచి... మీరు ఎవరినైనా పిలుచుకొండి. అక్కయ్యాగారు హెయిర్ డ్రెస్ చేయలేరు. ఆవిడ వేలు తెగిపోయింది అన్నాను. ఇక చూడండి బయలు దేరారు. అప్పట్లో ఇక్కడ ఎవరు ఉండేవారు? సరే తిరిగి తిరిగి ఓ బెంగాలీ లేడీని



పట్టుకొచ్చారు. ఆవిడేమో ఓ రూళ్ల కర్ర పట్టుకుని వచ్చింది. ఈ కర్ర ఎందుకు తల్లీ అంటే రింగులు చుట్టటానికీ అంది. కొప్పు పెట్టాలి అన్నాను. కొప్పంటే ఏమిటి అంటుంది ఆవిడ. ఆవిడకేమీ తెలీదు. నాటురకం కొప్పు ఆవిడకేమి తెలుస్తుంది. సరే ఓ 30 సార్లు పెట్టింది. 30 సార్లూ ఊడిపోయింది. అమ్మా దానికో పిన్ను పెట్టు అంటే పెట్టింది. కావాలంటే ఆ సినిమా వచ్చినప్పుడు చూడండి.. కొన్నిషాట్స్‌లో కొప్పు జారిపోయి ఉంటుంది. సెట్‌లోకి వెళ్లి రెండు షాట్స్ అవటం ఊడిపోవటం. వీళ్లు మళ్లీ కారు వేసుకుని ఆవిడ కోసం వెళ్లటం... ఇలా ఆ షెడ్యూల్ అంతా నానా తిప్పలు, దాని గురించి వెయిటింగ్... ఇలా అయిపోయింది.

ఇక కలర్ పాట. ఊటీలో షూటింగ్. అప్పుడు కూడా నేను చెప్పాను. మా అక్కయ్యగారు చేయరు. మీరే హెయిర్ డ్రస్సర్‌ను తెచ్చుకొండి అని. ఈవిడనే అక్కడకు తీసుకు వచ్చారు. అందులో కొంచెం మోడ్రన్‌గా ఉండాలని, పంజాబీ డ్రస్ వేసుకుని రోల్స్‌లా హెయిర్ వేలాడుతూ ఉంటుంది. న్యాయంగా అయితే అంత పొడుగు అవసరం లేదు. జోసెఫిన్ చేసేది. అక్కయ్య కూడా చేసేవారు. ఈవిడ రూళ్ల కర్ర పట్టుకు వచ్చి దానికి హెయిర్ చుట్టి స్ప్రే చేసి రెండు పిన్నులు పెట్టేది. ఆ షాట్‌లో తీస్తూనే బర్రున నా కర్లింగ్ హెయిర్ పొడుగ్గా వచ్చేది. ఇలా టైమ్ చాలా వేస్ట్ చేసుకున్నారు.

పిక్చర్ ఎండ్ వరకూ కూడా అక్కయ్య గారితో నేను ఏమీ చేయించుకోలేదు. వాళ్లకు వీళ్లిచ్చే డబ్బులే అవసరం లేదు. నేనే వాళ్లను తల్లీ తండ్రీలా చూసుకునేదాన్ని.

పిక్చర్ షూటింగ్ అయిపోయింది. సూపర్‌హిట్ అయింది. జమున ఈ సినిమాలో చాలా బాగుందనే మంచి పేరొచ్చింది.

ఈ సినిమా షూటింగ్ అయిపోయే రోజుల్లో మధుసూదనరావుగారికి చెప్పాను. సార్ మీకో విషయం చెప్పాలి. నేను లైఫ్‌లో కావాలని ఎవరికీ ఇలా చేయలేదు. కానీ ఇట్లా జరిగింది. ఇదంతా నేను కావాలని చేశాను. ఇంతవరకూ అక్కయ్యగారికి ఇవ్వవలసిన డబ్బు ఇవ్వలేదు. ఎవరినో ఊళ్లో వాళ్లను తీసుకువచ్చి హెయిర్ డ్రెస్సింగ్ చేతకాని ఆమె చేత నాకు చేయించారు కానీ మా అక్కయ్యగారికి మాత్రం డబ్బు ఇవ్వలేదు. అందుకే నేను ఇలా చేశానంటే ఆయన పకాపకా నవ్వేశారు. 'ఇంత ఏడిపించావా అమ్మాయ్ నువ్వు' అని అన్నారు. 'ఏడిపించటం కాదండీ, మీకు ఆ డబ్బు నథింగ్... మీరు ఇచ్చేస్తే వాళ్లు హ్యాపీగా ఫీలవుతారు కదా... ప్రొడక్షన్‌లో ఇలాంటివి జరుగుతూనే ఉంటాయని నేను మీకు చెప్పలేదు' అన్నాను.

దుక్కిపాటి గారంటే నాకు చాలా అభిమానం. చాలా సంవత్సరాలు ఆ బ్యానర్‌లో చేయకపోయినా ఇండస్ట్రీలో పెద్దవారు కాబట్టి ఆయనంటే అందరికీ అభిమానమే. డాక్టర్ మమత సీరియల్ తీస్తున్నప్పుడు ఆయన చేతనే క్లాప్ కొట్టించాను. ఏంటమ్మాయ్ నువ్వు సినిమా తీస్తున్నావా టీవీ సీరియల్ తీస్తున్నావా అని జోక్ కూడా చేశారు. ఈ గొడవలంతా ఎందుకని తరువాత కాలంలో ఇన్‌క్లూజివ్ రెమ్యూనరేషన్ అని మేకప్‌మెన్, హెయిర్‌డ్రస్సర్, టైలర్ వీళ్ల సాలరీలన్నీ కలిపి చెప్పటం మొదలుపెట్టాం.

ఓన్ టెక్నీషియన్స్ పేమెంట్ ఎప్పుడు పెట్టుకున్నామో అప్పటి నుండీ ఈ ప్రొడక్షన్ వాళ్లతో గొడవలు లేకుండా ఉన్నాయి. నేనే పేమెంట్స్ ఇచ్చేదాన్ని.

ఈ సినిమాలో ఇంకొక ముఖ్యమైన సంఘటన ఏమిటంటే.... ఫస్ట్ సీన్‌లో హీరోయిన్ గడ్డి మోపు తీసుకు వచ్చి చెఱువు గట్టు వద్దకు వచ్చి చేతులు, కాళ్లూ కడుక్కుంటూ ఉంటుంది. హీరో అవతలి గట్టు మీద ఉంటాడు. అక్కడేమైందంటే ఓ పెద్ద బండరాయి సగం నీళ్లలో ఉంది. ఇంకా షాట్ తీయట్లేదు. రాయికి నాచు ఉంటే జారతామని కాళ్లు పెట్టి ఇలా ఇలా రాస్తున్నా. నా వెనుకనే విశ్వనాథ్‌గారు ఉన్నారు. సీన్ నాకు చెప్తున్నారు. నేను కాలు ఇలా అనగానే జర్రున జారిపోయా. వెంటనే పాపం విశ్వనాథ్ గారు పట్టుకున్నారు. లేకపోతే ఆ నీళ్లలో పడిపోయేదాన్ని.

తర్వాత నాగేశ్వరరావు గారు ఈదుకుంటూ వచ్చి చెప్పారు. అక్కడ చాలా లోతుగా ఉందని! ఆయన మునిగి కూడా చూపించారు. అమ్మాయ్ నువ్వు పడుంటే పైకి వచ్చేదానివి కాదు. మా పిక్చర్ ఆగిపోయేదని జోక్ చేశారు కూడా. అక్కడ బాగా లోతుగా ఉంది. ఆ తరువాత ఆ సీన్ లోతు లేని చోట తీశారు. నాకేమో చిన్నప్పటి నుండీ నీళ్లంటే భయం. ఈత అసలు రాదు. ఊపిరి బిగపట్టడం అంత కంటే రాదు. ఇప్పుడంటే యోగా చేస్తాను కాబట్టి ఫర్వాలేదు. అదొక పెద్ద గండం లాంటిదే. విశ్వనాథ్ గారు నన్ను కాపాడారు. ఒకవేళ మునిగిపోక పోయినా దెబ్బ అయినా గట్టిగా తగిలేదే కదా. స్కేటింగ్ చేస్తూ జారినట్టు జారిపోయాను.

ఆ సినిమాలో మాకు ఉన్న నాలుగు పాటలు కాక విజయనిర్మల, శోభన్‌బాబు పాట.... చివురులు వేసిన కలలన్నీ పాట కూడా చాలా బావుంటుంది.

This serial is brought to you with best compliments from

**COLD FLAMES**

**CREATORS OF STAINED GLASS ART**







for details contact : **Ms. Sravanthi Juluri at 98491 03282**

or visit **www.coldflamesart.com**

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## రాజమండ్రి

నవంబరు 24 నాటి సమావేశంలో ఎప్పటికంటె ఎక్కువగా హాస్య-సంగీత ప్రియులు పాల్గొన్నారు. ఆర్.ఎస్.వెంకటేశ్వరరావు గజల్ పాటల విశేషాలను వివరించగా, అయ్యగారి వేంకట్రామయ్య పద్యాలను పరుగులెత్తిస్తూ హాస్య ప్రసంగం చేశారు. జిత్‌మోహన్‌మిత్ర ముకేష్ పాటలు పాడి వినిపించగా వాటిలోని మధుర భావాలను తెలుగులో వివరించారు ఖాదర్‌ఖాన్! వియస్ ప్రసాద్, సిహెచ్ బాపూజీ, యర్రాప్రగడ ప్రసాద్, బాబూరావు, వసంతా కళ్యాణ్, నర్యవద్మ కుమారి మధురమైన పాటలు పాడారు.



ముకేశ్ పాటలు పాడుతున్న జిత్‌మోహన్‌మిత్రా, తెలుగులో వివరిస్తున్న ఖాదర్‌ఖాన్

జోరాశర్మ 'రైలెక్కిన హైకూ'లతో, బేబి మాధురి, మాస్టర్ శ్రీతేజ, పద్మావతి ప్యారడీ పాటలతో సభను ఆకట్టుకోగా జియస్ మూర్తి, సర్వేశ్వరరావు, మంగశర్మ, సురేష్‌బాబు, వియస్ ప్రసాద్, ఖాదర్ ఖాన్, కృష్ణమాచార్యులు, ఫణినాగేశ్వరరావు, మాస్టర్ అషీష్, కాశ్యప్ జోకుల చెప్పి నవ్వించారు. సీత, పద్మ, శారద 'ఆదర్శ కోడళ్లు' స్కిట్, హనుమంతరావు, విజయలక్ష్మి 'గొంతెమ్మ కోర్కెలు' స్కిట్ సభారంజకంగా ప్రదర్శించారు. మిత్రా, ఎమ్.వి.అప్పారావు, రమాదేవి, విజయలక్ష్మి హాస్యసంభాషణలతో కరతాళధ్వను లందుకున్నారు.



హాస్యగుళిక ప్రదర్శిస్తున్న విజయలక్ష్మి, రమాదేవి

రాజమండ్రికి చెందిన సినీరచయిత పైడిపల్లి సత్యానంద్‌కు 'హాసం' క్లబ్ జన్మదిన శుభాకాంక్షలు తెలిపింది. రాజమండ్రి నుండి ప్రచురించబడిన 'నవ్వులు-పువ్వులు' పత్రిక ఆనాటి ఎడిటరు పతివాడ సూర్యనారాయణ చేతులమీదుగా జియస్ మూర్తి, వసంతా కళ్యాణ్ బహుమతులు అందుకున్నారు. సభ నిర్వహించిన హనుమంతరావు వచ్చే కార్యక్రమం డిశంబరు 19 సాయంత్రం విక్రమహాలులో జరుగుతుందని ప్రకటించారు.

## ఏలూరు

నవంబరు 21 సాయంత్రం జరిగిన కార్యక్రమానికి రికార్డు సంఖ్యలో హాజరయ్యారు. సుమారు 20 మంది జోక్స్‌తో, తక్కినవారు పాటలతో సభను రక్తి కట్టించారు. ఎమ్ మురళీ ప్యారడీపాట, 86 సం॥ల జక్కంశెట్టి శ్రీరామమూర్తి (రిటైర్డ్ ఎ.ఎస్.పి.) పాడిన 'పిబరే రామరసం' హైలైట్‌గా నిలిచాయి. ప్రప్రథమంగా హాజరయినవారికి లక్కీడిప్ తగిలే ఆనవాయితీ ఈసారి నిలబడింది. రిటైర్డ్ మేజిస్ట్రేట్ వైవి రాఘవయ్యగారు లక్కీ విజిటర్‌గా ఎన్నికయ్యారు. కోకా రామారావు మూడు ప్రైజులు, డా॥ బియస్ ప్రసాద్ ఒక ప్రైజు స్పాన్సర్ చేశారు. సభాసదుల్లో 30 మంది కొత్తవారే కావడం ఓ విశేషం!



జక్కంశెట్టి శ్రీరామమూర్తి నుండి బహుమతి అందుకుంటున్న వైవి రాఘవయ్య

### ఏలూరు వద్ద జోక్

భార్య - మన శాస్త్రి గారు చావుబతుకుల్లో కొట్టుమిట్టులాడుతున్నాట్టండీ!
భర్త - చేసినపాపం ఊరికే పోతుందీ!
భార్య-ఆయనేం పాపం చేశాడండీ బాబూ!?
భర్త- నీకూ, నాకూ పెళ్లి చేశాడు, అది చాలదూ!?

## పలాసా

నవంబరు 27 న డా॥రామినాయుడు నర్సింగ్‌హోమ్ ఆవరణలో జరిగిన 8 వ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా బంకుపల్లి రామప్రసాద్ విచ్చేశారు. మోహనరాగంలో 'వక్రతుండ మహాకాయ' అనే గణపతి ప్రార్థన, కుమారి మేఘన 'భారతమాతకు జేజేలు' కె.సతీష్ పేరడీ కవిత శోభారాణి, 'మల్లెతీగ వంటిది మగువ జీవితం' ఉమాపతి బెహరా 'ఎక్కడో దూరాన కూర్చున్నావు' పాటలు విశేషంగా ఆకట్టుకున్నాయి. పడాల జోగులు శివస్తుతి అద్భుతంగా గానం చేశారు. మిమిక్రీ రమేష్ 'కడవెత్తు కొచ్చింది కన్నెపిల్ల' ఈలపాట పాడుతూ స్వంతంగా డోలక్ వాయించడం సభను ఆశ్చర్యంలో ముంచెత్తింది. డా॥శాస్త్రి 'అదివో అల్లదివో' ఈలపాట వన్స్‌మోర్ అనిపించింది. జోక్స్ చెప్పి రంజింపజేసినవారిలో ఉమాపతి బెహరా, రమణమూర్తి, రామారావు, విశ్వేశ్వరరావు, కోటేశ్వరరావు ఉన్నారు. పడాల జోగులు, శోభారాణి, మేఘన బహుమతులు గెల్చుకున్నారు. వచ్చే కార్యక్రమం డిసెంబరు 25 సాయంత్రం!

రాజమండ్రి వద్ద స్కిట్

# గొంతెమ్మ కోరికలు

భార్య - (పాట పాడుతూ) అందేనా - నా చేతుల కందేనా
అందరాని చందమామ

భర్త - (విసుక్కుంటూ) ఇదిగో నీ పాట కర్థం తెలిసిందిలే గానీ ఇక ఆపు. హోమ్ థియేటరన్నావ్.., కొన్నాను. డబుల్‌డోర్ ఫ్రిజ్ అన్నావు.., కొన్నాను. ఫర్నిచరన్నావ్..., కొన్నాను. ఇవన్నీ పెట్టడానికి పెద్ద బంగళా కొనమంటున్నావ్. కుదరదంటే ఇలా శ్లేషలో పాటలొకటి! బంగళా చేతులకే కాదు, చూపులకు కూడా అందదు. దాని విషయం మర్చిపో.



భార్య- ఈ ముక్క ఫర్నిచర్ కొనక ముందు చెప్పాలి. ఇంత ఫర్నీచరూ కొని, అది పెట్టుకోవడానికి బంగళా లేకపోతే ఎలా?

భర్త-బంగళా ముక్క ఫర్నిచర్ కొనమనడానికి ముందు చెప్పాలి. చూస్తూంటే నీ గొంతెమ్మ కోర్కెలకు అంతు లేకుండా ఉంది. ఏ అడవికో పోయి గెడ్డాలు మీసాలు పెంచుకుని శుభ్రంగా తపస్సు చేసుకుంటూ కూర్చుంటాను. అదే బెటరు!

భా- (బెంగ నటిస్తూ) నిజంగానా!

భ- (రెచ్చిపోయి) ఖచ్చితంగా! మధ్యలో రంభా, ఊర్వశీ, తిలోత్తమా వచ్చినా సరే, తపస్సు ఆపేది లేదు. ఏకథాటీగా తపస్సు చేసేయడమే - పైపెచ్చు ఇంకా ఉధృతం చేసేస్తాను.

భా - వాళ్ల మొహం కేసైనా చూడరా?

భ- చూడను. నా తడాఖా నీకు తెలియదా? తలచుకుంటే...

భా-అంటే వాళ్లను నిర్వికారంగా అలా, అలా చూసి, చలించకుండా ఊరుకుంటారన్నమాట!

భ-అంతే కదా, జస్ట్ అలా, అలా..

భా-అయితే మీకు భగవంతుడు ప్రత్యక్షం అవడం ఖాయం!

భ- అవక ఛస్తాడా?

భా-అయ్యాక.. వైరాడిలాగ మోక్షం కావాలి, జన్మరాహిత్యం కావాలి వంటి పిచ్చిపిచ్చి కోరికలు కోరకండి.

భ-అవి కాకపోతే ఇంకేం కోరతాం?

భా-అలా అడగండి చెప్తాను - రంభావాళ్లూ వచ్చినపుడు మీరు మొహం కేసి చూడకుండా వాళ్ల బట్టలు, నగలు కేసి అలా, అలా చూసివుంటారు కదా..

భ -(అయోమయంగా) ..అలా.. అలా.. చూస్తే!?

భా-అలా అబ్జర్వ్ చేసినవి జాగ్రత్తగా గుర్తు పెట్టుకుని రంభ, ఊర్వశీ, తిలోత్తమల్లో ఎవరి మోడల్ బాగుందో చూసి ఆ సెట్టు ఏడువారాల నగల్లా - ఏడుసెట్లు చేయించి ఇమ్మనండి.

భ-ఎవరికి?

భా-నాకే! కొత్త బంగళాలో - కొత్త ఫర్నిచర్ మధ్య - కొత్త నగలసెట్‌తో..(ఊహాలోకంలో విహరిస్తూ)

భ- (చటుక్కున అందుకుని).. పాత భార్యతో - అదిరిందయ్యా చంద్రం - అంటాడు దేవుడు!

భా-(ఏడుపు మొహం పెట్టి) దేవుడేమీ అనడు! మీ వరస చూస్తూంటే తపస్సు ప్రోగ్రాం ఎగ్గొట్టేట్టున్నారు.

భ-చాల్లే నీ గొంతెమ్మ కోర్కెలూ నువ్వూనూ.. (తిట్టి వెళ్లిపోతాడు)

భా-(ఏడుస్తూ పాట పాడుతుంది) నీ ఆశా.. అడియాసా.. చేజారె మణిపూస (మణి అభినయించి చూపుతుంది)

**- డి.వి.హనుమంతరావు**

## హైదరాబాద్

ఆంధ్ర బాలానంద సంఘం ఆవరణలో శనివారం (27.11.2004) సాయంత్రం జరిగిన 'హాసం క్లబ్ కార్యక్రమం ఎప్పటిలాగానే గీతాలాపనల మధ్య, చతురోక్తుల మధ్య సందడిగా జరిగింది. సుమారు 25 మంది పాటలతో, ప్యారడీ సాంగ్స్‌తో, స్కిట్స్‌తో, మిమిక్రీలతో సభను అలరించారు. సుజయ పాడిన లలిత గీతం, రవి 'పాప్ సంగీత మిమిక్రీ' హైలైట్ గా నిలిచాయి.

'భక్త కుచేల'లో 'తెలియగ తరమా' అనే రఘురామయ్య పాటను, దానికి స్ఫూర్తినిచ్చిన 'రామరాజ్య'లోని 'మురళీ కే' పాటను పాడి వినిపించారు కోకా రామారావు. అలాగే 'మహేశా పాప వినాశా' పాటకు మూలగీతం 'శివప్పా' అనే కన్నడ గీతాన్ని వినిపించారు రజని. పద్మావతి 'జబ్ దీప్ జలే ఆనా' తో ఆకట్టుకున్నారు.

పిల్లలు, స్త్రీలు అధిక సంఖ్యలో పాల్గొన్న ఈ సభను కన్వీనర్ యస్.వి.రామారావు తన సమయోచిత వ్యాఖ్యానంతో రక్తి కట్టించారు.



'హాసం క్లబ్' ప్రారంభించదలచినవారు సంప్రదించవలసినది
శ్రీ ఎస్.వి.రామారావు, 040-24160279, 98491 39030



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...

పిల్లల కోసం ప్రత్యేకం...

బాల్యపు లేతదనం మళ్ళీ కోరుకునే పెద్దలకు మరీ మరీ ప్రత్యేకం



# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
**ఎమ్బీయస్ ప్రసాద్**

2వ భాగం

**చిత్ర పరిచయం 8**

సమన్వయం
**మంజీర**

(**జరిగిన కథ** - ఆంబోతు అనే జంతువుల అండర్‌వరల్డ్ డాన్ కోరిక మేరకు డా॥ జాన్ డూలిటిల్ ఓ అడవిని సంరక్షించే కార్యక్రమం చేపడతాడు. ఎవా అనే అరుదైన వన్యజాతికి చెందిన ఆడభల్లూకం ఒకటి అడివిలో ఉందని, దాన్ని సర్కస్‌లో పెరిగిన ఆర్చీ అనే మగభల్లూకంతో జత కలిపితే విచక్షణారహితంగా అడివిని నాశనం చేసే కంట్రాక్టర్లకు ప్రభుత్వం అడ్డు వేస్తుందని తెలుస్తుంది జాన్‌కి. కోర్టునుండి ఒక నెల గడువు తీసుకుని జాన్, ఆర్చీని ఎవా వద్దకు తీసుకెళతాడు. కానీ సర్కస్‌లో పెరిగిన ఆర్చీని చూసి, ప్రకృతి ఒడిలో పెరిగిన ఎవా ఆకర్షింపబడదు. వనవరినరాలకు అనుగుణంగా ఆర్చీని మార్చే పని మొదలుపెడతాడు జాన్ - ఇక చదవండి)

**ఈ** తతంగమంతా కిటికీలోంచి గమనిస్తున్న లీసా "మీ శిష్యుడి శిక్షణా కార్యక్రమం ఎలా సాగుతోంది?" అనడిగింది జాన్‌ని.

జరిగేదంతా చెబితే నవ్వులపాలవడం ఖాయమని తెలిసిన జాన్ లేని ఉత్సాహాన్ని తెచ్చిపెట్టుకుని "ఓ, బ్రహ్మాండంగా నడుస్తోంది. మూడు వారాల గడువు కూడా అక్కర్లేదు. చూడు అప్పుడే ద్రాక్షపళ్లు ఎంత చక్కగా కోస్తోందో!" అన్నాడు.

ఇల్లరికం అల్లుడిలా ఇంట తిష్టవేసిన ఎరిక్ నోరు ఊరుకోలేదు. "కోయడం ఏమిటి? ద్రాక్షపళ్లకు దూరంగా పారిపోతూంటేనూ" అన్నాడు ఆశ్చర్యంగా.



జాన్‌కు ఒళ్లు మండిపోయింది. "నీకు తెలియకపోతే నన్నేం చేయమంటావ్? అది పారిపోవడం లేదు. ద్రాక్షపళ్ల చుట్టూ ప్రదక్షిణం చేసి చూస్తోంది. ఏ వైపునుండి అందుకోవడం ఈజీయా అని స్టడీ చేస్తోంది." అన్నాడు.

"అంత స్టడీ చేయాల్సిన అవసరమేముంది? అవేమైనా డేంజరస్ వెరైటీ ద్రాక్షయా?"

ఎరిక్‌వైపు జాన్ ఓ చూపు విసిరాడు. "అవి మనుష్యుల్లాంటివి కావు, ఎరిక్. ద్రాక్షపళ్లల్లో డేంజరస్ వెరయిటీ లేదు. ఆ కళలన్నీ మనుష్యులకే వచ్చు!" అన్నాడు పళ్లు గిట్టకరచి.



అక్కడ ఆర్చీ "ద్రాక్షపళ్లు ఎక్కడరా బాబూ! కనబడి చావటం లేదు" అంటోంది. దాని మాటలు తక్కినవాళ్లకు అర్థం కావు కదాన్న ధీమాతో జాన్, "చూశారా, వి ఆర్ రైట్ ఆన్ షెడ్యూల్" అని గొప్పలు పోయాడు. అతనా మాటలు అనడం పూర్తయిందో లేదో, ఆర్చీ దభాలున గోతిలోని చెక్కపెట్లో పడింది.

పట్టువదలని విక్రమార్కుడిలా జాన్ మర్నాడు ఆర్చీని తీసుకుని ఓ గుహ ఎదుట ప్రత్యక్షమయ్యాడు. ఎలుగుబంట్లు శీతాకాలంలో ఆర్నెల్లపాటు గుహలో పడి నిద్రపోతాయని, అది ప్రాక్టీసు చేయాలనీ జాన్ అప్పటికే చెప్పి వున్నాడు కానీ ఆర్చీకి అదేమీ బుర్ర కెక్కలేదు. ఇప్పుడు గుహ లోపలకు తొంగిచూసి ఆర్చీ నిర్ఘాంత పోయింది - "ఏమిటేమిటీ, మళ్లీ చెప్పు - నేను ఈ దరిద్రపు గుహలోకి వెళ్లి ఓ రోజు కాదు, రెండ్రోజులు కాదు, ఏకంగా ఆర్నెల్లపాటు నిద్రపోవాలా? బాబోయ్!"



"కరక్ట్. బాగా అర్థం చేసుకున్నావ్! ఎలుగుబంట్లన్నీ చేసే పనే అది! దాన్ని హైబర్నేషన్

అంటారు."

"అదేం మాటో కానీ డిప్రెషన్‌లా వినబడుతోంది నాకు." అంది ఆర్చీ విరసంగా. అంతలోనే ఓ ఆలోచన వచ్చింది. "అవునుగానీ, మరి ఇన్నాళ్లూ నా తిండి మాటేమిటి!?"

"తిండి అంటే.. నువ్వు పెద్దగా తినక్కరలేదు. మామూలుగా ఎలుగుబంట్లు ఏం చేస్తాయంటే, వేసవికాలంలోనే బాగా తినేస్తాయి. శీతాకాలానికి కూడా ఆ తిండి సరిపోతుంది."

"లోపలికి పోయేదాని గురించి చెప్పావ్. సరే, మరి ఒంట్లోంచి బయటకు పోయేది ఎలా పోతుంది?"

"బాత్‌రూమ్‌కి పోయే పనే ఉండదులే!"

ఆర్చీ ఆ మాట నమ్మలేదు. "జోకా!?" అని అడిగింది.

"అబ్బే సీరియస్‌గానే చెబుతున్నా! హైబర్నేషన్‌కి వెళ్లబోయేందుకు ఓ వారం ముందునుంచీ ఎలుగుబంట్లు ఏం చేస్తాయంటే.. మట్టి, నాచు, వెంట్రుకలు, గడ్డి ఇవన్నీ తింటాయన్నమాట! అందువల్ల ఆ ఆర్నెల్లూ ఇక ఏ బాధా ఉండదు.



కానీ దాని వల్ల ఓ సుఖం ఉంటుంది. ఒళ్లెరక్కుండా ఆర్నెల్లపాటు పడుక్కోవచ్చు. శీతాకాలపు చలి నిన్నేమీ చేయలేదు."

ఆర్చీ ఒక్క అరుపు అరిచింది - "ఆగు మిస్టర్, ఆర్నెల్లపాటు నేను నిద్రపోవాలా? ఆ మాటే ఖరారయితే - గుడ్‌బై! నువ్వు మీ ఇంటికి, నేను పట్నానికి.." అంటూ ఆర్చీ హైవే దారి పట్టింది.

"హేయ్, అలా ఎలా వెళ్లిపోతావ్. అయినా నువ్వు వెళదామనుకున్నా ఎలా వెళ్లగలుగుతావ్?" అని కంగారుపడ్డాడు జాన్ ఆర్చీ వెంటబడుతూ.

ఆర్చీ మొండిపట్టు పట్టింది. "ఎలాగోలా వెళతాను. ఎవర్నైనా లిఫ్ట్ అడుగుతాను."

"లిఫ్ట్ లడిగే భల్లూకాలను ఎవరూ ఎక్కించుకోరు. హడిలిపోయి పారిపోతారు."

"కావలిస్తే పెట్రోలు ఖర్చు సగం పెట్టుకుంటాను. బంక్‌లో డాన్సు చేసి వచ్చిన డబ్బంతా తీసుకోమంటాను. చోటు లేదంటే పిల్లలతో బాటు వెనకసీటులో కూచుంటా."



జాన్ వినుక్కున్నాడు. "ఈ వాగుడు ఆపుతావా, ఆర్చీ" అని.

"సారీ డాక్టర్, కానీ నన్నొదిలిపెట్టు. ఇదేమీ నడిచే వ్యవహారం కాదు. నీ ఈత నేర్పడం కాదు కానీ, కాస్త ఉంటే మునిగిపోయేవాణ్ని. ఆ ఎవాకు నేను రవ్వంతైనా నచ్చలేదు. ఇక మేం కలిసి కాపురం చేయడం జరిగేపనేనా..?" అని వాదించబోయింది ఆర్చీ.

"నువ్వు, నీ ఫిర్యాదులూ వినివిని విసిగిపోయాను. ఇదిగో ఈ చెట్టు చూడు. పైన కొమ్మల్లో పక్షులు గూడు కట్టుకున్నాయి. కింద తొఱ్ఱలో ఉడతలు కాపురముంటున్నాయి. కింద కుందేళ్లు నివసిస్తున్నాయి. నువ్వు కాస్త సర్దుకుంటే, కాస్త అడ్జస్ట్ అయితే వీటన్నిటికీ ఇళ్లు మిగులుతాయి. లేదా వాళ్ల కొంపలు కూలిపోతాయి. తమ జీవితాధారం కోసం ఇవన్నీ నీపై ఆధారపడివున్నాయి. వీటన్నిటినీ అనాధలను చేస్తావా? కొంపా గోడూ లేకుండా చేస్తావా? ప్రతి మనిషికీ గుండెలో లోపలమనిషి ఉంటాడు, మంచీ చెడూ చెప్తాడు. అంతరాత్మ అంటాం, మరోటంటాం. అలాగే భల్లూకాలకూ మనసులో అంతర్ భల్లూకాలుంటాయి. నీ అంతర్‌భల్లూకాన్ని అడిగి చూడు. ఈ జంతువుల గతి గురించి ఏమంటుందో! అది ఏం చెబితే అది చెయ్యి."

జాన్ మాట మన్నించి ఆర్చీ ఓ చెట్టు చాటుకు వెళ్లింది. కాస్సేపటికి వెనక్కి తిరిగివచ్చి "అంతర్‌భల్లూకాన్ని అడిగాను. కుదరదంటోంది." అంది.

"సరే, నీ యిష్టం. కానీ ఇల్లూ వాకిలీ లేని జంతువులు ఎలా ఉంటాయో చూపిస్తాను రా." అంటూ జాన్ ఆర్చీని ఓ చోటికి తీసుకెళ్లాడు. జంతువులమీద ప్రయోగాలు చేసే పరిశోధనాలయం అది. ప్రయోగాలకోసమని వాటిని బోన్లలో పెట్టి వుంచుతారు. అక్కడి వాతావరణమంతా చీకటి చీకటిగా, నిరాశానిస్పృహలతో నిండి వున్నట్టు ఉంది. చూస్తూనే ఆర్చీ బెంబేలెత్తిపోయింది. "ఇక్కడకు రావలసిన అవసరం ఉందంటావా, డాక్టర్?" అని అడిగింది దీనంగా.



"నీకు విషయాలు తెలియాలి కదా, కమాన్" అంటూ ఎలుగుబంట్ల బోను వద్దకు నడిపించాడు. ఆ బోనులో రెండు ఎలుగుబంట్లు ఉన్నాయి. ఆర్చీని చూస్తూనే వెక్కిరింతగా, "ఏమిటి నాయనా? బయటగాలి పడలేదా? ఇక్కడికి వచ్చిపడ్డావ్!?" అందో భల్లూకం.

జాన్ తలుపు తీసి "లోపలికి వెళ్లు, నీతో ఏదో మాట్లాడతాయిట." అంటూ ఆర్చీని లోపలికి నెట్టబోయాడు.



"ఎ..ఎ...ఎక్కడికి? ఎ..ఎందుకు?" అంది ఆర్చీ బెదిరిపోతూ.

"నీలాటివే రెండు భల్లూకాలున్నాయి. నీతో మాట్లాడుతాయట. వెళ్లు."

"వ..వద్దులే. కావాలంటే కాస్సేపు ఓ మూల కూచుంటాను."

'ఏదో ఒకటి చెయ్యి' అంటూ జాన్ తలుపు తీసి ఆర్చీని లోపలకు నెట్టి తలుపు మూసేశాడు. అంతలో అతని సెల్‌ఫోన్ మోగింది. ఆ గుహలాటి చోట సిగ్నల్ వచ్చేట్టు లేదు కాబట్టి సెల్ చేతబట్టి బయటకు నడిచాడు.

జాన్ వెళ్లగానే భల్లూకాలు ఆర్చీని ఆటపట్టించసాగాయి. "ఏమిటి బుచ్చిబాబూ? అడివిగాలికి రొంప జేసిందా? పాపం! అవునూ, చేపలు పట్టరా అంటే నీళ్లు తాగేసావట!" అందొక ఎలుగుబంటి.

"ఖర్మ, ఈ చీకటిగుయ్యారంలోంచి బయటపడితే చాలురా అని మనం చూస్తూంటే ఈ పెద్దమనిషి ఇక్కడకు వస్తాడట!" అంది రెండోది.

ఆర్చీకి కంగారు పుట్టింది. "ఇదిగో డాక్టర్, రావా! వీళ్లను చూడు నన్నెలా ఏడిపిస్తున్నారో" అంటూ బిక్కమొహం వేసింది.

"ఓహో వీడికి మాటలు కూడా వచ్చన్నమాట!" అంటూ ఎకసెక్కమాడింది మొదటి భల్లూకం.

"ఉండు, మనవాడికి కొన్ని పాఠాలు నేర్పాలి. ముఖ్యంగా భల్లూకపట్టు అంటే ఏమిటో చూపిస్తా, రా" అంటూ దగ్గరకి రాబోయింది రెండోది.

బయట జాన్ ఇంటికి ఫోన్ చేస్తున్నాడు. తనకు ఫోన్ వచ్చిన విషయం చెపుతూంటే "ఇంతకీ మీ నాజూకు హీరో ఏమంటున్నాడు?" అని అడిగింది లీసా.

"తీసుకెళ్లి భల్లూకాల బోనులో పడేశాను. రియల్ టఫ్ బేర్స్ అన్నమాట. అయిదునిమిషాల్లో ఆర్చీ ఆడారితనం పోగొడతాయి చూడు..."



అని జాన్ అంటూండగానే ఎవరో చిటికలు వేస్తూ పాటపాడడం వినబడింది. ఆర్చీ తెలివితేటలనం తక్కువగా అంచనా వేశాడు జాన్. ఐదునిమిషాల్లో ఏం మంత్రం వేసిందో కానీ అక్కడున్న భల్లూకాలు రెండూ ఆర్చీ చెప్పినట్టు ఆడుతున్నాయి, పాడుతున్నాయి. "అబ్బే, పాట పాడి ఊరుకుంటే కుదరదు, చిటికలు వేస్తూ కాళ్లాడించాలి. ఇంకా కాస్త గట్టిగా పాడాలి." అంటూ సర్కస్‌లో తను నేర్చుకున్నది వీళ్లకు నేర్పిస్తోంది ఆర్చీ. గోల విని లోపలకి తొంగిచూసిన జాన్ "తర్వాత మాట్లాడతానులే" అని సెల్ ఆఫ్ చేసేశాడు.

పిల్లి దగ్గర్లో లేకపోతే ఎలుకలు ఊరుకుంటాయా? యువజంట ఎరిక్, షెరెజ్ ఎవరికంటా పడకుండా అడివిన పడ్డారు. ఎవరి కంటా అనడం తప్పు. జాన్ ఆదేశం మేరకు జంతుగూఢచారి దళం వారిని వెంటాడుతోంది.



పాపం ఎరిక్‌కి ఇదేమీ తెలియదు కదా, 'నువ్వు కళ్లు మూసుకుని నేను చెప్పినచోటకు వస్తే నీకో సర్‌ప్రైజ్' అంటూ షెరెజ్‌ను నడిపించుకుని వచ్చాడు. షెరెజ్ అతని మాట కాదనకుండా కళ్లు మూసుకుని నడుస్తూ వచ్చింది. ఓ చోటకు వచ్చాక "ఇక్కడ ఆగి కళ్లు తెరు." అన్నాడు ఎరిక్.

కళ్లు తెరిచి చూసిన షెరెజ్‌కు నేలమీద పరిచిన తివాచీమీద బోల్డు తిండి సరంజామా కనబడింది. "ఇవన్నీ నువ్వే ఏర్పాటు చేశావా? హౌ లవ్లీ!" అంటూ ఆశ్చర్యానందాలతో అడిగింది.



"నీకోసం ఈ పాటి చేయలేనా? నా ప్రాణమే ఇవ్వడానికి సిద్ధంగా ఉంటే.." అన్నాడు ఎరిక్.

గూఢచారిదళానికి నాయకత్వం వహిస్తున్న ఉడత "ఖచ్చితంగా వీడు ఏదో చేసేసేట్టే ఉన్నాడు." అని డిక్లేర్ చేసింది.

ఈలోగా ఎరిక్ చదువుతున్నాడు - 'చూశావా, కోక్, చీజ్, చిప్స్..'

మాయా పెంచుతున్న ఊసరవెల్లిని గూఢచారిదళం ఓ పాత డబ్బాలో దాచి ఆ తివాచీ దగ్గరే పెట్టింది. పరిసరాలకు తగ్గట్టుగా రంగుమార్చడంలో నేర్పరి కాబట్టి ఊసరవెల్లిని వాళ్లకు అతి దగ్గరగా ఉండమన్నారు. అయితే చిప్స్ మాట వినగానే దానికి నోరూరింది. తలకాయ బయటపెట్టి, "చిప్సా!?" అని అరిచింది ఆశగా, ఆబగా.

వెంటనే ఉడుత "చుప్, నీ హడావుడి కాదు కానీ, మా అందరినీ బయటపెట్టేసేట్టున్నావు. నీ కలర్, డబ్బా కలర్‌తో సరిగా మ్యాచ్ కావటం లేదు. చూసుకో!" అంది.

కానీ యువప్రేమికుడు ఇవేమీ పట్టించుకోవటం లేదు. "షెరెజ్, వీటన్నిటినీ మించి నేను నీ కొకటి ఇద్దామనుకుంటున్నాను. అసలు నేనిక్కడకు వచ్చీ రాగానే ఇద్దామనుకున్నాను. కానీ కుదరలేదు.."

"..ఏమిటది.. చెప్పవా?" అంది షెరెజ్ గోముగా.

ఈ వరసచూసి గూఢచారిదళం ఎలర్ట్ అయిపోయింది. తమ డాక్టరుగారమ్మాయి శీలం కాపాడడానికి సమకట్టింది.

ఎరిక్ తన పెదాలను షెరెజ్ పెదాలవైపు సారిస్తూండగానే గూఢచారిదళంలోని తాగుబోతు కోతి కొమ్మపట్టుకుని వేళ్లాడుతూ మధ్యలో వచ్చేసింది.



ఎరిక్ పెదాలను తనే అందుకుని ముద్దు పెట్టేసుకుంది. కళ్లు తెరిచి చూసిన జంట తెల్లబోయింది. కోతిముద్దు రుచి చూసిన ఎరిక్ 'యాక్, ఛీ, ఛీ' అంటూ పక్కకు తిరిగి ఉమ్మేశాడు. కానీ వానరానికి ఇటువంటి అభ్యంతరాలు లేనట్టుంది. "నన్ను ముద్దెట్టుకున్నాడోచ్" అంటూ అరుస్తూ కుప్పిగంతు లేసింది. భయపడిపోయిన ప్రేమికుల జంట అక్కణ్నుంచి పారిపోయింది. 'మన ఆపరేషన్ సక్సెస్. పార్టీ ఖర్చు నాది' అని ప్రకటించింది ముంగిస!


*This serial is sponsored by*

**BOPPANA GANGADHARA CHOWDHARY**

**BOPPANA CIVIL CONSTRUCTIONS**

**HYDERABAD**

☎ : 2360 8131/ 2360 8081



అవాళ రాత్రి జాన్ తన కాటేజీ కిటికీలోంచి బయటకు తొంగి చూసేటప్పటికి లక్కీ ప్రేమాయణం కనబడింది. అడివికి వచ్చీరాగానే పరిచయమయిన ఆడతోడేలు మీద ఆశపెట్టుకున్న లక్కీ తన డిన్నరంతా దానికి ఆఫర్ చేసింది. మారుమాట లేకుండా తోడేలు గబగబా తినేస్తుంటే చూసి గాభరా పడింది. 'దాన్లో కాస్త నాక్కూడా వదిలిపెడతావా?.. అసలు కరక్టుగా చెప్పాలంటే మొత్తం నాదే కదా!" అని అనిచూసింది. జవాబుగా తోడేలు ఎప్పటిలాగానే పళ్లు బయటపెట్టి గుర్రుమంది. దాంతో కంగు తిన్న లక్కీ "అబ్బే, ఓ మాట అని చూశా.." అని నీళ్లు నమిలింది.

ఈ వరసంతా చూసిన జాన్‌కి ఒళ్లు మండిపోయింది. "ఏవిటీ గోల?" అని అరిచాడు. లక్కీ వెనక్కి తిరిగి, "ఏం చేయమంటావ్? అడివిలో వేరెవరు దొరుకుతారు?" అని తిరిగి అరిచింది. "ఎవరూ దొరక్కపోతే మాత్రం.." అంటూ కిటికీలోంచి బయటకు ఉరికి, "ముందు నువ్వు ఫో" అంటూ తోడేల్ని తరిమేశాడు జాన్.

ఆర్చీ కూడా అక్కడే ఉంది. ఆర్చీని, లక్కీని చూసి జాన్ ఓ చిన్న ఉపదేశం ఇద్దామనుకున్నాడు. "అసలు మీ ఇద్దరూ మగాళ్లేనా? ఆడవాళ్లను ఆకర్షించడం రాకుండా ఉంది మీకు. ఆడవాళ్లు ఇష్టపడే అసలు, సిసలు మగాడిని ఆల్ఫా మేల్ అంటారు తెలుసా. అంటే స్ట్రాంగ్‌గా, కరుగ్గా ఉండాలన్నమాట!.."

"పెర్సనాలిటీ ఉంటే సరిపోదా?" ఆశగా అడిగింది ఆర్చీ.

"నాకు అదీ లేదు. బ్రహ్మచారిగానే జీవితం కడతేరేట్టుంది." అని నిట్టూర్చింది లక్కీ.

"మీ గోల ఆపండి. అసలు ఆల్ఫా మేల్ అంటే ఏవిటో అది నేర్చుకోండి ముందు. బిగ్‌బాస్ వుంటాడతను... తను బిగ్‌బాస్ అని అందరికీ తెలిసేట్టు ప్రవర్తిస్తాడు. మగజాతి మొత్తానికి నేనే బిగ్‌బాస్ అన్నట్టు నడుస్తాడు. అంటే.. ఇలా అన్నమాట.. కమాన్.., మీరు కూడా ఆల్ఫా మేల్‌లా నడవండి."



జాన్ బోర విరుచుకుని నడవసాగాడు. వెనక్కాలే అదే స్టయిల్లో జాన్ ని అనుకరిస్తూ ఆర్చీ, లక్కీ కూడా నడవసాగాయి. "వాక్..వాక్... వాక్ లైక్ ఆల్ఫా మేల్.." అని నినాదం ఇచ్చాడు జాన్. అవి కూడా అదే నినాదం ఇచ్చాయి.

"గుడ్, వాకింగ్ అయిపోయింది. ఇప్పుడు టాకింగ్ కూడా ఆల్ఫా మేల్ లాగానే ఉండాలి. టాకింగ్ ఎలా ఉండాలి..? ఆల్ఫా మేల్‌లా..! అంటే దర్పంగా, అధికారయుతంగా ఉండాలి. ఎవ్వరూ ఎదురాడలేని విధంగా, ఎవరితోనూ రాజీపడని విధంగా, ఎవ్వరినీ ఖాతరు చేయని విధంగా.." ఇలా జాన్ మగజాతి గొప్పతనాన్ని వర్ణిస్తూ పోతూండగా అతని ఉపన్యాసానికి అంతరాయం కలిగింది.

"ఇదిగో, ఆ చెత్తడబ్బా బయటపడేయమని చెప్పానా? లేదా?" అంటూ లీసా లోపటినుండి ఒక్క పొలికేక పెట్టింది.



కానీ ఆల్ఫామేల్ పాత్ర ధరిస్తున్న జాన్‌కి ఆ డైలాగు ఎవరిదో అనుకున్నాడులాగుంది. "గాడిదగుడ్డు కాదూ, కావాలంటే నువ్వే పడేసుకోవే" అని పెడబొబ్బ పెట్టాడు.

"ఏవంటున్నారూ?" అని ఒక్క అరుపు అరిచింది లీసా.

దెబ్బకి జాన్‌కి మత్తు దిగిపోయింది. ఆల్ఫా మేల్ భూతం పరిగెత్తి పారిపోయింది. అప్పటిదాకా వల్లించిన ఉపదేశాలు గాలి కెగిరిపోయాయి. గట్టిమగాడు వట్టిమగాడు అయిపోయాడు. "ఎ..ఎబ్బే.. ఇవి ఏదో అడుగుతేనూ.. వాటికి చెబుతున్నా. నువ్వేమన్నావో సరిగా వినబడలేదు." అన్నాడు నీళ్లు నములుతూ.



"ఎంతసేపు చూసినా పశువుల్నేసుకు తిరగడం తప్ప వేరే పనేమీ కనబడటం లేదు. ఆకలేసి ఛస్తున్నాం. తినడానికేమైనా పట్టుకురమ్మనమని చెప్పానా? లేదా? అవన్నీ మర్చిపోయి, కుక్కలకీ, నక్కలకీ పెళ్లి చేసే పని పెట్టుకున్నారు..." అంటూ దులిపిపారేసింది లీసా.

"అదే..అదే.. ఇదిగో.. ఇప్పుడే తెచ్చేస్తా.." అంటూ బయటకు పరుగులు పెట్టబోయాడు జాన్.

"ఆల్ఫా మేల్ లక్షణాల్లో ఇది కూడా ఉందా, డాక్టర్?" అని అడిగింది లక్కీ.

"ఛీ, నోర్మూయ్.." అన్నాడు జాన్ విసురుగా.



వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్తున్న లీసా ఛట్టున ఆగిపోయింది. "ఎవర్నీ, నోర్మూయ్ అంటున్నది.." అని ఒక్క అరుపు అరిచింది.

"అబ్బే, నిన్ను కాదు.., ఈ కుక్కపీనుగని. నిన్నంత మాట అంటానా? భలేదానివి." అన్నాడు జాన్ తెచ్చిపెట్టుకున్న చిరునవ్వు చిందిస్తూ.

(సశేషం)

**(ఈ కథ ఇక్కడితో ముగియలేదు. డూలిటిల్ చేపట్టిన పని అంత సులభమైనదీ కాదు, అంత త్వరగా ముగిసేదీ కాదు. ఆంబోతు కోరికమేరకు అడివిని రక్షించడంలో డూలిటిల్ విజయం సాధిస్తాడా? లేదా? ఊహించండి. డూలిటిల్ 1,2 భాగాల మొత్తం కథను 'హాసం బుక్స్'లో తెచ్చే ప్రయత్నం చేస్తాం. అప్పటిదాకా వేచి చూడమని ప్రార్థన.)**




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## ఐనా హిట్టే!

సంఘం సంస్కారాన్ని మూలకథగా పెట్టుకుని గూడవల్లి రామబ్రహ్మం 1938లో "మాలపిల్ల" తీశారు. ఆ సినిమాలో ఒక ఛాందస బ్రాహ్మణుడి కుమారుడు మాలపిల్లను వివాహం చేసుకుంటాడు! ఆ రోజుల్లో- కొందరు బ్రాహ్మణులు ఈ సినిమా చూసి రాత్రివేళ (అప్పుడు మాట్నీ షోలు లేవు) ఇంటికొచ్చి బట్టలు తడుపుకుని, తలకి స్నానం చేసి అప్పుడు ఇంట్లోకి వెళ్లేవారు! (ఉదాహరణ : సాక్షాత్తు మా తండ్రి) కొందరు మైలపడతామని వెళ్లనే లేదు!

ఈ సినిమాలో హరిజనులు దేవాలయ ప్రవేశం చేస్తారు. ఆ వ్యవహారం కిట్టనివాళ్లు దేవాలయాలకి వెళ్లడం మానేశారు. సినిమా చూసిన హరిజనులు బ్రాహ్మణుల మీద



మండిపడి, రోడ్లు, దొడ్లు శుభ్రపరచడం మానేశారు. (అప్పుడు నేను విజయనగరంలో వుండేవాణ్ణి) ఈ సమ్మెవల్ల, బ్రాహ్మణుల మంటవల్ల, 'మాలపిల్ల'ని నిషేధించమని వీళ్లూ, వాళ్లూ అలజడి రేపారు. నిషేధం రాలేదు.

ఇక్కడ జోక్ ఏమిటంటే, సినిమా చూడకూడదని వాళ్లూ వీళ్లూ - రెండు వర్గాలూ తీర్మానించుకున్నా- సినిమా మాత్రం సూపరాతి సూపర్ హిట్టయింది!

"మాలపిల్లయితేనేం - అది కాంచన మాలంత అందగత్తె అయితే, నేను మాత్రం పెళ్లిచేసుకోనా?" అని, మా పెద్దన్నయ్యలాంటి బ్రాహ్మణ యువకుడు తన మిత్రులతో "రహస్యంగా"గా అనడం - ఇంకో జోకు!

❖ ❖ ❖

## బడ్జెటయిపోయింది!

ఒక జానపద చిత్రం. లో బడ్జెట్ లో తీశారు. అందులో ప్రభాకర్‌రెడ్డి విలను. సినిమా అంతా ఎలాగో అలాగ- పూర్తి చేసేశారుగాని, ప్రభాకర్ రెడ్డిని హీరో మనుషులు గుర్రాల మీద తరమడం షాటు వుండిపోయింది. ఏదో, వేరే ఇంకో సినిమాలోని లాంగ్‌షాటులో గుర్రాలు పరుగెత్తే షాట్లు సంపాదించి- వేసి, హీరో క్లోజప్‌లు వేరేగా తీసి, అతికించారు. అదేదో అయిపోయింది.

వారికి ముందుగా గుర్రం మీద ప్రభాకరరెడ్డి పారిపోతున్న షాటు తియ్యాలి. అదే బాలన్సు వర్కు. ప్రభాకరరెడ్డిని బతిమాలి, బామాలి తెచ్చుకున్నాడు నిర్మాత. షూటింగు జూబిలీహిల్స్ బండరాళ్ల దగ్గర. అప్పటికింకా రోడ్లు, బిల్డింగులూ రాలేదు. మీసం, విగ్గూ తగిలించుకుని పైన చెమ్కీకోటు లాంటిది ధరించి, ప్రభాకరరెడ్డి అవుట్డోర్ లొకేషన్‌కి వచ్చాడు. "గుర్రం ఎక్కడ?" అని అడిగాడు ప్ర.రెడ్డి.

"బడ్జెట్ లేదు. గుర్రం తేలేను" అన్నాడు నిర్మాత.

"మరి ?"

"ఆ బండ రాయి మీద కూచోండి. ఆకాశం బాక్‌గ్రౌండ్‌గా పెట్టుకుని, కెమెరా కిందపెట్టి క్లోజప్ తీసుకుంటాం".

బండరాయి కింద మాడ్చేస్తున్నా ప్ర.రె. కూచున్నాడు.

"మీరు గుర్రం మీద వెళ్తున్నట్టు - ముందికీ వెనక్కీ ఊగండి"

"చెయ్యి కనిపిస్తుందే. చేతిలో గుర్రం పగ్గాలు?".

"బడ్జెట్ లేదు. పగ్గాలు లేవు. నా పాంటు బెల్టు తోలుతో చేసిందే - చేత్తో పట్టుకోండి."

"పగ్గాలంటే రెండుండాలి కదా-"

"అదే, ఆ బెల్టునే మధ్యకి మడిచి, రెండుగా కనిపించేలా పట్టుకోండి. బెల్టు ముందు భాగం ఫ్రేములోకి రాకుండా తాడువేసి కట్టి, గట్టిగా నా చేత్తో పట్టుకుంటాను. టైట్‌గా వుంటుంది".

"స్సరే, తొందరగా కానీండి - బండ కాలుస్తోంది"

"మీరు భయపడుతూ మధ్య మధ్యలో వెనక్కి చూస్తూ వుండండి, హీరో మనుషులు వెంట తగుల్తున్నారన్నమాట".

"స్స స్స స్స రే.."

కెమెరా తిరుగుతోంది.....షాట్ తీస్తున్నారు.

"మీరు స్పీడ్ పెంచాలి. హీరో ట్రూపు దగ్గర కొచ్చేస్తున్నారు జోరుగా ఊగండి... ఇంకా జోరుగా ముందుకీ వెనక్కీ ..."



"కట్ -" అన్నాడు ప్రభాకర్ రెడ్డి.

కెమెరా ఆగింది.

"ఇది బడ్జెటు సినిమా. ఇంక ఫిల్మ్ వేస్ట్ చెయ్యకండి. నేనింక ఊగలేను. ముందు మామూలుగా ఊగానే.. - దాన్నే మీరు ఎడిటింగ్ లో 'స్పీడ్' చేసుకోండి. నా వల్లకాదు" అని "గుర్రం' దిగిపోయాడు ప్రభాకర్ రెడ్డి! బడ్జెట్ అయిపోయిన సినిమాకి ఇదొక ఉదాహరణ !

❖ ❖ ❖

## అవరోహణా పరిణామం!

"తెలుగు సినిమా పరిణామాన్ని మూడు దశలుగా చెప్పగలరా?" అని ఒక పత్రికా విలేకరి అడిగితే వచ్చిన సమాధానం :

1. తొలిరోజుల్లో రూపం, ఆకారాలు ఎలా వున్నా పద్యం చదవడం, పాట పాడడం వస్తే చాలు.
2. పద్యం, పాట రాకపోయినా పర్వాలేదు. నటనానుభవం, రూపురేఖలు, పర్సనాలిటీ బాగుంటే చాలు.
3. పర్సనాలిటీ, రూపురేఖలు అక్కర్లేదు, మాట కూడా చెప్పలేక పోయినా పర్వాలేదు.

# 'సం'గీతా రహస్యాలు

**తొలి తెలుగు నేపథ్య గాయకుడు?**

తెలుగు సినిమాల్లో మొట్టమొదటి ప్లేబాక్ సింగర్ ఎవరు? అన్నది ఎప్పుడూ మీమాంసే. 1939లో వాహిని నంస్థ ఆరంభమై



"వందేమాతరం' (బిఎన్‌రెడ్డి తొలిచిత్రం) తీసింది. అందులో కొన్ని పాటల్ని (నాగయ్య, కాంచనమాల) ముందుగానే రికార్డ్‌చేసి, 'ప్లేబాక్' చేసి, షూట్‌చేశారు. అయితే అవి వారి వారి కంఠాలతో వారే పాడినవి. వేరే వాళ్లు పాడితేనే, ప్లేబాక్ సింగింగ్ అవుతుందని, అలా పాడేవారే 'ప్లేబాక్ సింగర్స్' అనిపించుకుంటారనీ ఓ సిద్ధాంతం.

ఆ సినిమాలో కథానాయకుడి కొడుకు (పాత్రధారి కృష్ణ) వీధుల్లో తిరుగుతూ "పూలో పూలో పూలో కనీ కొనుడూ" అని పాడతాడు. అది అక్కడికక్కడే రికార్డు చెయ్యడంవల్ల (రోడ్డుమీద ధ్వనులు) సరిగా రికార్డు కాలేదు. అయితే ఏం చెయ్యాలని ఆ సినిమా స్క్రీన్‌ప్లే రచయిత, ఛాయాగ్రాహకుడు, ముఖ్య టెక్నీషియనూ అయిన కె.రామ్‌నాథ్ - ఆలోచించి- పాట అంతా ఎడిట్ చేసి, అది ప్రొజెక్ట్‌చేసి, నిశ్శబ్దం చేసి, దాని మీద అదే పాటని రికార్డు చేశారు.

అయితే ఈసారి పాడింది - సాబూ అనే సింగర్. ఈ పద్ధతిని 'పోస్ట్ సింక్రొనైజేషన్' అంటారనీ, అది రామ్‌నాథ్ సాధించారనీ, సాబూయే తెలుగు సినిమాల తొలి ప్లేబాక్ సింగరనిపించుకుంటాడనీ "వందేమాతరం" కళాదర్శకుడు, సౌండ్ రికార్డిస్టు ఎ.కె.శేఖర్ ఒక సందర్భంలో చెప్పారు.



'ఏకవీర' (1969) సినిమాలో మంచిపాటగా నేటికీ ప్రశంసింపబడుతున్న కృష్ణశాస్త్రి గీతం - " ప్రతిరాత్రి వసంతరాత్రి" ఆ సినిమా కోసం రాసింది కాదు. శాస్త్రిగారు సినిమా కోసంగా కాకుండా అంతకుముందే రాసిన ఆ పాటని "అమ్మ"అనే సినిమాకి రికార్డు చేశారు. (ప్రత్యగాత్మ దర్శకుడు, బి. గోపాలం సంగీత దర్శకుడు) అయితే "అమ్మ" సినిమా ప్రారంభం కాలేదు గనక, ఆ పాట కూడా బయటికి రాలేదు. అటు తర్వాత ఆ పాటని "ఏకవీర" లో వాడుకున్నారు. ఇది కె.వి. మహదేవన్ వరస. ఇదీ "ప్రతిరాత్రి వసంత రాత్రి" వెనక వున్న గీతా రహస్యం.

**- ఆర్కే**

నటించడం రాకపోయినా ఇబ్బంది లేదు. "ఫొటోజనిక్ ఫేస్" లు అసలు అక్కర్లేదు. వేషం వెయ్యాలనిపిస్తే చాలు - ఎవరైనా వెయ్యొచ్చు.

❖ ❖ ❖

## నాలుగు ఫస్టా ?

సాధారణంగా సినిమాల్లో విలన్ ఒక్కడే వుండడు. పక్కనే ఇంకొకడుంటాడు. విలన్ 'తానా" అంటే, ఇతను 'తందానా' అంటూ వుంటాడు. ఈ 'తందానా' వేషాలు ఎక్కువగా అల్లురామలింగయ్యవి. విలన్ పాత్రధారులు సత్యనారాయణ, నాగభూషణం, రావుగోపాలరావు ముగ్గురి పక్కనా ఎక్కువగా



రామలింగయ్యే నటించడం ఒక విశేషం ! 'కోడలు పిల్ల' (1972) సినిమాలో నాగభూషణం, రామలింగయ్య కాంబినేషన్. ఒక షాటులో రామలింగయ్యకి పెద్ద డైలాగుంది. నాగభూషణానికి తక్కువ వుంది.

" రామలింగయ్యా! ఇందులో నాదేం లేదు. నువ్వు గట్టిగా ఓ పట్టు పట్టు. లేకపోతే టేకులు -టేకుచెట్లలా పెరిగిపోతూ వుంటాయి'' అన్నారు నాగభూషణం.

"ఇదిగో - మీరు మరీ అలా తక్కువ అంచనా వెయ్యకండి. తలచుకున్నానంటే, ఒక్క టేక్‌లోనే -ఫస్ట్ టేక్‌లో 'ఓకే' చెప్పించుకోగలను" అన్నారు రామలింగయ్య పందెం కలపమన్నట్టు చిటికెలు కొడుతూ.

"పందెం! ఫస్ట్ టేక్‌లో ఓకే చెయ్యి. నీకు పట్టు శాలువా కప్పుతాను. ఎంతయినా టైమ్ తీసుకో'' అన్నారు నాగభూషణం. సై సై అనుకున్నా రిద్దరూ.

'రడీ' అన్నారు రామలింగయ్య- నాలుగు రిహార్సల్సు తర్వాత. 'ఫస్ట్ టేక్ ఓకే కావాలి' అనుకుంది రామలింగయ్య మనసు, ఇంకో వేపు బెరుగ్గానే వున్నా. షాటు తియ్యడం మొదలైంది. రామలింగయ్య డైలాగ్ చెబుతూ వుండగా, ట్రాలీ మీద నడుస్తున్న కెమెరాకి బెణికింది. కట్!

''ఫస్ట్‌టేక్ పోయింది.'' అన్నారు నాగభూషణం.

" నావల్ల కాదు. ఆ తప్పు కెమెరాది" అన్నారు రామిలింగయ్య.

రెండో టేకు - తీస్తూ వుండగా ఒక లైట్ ఫ్లిక్కరయింది. కట్!

" ఇదీ నా తప్పు కాదు. తప్పు లైటుది" అన్నారు రామలింగయ్య విజయవంతంగా.

టేక్ త్రీ!.. జరుగుతోంది. పైనుంచి విమానం వెళ్లింది - ఆ ధ్వని రాగా, (అప్పుడు అక్కడే రికార్డింగ్ కదా) రికార్డిస్టు 'కట్' అన్నాడు.

"ఇది నా తప్పుకాదు. తప్పు విమానంది" అన్నారు రామలింగయ్య - నవ్వేస్తూ.

నాలుగుసార్లు గట్టిగా 'సైలెన్స్'లు వినిపించాయి. నాలుగో టేకు ! మొత్తానికి, నాలుగో టేకు 'ఓకే' అయింది.

"ఫస్ట్ టేక్‌లో ఓకే చేసినట్టే! కప్పండి పట్టు శాలువా!" అన్నారు రామలింగయ్య.

"ఫస్ట్ టేక్ ఎలాగయ్యా - ఫోర్త్ టేక్"

" ఆ మూడు టేక్‌లూ నావి కావు. నాకు సంబంధించి ఎలాంటి తప్పూ జరగలేదు. అది నాలుగో టేక్ అయినా నా వరకు ఫస్ట్ టేకే. కప్పండి పట్టు శాలువా!" అని పట్టు పట్టారు రామలింగయ్య.

"టేక్ వన్‌లో ఓకే కావాలి అని కదా పందెం. ఎవరితప్పయితేనేం -" అని నాగభూషణం.

"సరే - సర్లెండి" అని సర్దుబాటు చేసుకుని వూరుకున్నారు రామలింగయ్య. తర్వాత నాగభూషణం చెవిలో రహస్యంగా అన్నారు. "ఇదిగో ! ముందు జరిగిన మూడు టేకులూ నాకు ప్రిపరేషనే. ఉన్న భయం, ఆందోళనా అప్పుడు పోయాయి. ఈ మూడూ లేకపోతే , నాలుగోది ఓకే కాదు - కానే కాదు!"

''అమ్మ రామలింగయ్యా - రామలింగయ్యవనిపించావు'' అన్నారు నాగభూషణం నవ్వుతూ.

❖ ❖ ❖




తెలుగు చలన చిత్ర సంగీత చరిత్రలో ఉదాత్తమైన గీతాలు, ప్రామాణికమైన గీతాలు వచ్చిన సంవత్సరాల్లో 1961 ఒకటి. ఆ సంవత్సరం విడుదలైన చిత్రాలలో విజయావారి

# జగదేకవీరుని కథ

చిత్రాన్ని సంగీత ప్రియులెవ్వరూ మరచిపోలేరు. ఆ చిత్రంలో 'శివశంకరీ శివానందలహరి' పాట - ఆ పాటతో సంబంధం ఉన్న ప్రతి ఒక్కరి జీవితంలోనే కాకుండా తెలుగువారికి కూడా ప్రతిష్ఠాత్మకంగా నిలిచింది.

ఆ పాటకు సంబంధించిన వివరాలివి:

ఆలాపన: ఆ ... ... ...
పల్లవి: శివశంకరీ
శివశంకరీ శివానందలహరి
శివశంకరీ శివానందలహరి
శివశంకరీ
శివానందలహరి శివశంకరీ
చరణం: చంద్రకళాధరి ఈశ్వరీ....
చంద్రకళాధరి ఈశ్వరీ
కరుణామృతమును
కురియజేయుమా
మనసు కరుగదా మహిమ జూపవా
దీనపాలనము చేయవే
శివశంకరీ
శివానందలహరి శివశంకరీ
శివశంకరీ శివానందలహరి
శివానందలహరి శివశంకరీ
శివశంకరీ శివానందలహరి శివశంకరీ
శివశంకరీ
శివానందలహరి
శివశంకరీ
చంద్రకళాధరి ఈశ్వరీ
రిరి సని దనిసా మపదనిసా
దనిసా దనిసా దనిసా
చంద్రకళాధరి ఈశ్వరీ
రిరి సనిపమగా రిసధా నీరీనీసా
రిమపదా మపనిరి నిసదప
చంద్రకళాధరి ఈశ్వరీ
దనిస మపదనిస
సరిమగరిమపని దనిస
మప నిరి సరి నిస దనిప
మపనిసరీసని సరిగా రిస రిరి సని
సనిపనిపమ పమ గమరిసనిస
సరిమపనిదానిస
సరిమపనిదానిస
సరిమపనిదానిస
చంద్రకళాధరి ఈశ్వరీ
ఆ....







చంద్రకళాధరి ఈశ్వరీ
శివశంకరీ...
శివశంకరీ....
తోం తోం తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిర్ద్రి యానా దిరితోం
దిరిదిరి తోం దిరిదిరి తోం
దిరిదిరి తోం తారీయానా
దిరిదిరి తోం తోం తోం దిరిదిరి తోం
తోం తోం
దిరిదిరి తోం దిరిదిరి తోం దిరిదిరి
తానా దిరితోం
దిరిదిరి దిరిదిరి దిరిదిరి దిరిదిరి
నాదిరి దిరిదిరి దిరి దిరిదిరి దిరి
నాదిరి దిరిదిరి తోం దిరిదిరి దిరి
నాదిరి దిరిదిరి తోం
నినినిని నినినిని దనిని దనినిని దప
పసస నిససనిద నిరిరి సరిరి సని
సగగ రిగగ రిస
సరిరి సరిరి సని
నిసస నిసస నిద
దనిని దనిని దప
నినిదద ససనిని రిరిసస గగరిరి
గగ సస రిరి నిని సని రిరి సస సస
రీరిరీరిరి నినినిరీరిరిరి నినినిగాగగగ
నినిని రీరిగరిమా
రిమరి సరిసనిసని పనిప మపమరిగా
సరి సస మపమమ సరిసస ససస
సరిసస పనిపప సరిసస ససస
మపమమ పనిదద
మపమ పనిద మపమ పనిద
పదపప సరిసస
పదప సరిస పదప సరిస
మమమ పపప దదద నినిని
ససస రిరిరి గరిసనిసరిపా
॥శివశంకరీ॥

‘శివశంకరి’ పాట స్వరపరచటానికి ముందే ‘జగదేకవీరుని కథ’ చిత్రంలోని మిగతా పాటల రికార్డింగు, పిక్చరైజేషనూ కూడా అయిపోయింది. క్లయిమాక్స్ షూటింగ్ ఇంకా రెండు నెలలుండనగా దర్శకుడు కె.వి.రెడ్డి, సంగీత దర్శకుడు పెండ్యాలను పిలిచి ‘నాగేశ్వరరావు గారూ! ఇప్పుడు మీరు చేయబోయే పాట పిక్చర్‌కి ప్రాణం వంటిది. పూర్వం నారదుడు, తుంబురుడు వాదించుకుంటుంటే హనుమంతుడు పాడితే శిలలు కరిగాయట. ఈ యుగంలో కూడా తాన్‌సేన్ పాడితే దీపాలు వెలిగాయట, అంతెందుకు మన కళ్ళముందే బీహార్ రాష్ట్రం క్షామంతో తల్లడిల్లిపోతుంటే పండిట్ ఓంకార నాథ్‌ఠాకూర్ వరుసగా ఆరు రోజుల పాటు ‘మేఘమల్హార్’ రాగం పాడి వర్షాలు కురిపించి చరిత్ర సృష్టించ లేదూ....! సో.... సంగీతానికున్న శక్తి అపారం. అసలు రిథమ్‌కు ఎంత శక్తి ఉందంటే.... ఆర్మీ ఒక బ్రిడ్జ్ మీద ఒకే రిథమ్‌లో మార్చ్ చేసుకుంటూ వెళితే ఆ బ్రిడ్జి కూలిపోతుంది తెలుసా....!? అందుకే బ్రిడ్జిల మీద ఆర్మీ చేత చెల్లాచెదురుగా నాన్ రిథమేటిక్‌గా నడిపిస్తారు. ఆర్మీలో ఉండేటప్పుడు నీగ్రో సింగర్ పాల్ రాబ్సన్ పాడుతూ ఒక మ్యూజికల్ నోట్ దగ్గర తన వాయిస్‌ని సస్టెయిన్ చేస్తే ఆ పవర్‌కి గ్లాసులు పగిలిపోయేవి. కరెక్టు స్పాట్లో కరెక్ట్ నోట్ గనుక పడితే మీ ముందున్న హార్మోనియం కూడా లేచి నాట్యం చేస్తుందండి...’ అంటూ అన్ని ఉపమానాలు చెప్పేసరికి పెండ్యాల వారికి గుండె అదిరిపోయింది.

అంత ఎఫెక్ట్‌ని ఎలా తీసుకురావాలా అని ఆలోచిస్తుండగా ఇంకో మాట అన్నారు కె.వి.రెడ్డి, “మామూలు లైట్ సాంగ్స్‌లో మా కోరికలు, సలహాలు చెప్పగలం.... ఇది కేవలం శాస్త్రీయ సంగీతంతో సృష్టించవలసిన ఎఫెక్ట్... మేం మాట్లాడగలిగేది ఏమీ లేదు. మీరు తయారు చేస్తే విని బాగుందో లేదో చెప్పడమే మా పని. ఇక్కడ (మద్రాసులో) ఇప్పుడు ‘జగదల ప్రతాపన్’ అనే సినిమా ఆడుతోంది. మన కథకు బేస్ అదే. కావాలంటే వెళ్లి చూడండి” అంటూ చెప్పారు, “వద్దండీ... చూస్తే ఆ ప్రభావం నా ఫ్లోకి అడ్డురావచ్చు, మనమే తయారుచేద్దాం, నా శాయశక్తులా ట్రై చేస్తాను” అన్నారు పెండ్యాల.

మరునాటి సిట్టింగ్‌లో చిన్న పేపరుమీద ‘శివశంకరీ శివానందలహరి’ అంటూ రాసి కె.వి.రెడ్డిగారికి చూపించారు పింగళి నాగేంద్రరావు. దానికాయన ‘బాగుందండీ...’ అంటూ పెండ్యాల గారి కిచ్చారు. ఆ కాగితాన్ని అలా ఇస్తూ ‘ఆర్తి బాగా కనబడాలి... మీ ఇష్టమొచ్చిన రాగాల్లో వినిపించండి” అన్నారు. పెండ్యాల బాగా ఆలోచించి ముల్తానీ, ఘూర్జరీ, తోడీ, కాళింగడా, దర్బారీ, అసావేరి రాగాలలో ఆ పల్లవిని పాడి వినిపించారు. కె.వి.రెడ్డిగారికి, పింగళి నాగేంద్రరావు గారికి దర్బారీ రాగంలో చేసిన ట్యూనే నచ్చింది. మిగతా చరణం తర్వాత రాసిస్తానని మర్నాటికే తెచ్చారు పింగళి. ‘నాగేశ్వరరావుగారూ.... మొత్తం పాటంతా మీ చేతికొచ్చింది..... ఇక మీ ఇష్టం.. మీరెప్పుడు ఫోన్ చేసి వినిపిస్తానంటే అప్పుడే నెక్స్ట్ సిట్టింగ్” అన్నారు కె.వి.రెడ్డి.

సరేనని ఓ పదిహేను రోజుల పాటు ఇంటివద్దే కూచొని స్వరరచన ముగించి ‘పాట రెడీ సార్’ అన్నారు పెండ్యాల. ఆ మర్నాడు కూర్చున్నారంతా.... పెండ్యాల పాడడం ప్రారంభించారు. అందరూ వింటున్నారు. తల, కాళ్ళు, చేతులూ అందరూ రిథమాటిక్‌గా ఊపుతున్నారు. అది చూసి పెండ్యాల మరింత ఉత్సాహంతో పాడేరు. పాట పూర్తయిన కొంత సేపటి వరకూ నిశ్శబ్దం. ‘నాగేశ్వరరావు గారూ.... పాట చాలా బావుంది, బాగా కష్టపడి చేశారు.... కానీ....’ అంటూ ఆగారు కె.వి.రెడ్డి, దాంతో గుండాగినంత పనైంది పెండ్యాల గారికి... ‘ఏవయిందండీ...’ అంటూ అడిగారు జంకుతూనే. “ఏం లేదండీ.... టైం చూసుకున్నారా.... పదమూడు నిమిషాలు... పదమూడు నిమిషాలపాటు తెరమీద ఏం చూపించమంటారు మమ్మల్ని!? తగ్గించక తప్పదు. అరున్నర నిమిషాలు మేగ్జిమమ్.... అంతే....’ అన్నారు. కె.వి.రెడ్డి.

‘సరే సార్ ఫిల్టర్ చేస్తాను’ అంటూ మరో నాలుగు రోజులు కష్టపడి పాటని చిత్రికపట్టి ఆ తర్వాత వినిపించారు పెండ్యాల. దానికి బాగా సంతృప్తి చెంది ఘంటసాల గారిని పిలిపించి’ నాగేశ్వరరావు గారూ.... పాడవలసినవారు ఈయన. ఆయనకు వినిపించండి’ అన్నారు. పాట వినగానే ‘బ్రహ్మాండం బాబూ.... ఈ పాట కోసం నేను పదిహేను రోజులైనా సరే రిహార్సలుకి వస్తాను. బాబూ..... బాగా పాడతాను’ అన్నారు ఘంటసాల. అలాగే వచ్చి సాధన చేశారు కూడా. రికార్డింగ్ అయ్యాక పాటను విన్న యన్.టి.ఆర్. ‘హిందూస్థానీ విద్వాంసులు పాడుతున్నప్పుడు, వాయిస్తున్నప్పుడు కొన్ని కొన్ని విన్యాసాలు చేస్తారు. మాస్టారితో పాటు కూచుని అవన్నీ ప్రాక్టీస్ చేస్తాను” అన్నారు. అలాగే నాలుగు రోజులు రిహార్సల్సు చేయటమే కాకుండా, ‘మాస్టారూ..... షూటింగ్ టైమ్‌లో కంప్లీట్‌గా మీరు సెట్ మీదే ఉండాలి” అన్నారు పెండ్యాల గారితో. అలాగే ఉన్నారు పెండ్యాల. వారం రోజుల పాటు ఆ పాట షూటింగ్ జరిగింది. పాట మొత్తంలో ఎక్కడా ఒక దగ్గర కూడా తొట్రుపాటు లేకుండా, తడబడకుండా ఎ టు జెడ్ బైహార్ట్ చేసి లిప్‌మూవ్‌మెంటు ఇస్తూ రకరకాల విన్యాసాలతో ఎన్.టి.ఆర్. నటించిన విధానానికి షూటింగ్ టైమ్‌లో ఉన్నవారు, విజిటర్స్‌గా వచ్చిన వారు ఆశ్చర్యపోయేవారు. ఆ తర్వాత ఈ పాట ఎంతటి చరిత్రను సృష్టించిందో....అది అందరికీ తెలిసిన విషయమే. ●




This feature for this issue is sponsored by

ADITYA MUSIC

in connection with their new releases

☆ మాస్ ☆ బాలు



# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 26

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.

- జీడిగుంట రామచంద్రమూర్తి



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మన్ కూతురు అశ్విని తండ్రంటే భయపడే పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించి తండ్రిని ఒప్పించి పెళ్లాడింది. వారి శోభనం జరగడానికి కొన్ని గంటల ముందు ఓ సాధువు ఎక్కడినుండో వచ్చి కోడలు గర్భం దాలిస్తే నీకు చావు తప్పదని శ్రీరామ్ తండ్రి వీరభద్రాన్ని హడలగొడతాడు. దాంతో ఒకే చూరుకింద ఉన్నా కొత్తదంపతులు కలవకూడదని ఆంక్షలు విధిస్తాడాయన. ఎడబాటు భరించలేక వారు విజయవాడలో చాటుగా కలస్తారు. ఫలితంగా అశ్వినికి గర్భం వస్తుంది. అల్లుడు రాజేంద్ర కట్నం బకాయీ అడగడంతో ఎగ్గొట్టడానికి పిచ్చి నటిస్తాడు వీరభద్రం.

- ఇక చదవండి

"మీ కట్నం బాకీ ఆయన తీర్చకపోతే-నేను నాలుగిళ్లల్లో పాచి పనిచేసి సంపాదించుకొచ్చి తీరుస్తాను... సరేనా?" మండిపడింది గీత.

రాజేంద్ర తప్పుచేసినవాడిలా తలవంచు కున్నాడు.

"ఖర్మ! ఎప్పుడు నాకు తెలిసి, ఆయన తలనొప్పి కూడా ఎరగరు. అలాంటి మనిషి ఇవాళ ఇలా మతితప్పి మాట్లాడుతున్నాడేమిటి భగవంతుడా- అని మేం తలలు బాదుకుని ఏడుస్తుంటే-మీకు అసలు కట్నం ఆలోచన ఎలా వచ్చిందో అర్థం కావటం లేదు. ముందు,ఆయన మాములు మనిషై మన ప్రపంచంలోకి వచ్చేలా చూడండి" అంటూ మొత్తుకుందామె.

ఆ మర్నాడు సాయంత్రం - అందరూ కలిసి వీరభద్రాన్ని నగరంలో వున్న ప్రముఖ మానసిక వైద్య నిపుణుడి దగ్గరకు తీసుకెళ్లారు..

వీరభద్రం, హాస్పిటల్లో చేరిన మూడోనాటికి -విషయం తెలుసుకున్న చిదంబరం- అతన్ని చూట్టానికి -విజయవాడ నుంచి ఖంగారు పడుతూ వచ్చాడు..'రూం'లో ఎవరూ లేకుండాచూసి అసలు విషయం అతనికి చెప్పేడు వీరభద్రం.

"అందరూ అనుకుంటున్నట్టు నాకు పిచ్చీపట్టలేదు.'దశమగ్రహము' పట్టినది!.. ఉన్నపాటున తన కట్నం బాకీ తీర్చనిచో 'గీత'ను వదిలేస్తానని బెదిరించాడు అల్లుడు . అందుకే కట్నం కోసం అల్లుడు మరీ అల్లరీ పెడితే - గతాన్ని మర్చిపోయిన వాడిలా నటించమని చెప్పిన నీ సలహా పాటించవలసి వచ్చినది...."

"ఓర్నీ !ఏదో మాట వరసకు సలహా ఇచ్చానని -ఇప్పుడిలా అందరి మీదకు తెస్తావా?.. సరేలే !?. నేనే ఏదో ఆలోచన చేసి- కథ కంచికీ - మీరు మళ్లీ రాజుపాలేనికీ వెళ్లేలా చూస్తాను. దిగులుపడకు.!" అభయమిచ్చాడు చిదంబరం.

* * *

"ఆ టైముకి హైదరాబాదులో ఇన్‌స్పెక్టర్ సదాశివం వచ్చి శ్రీరామ్‌ను కొట్టడానికి వచ్చిన రౌడీల వివరాలు అందిస్తున్నాడు - నిలబడివున్నాడు...

"తీగలాగితే డొంకంతా కదిలింది!..మీ అల్లుణ్ణి బెదిరించిన రౌడీలగురించీ, వాళ్ళ ముఠా నాయకుడు 'బాషా'ను కస్టడీలోకి తీసుకుని విచారిస్తే కొన్ని ఆసక్తికరమైన విషయాలు వెలుగులోకి వచ్చాయి! 'గోపాల్'అనే వ్యక్తి తనకు ఫోన్ చేసి - లక్షరూపాయలు ఇస్తాను. 'శ్రీరామ్'ని 'ఫినిష్' చెయ్యమన్నాట్ట.. అంతకుముందు సికింద్రాబాద్ జెయిల్లో బాషా వున్నప్పుడు -అక్కడే గోపాల్ పరిచయం అయ్యాట్ట.."

"ఇంతకీ ఆ గోపాల్ ఎవరు?" అడిగాడు విష్ణుమూర్తి.

"ఒకప్పుడు ఆ గోపాలూ, అతని తండ్రీ కలిసి అమెరికాలో ఏదో బిజినెస్ చేసేవారంట. మూడేళ్ళ క్రితం 'వరల్డ్ ట్రేడ్ సెంటర్' మీద తీవ్రవాదుల దాడి జరిగినపుడు వీళ్ళ వ్యాపారం దెబ్బతిందట... అందుకని ఇండియా వచ్చేశారు.. హైదారాబాద్‌కి వచ్చి 'అమెరికాలో ఉద్యోగాలు ఇప్పిస్తా' మంటూ పేపరు ప్రకటన ఇచ్చి యువకులను మోసగించారు. పాతిక లక్షలదాకా వసూలయ్యాక - వీళ్లు తమ 'కంపెనీ' బోర్డు తిప్పేసారు. డబ్బుకట్టిన కుర్రాళ్లంతా పోలీసు కంప్లయింట్ ఇవ్వడంతో చివరకు పట్టుబడ్డారు.. పదినెలలు జైలు శిక్ష పడింది. ఆ జైల్లోనే వీళ్లకు బాషాతో పరిచయం ఏర్పడింది..."

"మరి..ఆగోపాల్ ఎవరో, అతన్ని కలుసుకుని, మా అల్లుడిమీద అతనికి కక్ష ఎందుకో ఎంక్వయిరీ చేశారా?" అడిగాడు విష్ణుమూర్తి.

"కుదర్లేదు..! ఆ గోపాలూ, అతని ఫాదరూ జైలునించి ఆర్నెల్లక్రితమే ఎప్పుడో విడుదలై వెళ్లిపోయారట. వాళ్ళ 'వేరెబౌట్స్' తెలియలేదు. బాషాని అడిగితే తనకూ తెలియదన్నాడు.. గోపాల్, ఆనాడు తనతో 'ఫోన్'లోమాత్రమే మాట్లాడినట్టు చెప్పాడు!"

"పోనీ... ఆ గోపాల్ తండ్రి పేరేమిటో తెలుసుకున్నారా?" అడిగాడు విష్ణుమూర్తి.

"యస్..!.. ఆ క్రిమినల్ పేరు హనుమంతు!" చెప్పాడు ఇన్‌స్పెక్టర్...

విష్ణుమూర్తి షాకయ్యాడు..

* * *

బంగళాముందు కారు దిగిన విష్ణుమూర్తి, దభీమని, డోరువేసి, విసురుగా లోపలకు దూసుకొచ్చాడు..

తమగదిలో అప్పుడే విస్కీ బాటిలు 'ఓపెన్' చేసి ఓ పెగ్గు గొంతులోకి దింపుకున్న తండ్రీ కొడుకులిద్దరూ ఆ పాలికేకలు విని గాభరాగా గదిలోంచి బయటకు వచ్చారు..

"మన 'ఫ్లాష్‌బ్యాక్' మీ మావయ్యకి తెలిసిపోయిందేమోరా!" అన్నాడు హనుమంతు కొడుకు చెవిలో రహస్యంగా...

"మరేం భయంలేదు డాడీ... కథ అడ్డం తిరిగితే మనం కూడా అడ్డం తిరుగుదాం... పద..!" అంటూ తండ్రికి ధైర్యం చెప్పి భుజం తట్టాడు గోపాలం..

కాస్సేపటికే తమ కథంతా విష్ణుమూర్తికి పూర్తిగా తెలునని అర్థమైపోయింది తండ్రీకొడుకులకి..

"పోలీసుల్ని పిలుస్తావా?" అంటూ గోపాలం టెలిఫోన్‌కి వున్న కనక్షన్ వైరుని తెంపేశాడు. విష్ణుమూర్తి వెంటనే తన కోటు జేబులోవున్న 'సెల్‌ఫోన్' తీసి, దాంట్లో నంబర్లు నొక్కబోయాడు.. గోపాలం దాన్ని కూడా లాక్కుని పక్కకు విసిరేశాడు.. వంటింట్లోంచి అప్పటికే హాల్లోకి వచ్చి - ఈ వ్యవహారమంతా గమనించిన మంగమ్మ- ఎవరూ చూడకుండా వెళ్లి -కార్పెట్ మీద పడివున్న 'సెల్‌ఫోన్' తీసుకుని పెరటివైపు పారిపోయింది.

* * *

అశ్విని, శ్రీరామ్‌లు - వీరభద్రం వుంటున్న నర్సింగ్‌హోంకి చేరుకున్నారు.అప్పటికి అందరూ అక్కడే వున్నారు.వాళ్లందరితోపాటూ మేనమామ శేషగిరి కూడా కనిపించే సరికి శ్రీరామ్, కొంచెం ఆశ్చర్యపడిపోయాడు.

"ఇంతకీ మీరెప్పుడు వచ్చారు మావయ్యా!"- అంతలో శ్రీరామ్ కల్పించుకుంటూ అడిగాడు.

"నిన్ననే.. రవీంద్రభారతిలో నాటక పోటీలకై మా ట్రూపుని తీసుకొచ్చాను. మా అమ్మాయింటికెళితే మొగుడితో పోట్లాడి ఆత్మహత్యాప్రయత్నం చేసిందని తెలిసింది. ఈ నర్సింగ్‌హోమ్‌లో చేర్చారని తెలిసి ఇలా వస్తే మనవాళ్లు కనబడ్డారు.. మీ నాన్నను చూడబోతే.."

"శ్యామ కాపురం అలా ఎందుకయ్యింది మావయ్యా?" అడిగాడు శ్రీరామ్.

"నేను చేసిన తప్పుకు భగవంతుడు విధించిన శిక్ష బాబూ.. నా కూతుర్ని



చేసుకోవాల్సిన శ్రీరామ్ వేరే అమ్మాయి మెడలో తాళికడుతున్నాడని తెలిసి ఓర్వలేక పోయాను..కనీసం, నా కూతురికి వేరొకరితో పెళ్ళయ్యే వరకైనా, శ్రీరామ్ మనశ్శాంతిగా వుండకూడదనీ - తన భార్యతో సుఖపడకూడదనీ .పిచ్చి ఆలోచన చేశాను..” చెప్పటం ఆపి తలదించుకున్నాడు శేషగిరి..

“మైగాడ్ !..అందుకని ఏం చేశావయ్యా?” అతని భుజాలు పట్టుకుని కుదిపేస్తూ అడిగాడు చిదంబరం.

“చాలా నీచమైన పనే చేశాను లాయరుగారూ!.. వీరభద్రానికి జాతకాలపట్ల అపారమైన నమ్మకం వుంది కదా!.. ఆ బలహీనత ఆసరాగా తీసుకుని - చిన్నినాటకం ఆడేను.”

“నాటకమా?”

“అవును! మా నాటక సమాజాల్లో వేషాలు వేసే ఓ ‘ఆర్టిస్టు’ని స్వామీజి వేషంలో రాజుపాలెం వెళ్లి ఏడాది లోపల తను ‘తాత’ అయితే - ‘మారకం’ తప్పదని హెచ్చరించేలా చేశాను..!”

“దుర్మార్గుడా! ఎంతటి దారుణమునకు తలపడితివీ?” అంటూ మంచం మీదనించి హఠాత్తుగా లేచివచ్చి శేషగిరి చొక్కాకాలరు పట్టుకున్నాడు వీరభద్రం.

“అవునయ్యా!.. దారుణమే..చేసిన పాపం చెప్తే పోతుందంటారు!.. మీరందరూ క్షమిస్తే నా బిడ్డ బతుకుతుంది.”

అందరికంటె ముందుగా మాట్లాడినది అశ్వినియే! “పోనీలెండి, బాబయ్యగారూ. మీ అమ్మాయి కోలుకుని కాపురం సరిగ్గా చేసుకుంటే అంతకంటె ఏం కావాలి?” అంది.

“నీకు ఈ భగవంతుడే శిక్ష విధించినాడు.. పెద్దలు పాపాలు ఆచరిస్తే - అవి పిన్నలకు శాపములై చుట్టుకొనునట ! .. నీ కుమార్తె పరిస్థితిని గమనించితివిగా !.. అయినా నీ కక్ష నా కుమారునికి శిక్షగా పరిణమించినది.... వివాహము జరిగి ఆరునెలలు గడచినా - విడివిడిగా శయనించవలసిన దుస్థితిని కల్పించావు.. ఆ నాటకముల మనిషిని మహాత్మునిగా భ్రమించి - వాడు చెప్పిన మాటల్ని వేదవాక్కులవలె- తలబోసిన మూర్ఖుడను నేను !... ” బాధనూ, కోపాన్నీ కలగలిపి అన్నాడు వీరభద్రం.

వదిరోజుల్నించీ అప్పటివరకూ - అయినవాళ్ళను కూడా గుర్తుపట్టకుండా - మతిభ్రమించిన వ్యక్తిలా ప్రవర్తించిన వీరభద్రం- మళ్లీ మాములు మనిషిలా మాట్లాడటం చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

“నాన్నా.. మీరు.. మళ్లీ మీరు మాములుగా మాట్లాడేస్తున్నారు! మా అందర్నీ గుర్తుపట్టేరా?” శ్రీరామ్ ఆనందంతో పొంగిపోతూ అడిగాడు.

“మీ నాన్న అప్పుడూ ఇప్పుడూ మాములు మనిషేనయ్యా.. ఇన్నాళ్లూ ఆయనకేం మతి భ్రమించలేదు”-చెప్పాడు చిదంబరం.

“మరి - మమ్మల్నెవర్నీ గుర్తుపట్టకపోవటం.. అదోలా మాట్లాడటం..”

“అదంతా మీ నాన్న ఆడిన నాటకం!” అంటూ అసలు విషయం చెప్పేశాడు చిదంబరం.

చెప్పి, “ఒరేయ్ భద్రుడూ.. మావలసంఘం అధ్యక్షపదవితో బాటు - నీ స్కూల్లో హెడ్మాస్టరు పదవికి కూడా రాజీనామా చేసేయ్- ‘తాత’ హోదా అందుకుని హాయిగా మనవడితో ఆడుకుందువుగాని !” చిదంబరం సలహా ఇచ్చాడు..

“చూద్దాం !... నాకు ‘తాత’ పాత్ర లభించాలి కదా!.. మూఢనమ్మకాలను పట్టుకు ప్రాకులాడి, జాతకాలన్నీ యదార్థములవుతాయని భ్రమించి - ఆ ‘నాటకాలస్వామిజీ’ మాటకు విలువ ఇచ్చాను. భార్యా, భర్తల్ని వేరుచేసి,వాళ్ళమనసు క్షోభపెట్టాను.. లేకున్నచో ఆ పాటికి - నా కోడలుకు సీమంతం జరిగి వుండేది!” - నిట్టూర్పు విడిచాడు వీరభద్రం..

“నువ్వేం బాధపడకు నాన్నా.. త్వరలోనే మంచి రోజు చూసి అశ్వనికి సీమంతం జరిపిద్దాం !” గొప్పగా చెప్పేడు శ్రీరామ్.

వీరభద్రానికి అర్థం కాలేదు...

“అంటే !... ఏమిట్రా నువ్వంటున్నదీ?”.... అడిగేడు అమోమయంగా చూస్తూ..

“అశ్విని..అదే...నీ కోడలు.. ఇప్పుడు మనిషి కాదునాన్నా !.. తనకిపుడు అయిదోనెల..!” బోలెడంత సిగ్గుపడిపోతూ చెప్పాడు.

వీరభద్రంతో పాటు, అందరూ ఉలిక్కిపడి చూశారు..,

“శోభనం కాకుండా అయిదోనెల ఏమిట్రా అప్రాచ్యుడా !.. కొంపదీసి మీరిద్దరూ...” అంటూ తెల్లబోయి చూస్తూన్న వీరభద్రం మాటకు మధ్యలోనే అడ్డుపడుతూ చిదంబరం చిదంబర రహస్యం చెప్పేశాడు.

అందరూ గొల్లున నవ్వుతూండగా డాక్టరు వచ్చి శ్యామ కోలుకుందని చెప్పేడు. హమ్మయ్య అని అంటూండగానే అశ్విని సెల్‌ఫోన్ మ్రోగింది. అవతల మంగమ్మ!

* * *

విష్ణుమూర్తి బంగళాముందు టాక్సీ ఆగేసరికి అర్ధరాత్రి దాటింది..

శ్రీరామ్ అశ్వినీ టాక్సీ దిగి, గేటు తెరచుకుని - నెమ్మదిగా లోపలకు వచ్చారు- పరిసరాలన్నీ నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా వున్నాయి.తలుపు దగ్గర నిలబడి ‘బజర్’ నొక్కబోయిన అశ్వినికి, లోపల్నించి ఏమో మాటలు వినిపించటంతో అక్కడే ఆగిపోయింది.

“ఇప్పటికే చాలాసమయం వృధాచేశావ్! నా చెల్లిలి మొగుడివి కదా, సమస్యను సామరస్యంగా పరిష్కరించకపోతావా’ - అని ఇంతసేపూ వెయిట్ చేశాను... కోట్లు వెనకేసినవాడివి, ‘బావమరిదికి - ఆఫ్టాల్ ఓ యాభైలక్షలు ఇవ్వలేకపోతావా’ అని ఆశపడ్డాను. కానీ నువ్వు చాలా మొండిగా ప్రవర్తించావ్...! నువ్వేకనక పరాయి వాడివైయుంటే- మా గోపాలం ఈ పాటికి నీ ప్రాణాలు తీసేసేవాడు. కానీ.. నువ్వువాడికి మేనమామవైపోయావ్!. ...అందుకే కిరాయి రౌడిల్ని పిలిపించవలసిన వచ్చింది... ! మర్యాదగా నీ లాకర్ తాళం చెవులు ఎక్కడున్నా యో చెప్పు..”

“అది ఆ హనుమంతుగాడి గొంతు.. మా నాన్నని బెదిరిస్తున్నాడు...” శ్రీరామ్‌తో చెప్పింది అశ్విని..

ఆ తలుపుకి వున్న ‘కీ హోల్’ లోంచి - చూశాడు శ్రీరామ్. సోఫాలో కూర్చుని వున్న విష్ణుమూర్తి చేతులు రెండూ వెనక్కి విరిచి కట్టినట్టు తెలిసింది. అతనికి ఎదురుగా ఓ గూండాలాంటి మనిషి కూర్చుని వున్నాడు.

“చూడు పెద్దమనిషీ! నాకు అవతల చాలా పనులున్నాయి... ఇంక నీకు పావుగంట టైం ఇస్తున్నాను..ఈ లోగా వాళ్ళడిగిన డబ్బు తెచ్చి ఇవ్వకపోతే-నిన్నిలాగే,మాతో తీసుకుపోయి... మధ్యలోనే మాయం చేసేస్తాం!” ఆ గుండా అన్నాడు..

వాడి పక్కన హనుమంతూ, గోపాలం వున్నారు... సోఫావెనకాల మరో ఇద్దరు మనుషులు కూడా కనిపించారు..



"ఇదివరకోసారి మన కారుకి అడ్డంపడి - మనమీద దాడిచేసిన వాళ్లే అక్కడున్న బాషాగాడి మనుషులు!.. ఆ సోఫాలో కూర్చుని బీరుతాగుతున్నవాడు బాషాయే అయ్యుండాలి !" అటు చూస్తూనే చెప్పాడు శ్రీరామ్.

అశ్విని కూడా 'కీ హోల్' లోంచి లోపలకు చూసింది... తండ్రి దీనావస్థను గమనించి భయంతో వణికిపోయింది. " అమ్మో !.. ఆ దుర్మార్గులు మా డాడీని ఏం చేస్తారో?" అంటూ శ్రీరామ్ చేయి పట్టుకుంది.

"ఏం భయంలేదు... నేనున్నాను!... నా దగ్గర బాబా ఇచ్చిన తాయెత్తుంది!.. దీని పవర్ తో వాళ్ళ భరతం పడతాను!" అంటూ తాయెత్తును ఎప్పటిలా కళ్ళకద్దుకునేందుకు కుడిచేతి దండను తడిమి చూసుకున్నాడు..

చేతికి తాయెత్తు తగలకపోవటంతో షాకయ్యాడు.

"అయ్యో ! తాయెత్తు ఏమైందీ ?" అనుకున్నాడు.

"చేతికి లేదా ?" అడిగింది అశ్విని.

" లేదా ...! బహుశా -ఎప్పుడో తెగిపోయి, ఆ నీళ్ళల్లోనే పడిపోయుండాలి!" గుర్తుచేసుకునే ప్రయత్నంలో అన్నాడు.

"పోతేపోయిందిలే ..అది వున్నా ఒకటే.. ఊడినా ఒకటే!... నువ్వు తల్చుకుంటే, ధైర్యంగా ఆ రౌడీల అంతు తేల్చగలవ్!" అతని భుజం తట్టి చెప్పిందామె.

"కానీ ఆ బాబా ఎవరో పూజలు చేసి ఇచ్చిన తాయెత్తు కదా అదీ?"

"చెప్తున్నానుగా...! అది తాయెత్తు కాదు...పిచ్చి తాడు!... అంతే!"

"తాడా!?" ఆశ్చర్యపోతూ అడిగాడు శ్రీరామ్.

"అవును దాన్ని ఇచ్చిన బాబాకి ఎలాంటి శక్తులూ, మహిమలూలేవు!.. అసలు అతను బాబాయే కాదు... అతని పేరు రసూల్‌ఖాన్.. పూర్వం మా ఇంట్లో డ్రైవర్‌గా పనిచేసేవాడు.. చిన్నప్పుడు నన్ను ఎత్తుకుని పెంచాడు.. పెద్దవాడై, చూపు తగ్గిపోవటంతో మా దగ్గర పని మానేశాడు.. నీలో ఆత్మవిశ్వాసాన్ని కలిగించటానికీ - నీకు ధైర్యాన్ని నూరిపోసి, నీ శక్తియుక్తుల పట్ల నమ్మకం కలిగేలా చేయటానికే, అతనితో కలిసి, ఆ రోజు అలా నాటకం ఆడేను! .. నిన్ను నావాడిగా దక్కించుకోగలిగాను!"

"మరి...ఆరోజు రోడ్డు మీద వర్షు పారేసుకున్న రౌడీలను నువ్వుకొట్టడం..." అంటూ అడగబోతూంటే, అశ్విని మధ్యలోనే కల్పించుకుంటూ చెప్పింది-

" అదీ డ్రామాయే!( ఆ కుర్రాళ్ళు మా డాడీ కంపెనీ లో పనిచేసే వర్కర్లు! నిన్ను నావైపు తిప్పుకోవటానికి అలా, వాళ్ళను కూడా ఉపయోగించుకున్నాను.. ఆఫ్‌కోర్స్.. నాకు కరాటే వచ్చుననుకో!"

శ్రీరామ్ ఆమె వైపు విస్మయంగా చూశాడు.

"సారీ రామ్!... నేను నిన్ను ఎంతో గాఢంగా ప్రేమించాను. నీకూ నా మీద ప్రేమ వుందని గ్రహించాను...కానీ మీ నాన్నగారి పట్ల భయంతోనో, భక్తితోనో ఆయనకు ఎదురు చెప్పలేక, మీ మామయ్య కూతురితో పెళ్లికి తలవంచుకున్నానని అర్థం చేసుకున్నాను. ..అందుకే ఆ సాహసం చేశాను..చివరకు నా ఆఖరి ప్రయత్నం అలా ఫలించింది... ఈ విషయం నీకు చెప్పి... క్షమాపణ కోరుకోవాలని చాలాసార్లు అనుకున్నాను.. కానీ అవకాశం రాలేదు.... నన్ను మన్నించు రామ్..."

"నేను మన్నించాల్సినంత తప్పు నువ్వేం చేయలేదు అశ్వినీ!.. ఆ మాటకొస్తే నాలోని ధైర్య సాహసాలకు ఊపిరిపోసి - నన్ను మగధీరుడిగా మార్చినందుకు- నీకే నేను కృతజ్ఞతలు చెప్పుకోవాలి!" ఆమె చేతిని తన రెండుచేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా అన్నాడు శ్రీరామ్.

"నాకు కృతజ్ఞతలు తర్వాత చెబ్దువుగాని ... ముందు ఆ రౌడీలకు బుద్ధిచెప్పి -మా నాన్నని విడిపించు..కరాటే నేర్చుకున్నదాన్ని నీవెంట నేనున్నానుగా.. పద!"విజయ సంకేతంగా బొటన వేలు పైకెత్తి చెప్పింది అశ్విని.

ఇద్దరూ - బంగళా వెనక్కి- వెళ్లి - గోడ దూకి పెరట్లోకి ప్రవేశించారు... అక్కడున్న నిచ్చెన సహాయంతో బాల్కనీలో చేరుకుని- చప్పుడు కాకుండా హాల్లో అడుగుపెట్టారు.

అక్కడ సోఫాలో కూర్చుని బీరుబాటిల్ ఖాళీ చేసిన గుండాకి, మరో బాటిల్ ఓపెన్ చేసి అందిస్తూ అంటున్నాడు గోపాలం-

"బాషాభయ్యా! నువ్విచ్చిన టైం దాటిపోయింది.. మా మావ దారికొచ్చేలాలేడు.. ఏం చేద్దాం ! ఫినిష్ చేయకతప్పదు! మాతో తీసుకుపోతాం.. మధ్యదారిలో ఫినిష్ చేస్తాం.. అక్కడే ఏ నూతిలోనో, చెరువులోనో పారేసి మా దారిన మేం పోతాం!" అంటూ బాటిల్‌ఎత్తి అందులోని బీరంతా గడగడా తాగేశాడు బాషా.

సరిగ్గా అదే క్షణంలో శ్రీరామ్ ఎగిరివచ్చి -అతని మీద విరుచుకుపడ్డాడు.. అతని చేతిలోకి బీర్‌బాటిలు కిందపడి పగిలిపోయింది.. ఆ పగిలిపోయిన సీసాను చేతిలోకి తీసుకుని బాషా మీదకు వచ్చాడు శ్రీరామ్...

అతన్ని చూసిన తక్కిన రౌడీలిద్దరూ గట్టిగా అరిచారు-"బాస్ - ! ఆ రోజు మమ్మల్ని చావగొట్టి పోలీసులకు పట్టించింది వీడే !"

"అయితే చూస్తారేం?... ముందు వాణ్ణి వేసెయ్యండి!" బాషా కూడా అరిచాడు.

రౌడీలు శ్రీరామ్ మీదకు వచ్చారు... తన చేతిలోని పగిలిన సీసాతో వాళ్లను గాయపరుస్తూ ఎదుర్కొంటున్నాడు శ్రీరామ్...

ఈలోగా అశ్విని వెళ్ళి - విష్ణుమూర్తి కట్లు విప్పేసింది. ఈ హఠాత్పరిణామాలకు - ఏం చెయాలో తోచక - అలాగే ఓ పక్కగా నిలబడిపోయాడు హనుమంతు. గోపాలం రౌడీలకు తోడయ్యాడు. సినిమాలో హీరోలాగా శ్రీరామ్- వాళ్ళందర్నీ ఓ ఆట ఆడిస్తూంటే - విష్ణుమూర్తి అశ్వినీ అతనికి అండగా నిలబడ్డారు..

అంతలో బజర్ వినిపించింది. అశ్విని వెళ్లి తలుపు తీసింది.. రాజేంద్ర పోలీసుల్ని వెంట బెట్టుకుని లోపలకు వచ్చాడు.. వాళ్లతో బాటు వీరభద్రం, చిదంబరం కూడా వున్నారు.. వాళ్ళందర్నీ చూసిన హనుమంతూ, గోపాలం - కాలికి బుద్ధి చెప్పబోయారు...కానీ, రౌడీలతోపాటు వాళ్ళను పట్టుకుని - చేతులకు బేడీలు వేసి - జీపులోకి ఎక్కించి తీసుకుపోయారు పోలీసులు..

"సమయానికి ఆ రౌడీల బారినించి కాపాడేవయ్యా అల్లుడూ! డబ్బులకోసం ఇకముందు నన్నెవరూ పీక్కుతినకుండా - నా యావదాస్తినీ ఇవాళే నీ పేరు రాసేసి 'రిజిస్టర్' చేయించేస్తాను..." అభినందనపూర్వకంగా శ్రీరామ్‌ని చూస్తూ చెప్పాడు విష్ణుమూర్తి.

"రాసేముందు నాకు రెండు లక్షలు ఇవ్వాలి?" అంటూ ముందుకొచ్చింది అశ్విని. అందరూ ఆమెవైపు - చూశారు.

"మేం సమయానికి ఇక్కడ కొచ్చి మిమ్మల్ని కాపాడు కోవటంలో - మంగమ్మ సహాయం ఎంతో వుంది..తను ఎంతో సమయస్ఫూర్తితో వ్యవహరించి, మీ సెల్‌ఫోన్ దక్కించుకుంది. ఇక్కడ జరిగేది నాకు వివరించింది..అందుకే సమయానికి మేం ఇక్కడకు రాగలిగేం..!.. కాబట్టి ఓ రెండు లక్షలు మంగమ్మకు బహుమతిగా ఇవ్వాలనుకుంటున్నాను!" చెప్పిందామె.

"అది సరే ఈ లోగా మీరు మీ పుత్రికకు 'సీమంతం' జరిపే ఏర్పాట్లు చూడండి!" వీరభద్రం ముందుకొచ్చి చెప్పాడు.

"సీమంతమా?" విస్తుపోతూ అడిగాడూ విష్ణుమూర్తి.

" అంత 'ఓవర్'గా విస్తుపోవాల్సిన అవసరంలేదు. మీ పుత్రిక చేతా, మా పుత్రుని చేతా -కథలు చెప్పించి - బెజవాడలో హనీమూన్ చేసుకోమ్మని ప్రోత్సహించినది తమరేనట కదా?"

గతుక్కుమన్నాడు విష్ణుమూర్తి.

"దాని ఫలితమే ఇప్పుడీ సీమంతం!"

"భేష్ !..అయితే త్వరలోనే మీరు తాతగారైపోతున్నారన్నమాట!" వీరభద్రం భుజం ట్టాడు విష్ణుమూర్తి.

"...మీతో బాటే!" వీరభద్రం కూడా విష్ణుమూర్తి భుజం తట్టాడు.

"అయ్యా! ...మీ భుజాల్ని అలా బాదుకోకండి!..ఇంకో అయిదారునెలల్లో మీ మనవడు ఆ భుజాల మీదనే ఎక్కికూర్చుని - తాతలిద్దర్నీ 'ధిత్తై తధికిణితోం' అంటూ భరతనాట్యం ఆడిస్తాడు.. " గొప్పగా చెప్పాడు నారాయణ.

అందరూ హాయిగా నవ్వుకున్నారు..

అశ్వినీ..శ్రీరామ్..మాత్రం కళ్ళతోనే ఏమిటేమిటో మాట్లాడేసుకుంటున్నారు...

(సమాప్తం)





# అన్నమయ్య పద భావ దర్శనమ్ 6



నిర్వహణ
జి.బాలకృష్ణప్రసాద్

## నిత్యపూజలివివో

సంపుటం -2- సంకీర్తనం: 82
సంగీత కూర్పు, గానం: జి.బాలకృష్ణ ప్రసాద్
(టి.టి.డి.) వారి "అన్నమయ్య హరి శరణాగతి"
క్యాసెట్, సి.డి. లోనిది.

నిత్యపూజలివివో నేరిచిన నోహో
ప్రత్యక్షమైనట్టి పరమాత్మునికి॥

తనువే గుడియట తలయే శిఖరమట
పెను హృదయమె హరిపీఠమట
కనుగొన చూపులె ఘనదీపములట
తనలోపలి అంతర్యామికిని॥

పలుకే మంత్రమట పాదైన నాలికే
కలకలమను పిడి ఘంటయట
నలువైన రుచులే నైవేద్యములట
తలపు లోపలనున్న దైవమునకును॥

గమన చేష్టలే అంగరంగ గతియట
తమిగల జీవుడే దాసుడట
అమరిన వూర్పులే ఆలవట్టములట
క్రమముతో శ్రీవేంకటరాయనికి॥

**తాత్పర్యము :**

(శ్రీవేంకటగిరిపైన ప్రత్యక్షదైవమై వున్న పరమాత్ముడు మనలోనే అంతర్యామిగా వున్నాడు. మనం భావించి నేర్పుతో చూడగలిగితే నిత్యజీవితంలో ప్రతివ్యక్తీ ఆ స్వామికి చేసే పూజలను గుర్తించవచ్చు. ఈ భావనకు మనసే ప్రధానం. ఈ భావాలన్నీ కలబోసి రోజూ మనం చేసే పనులను, మన శరీరంలోని అవయవాలను విషయంగా తీసికొని అద్భుతమైన సంకీర్తనగా మలచారు అన్నమాచార్యులు)

భగవంతునికి భక్తే ముఖ్యం. అది మనసునిండా వున్నప్పుడు మనం చేసే ప్రతిపనీ భగవంతుని పూజే అవుతుంది. అంతరాత్మయై అలరారే పరమాత్మకు ఈవిధంగా (నేరిచిన = జ్ఞానియైన) జీవుడు నిత్యపూజలు చేస్తున్నాడు.

మన శరీరమే ఒక గుడి. అందులోని శిఖరం మన శిరస్సే. దైవాన్ని ప్రతిష్ఠించడానికి వలసిన పీఠం (ఆసనం), భక్తిభరితమై విశాలమైన మన హృదయమే. (వస్తువును చూడటానికి కావలసిన ఉపకరణాలు చూపు, వెలుతురు. వెలుగుకు కారణమైన దీపం జ్యోతిస్వరూపమైన దైవం). కంటిచూపే స్వామికి దీపారాధన. వీటితో శాశ్వతంగా మనలో అంతర్యామియై వెలసి వున్నాడు ఆ పరమాత్ముడు.

వ్యవహారంలో మనం సహజంగా మాటాడే మాటలే మంత్రాలు. పూజలో ప్రధానమైనది, నిండుదనాన్నిస్తూ వీనుల విందు చేసేది ఘంటారావం. మన నాలుకయే ఆ పిడిఘంట. వివిధ రుచులతో మనం తీసికొనే ఆహారమే మనలోని దైవానికి నైవేద్యం.

భగవంతునికి జరిపే ఉత్సవాదులకు వన్నె తెచ్చేవి (ఆయా వాహనాలప్పుడు) వాహనధారులూ, భక్తాదులూ చూపే విన్యాసాలు, నృత్యాదికాలు అంగరంగ గతులు. భక్తి పారవశ్యంతో కూడిన మన ప్రతి కదలిక అదే. అటువంటి ఆసక్తి, ప్రీతి కలిగిన జీవుడే నిజమైన దాసుడు. ఆ దాసునికి - తన జీవితకాలమంతా సాగే ఉచ్ఛ్వాస నిశ్వాసాలే ఆ స్వామికి వింజామరలు.

తనువు = శరీరము
నలువైన = ఇష్టమైన
తమి = ఆపేక్ష, వలపు,
ఊర్పులు = ఉచ్ఛ్వాస నిశ్వాసములు
పాదైన = స్థిరమైన
గమన చేష్టలు = కదలికలతో కూడిన పనులు
ఆలవట్టములు = వింజామరలు (విసనకఱ్ఱలు)

**పాఠకులకు/ గాయనీ గాయకులకు గమనిక**
**ఉచ్చారణకై సూచనలు:**
*ఈ క్రింది పదాలు ఇలా పలకాలి:*

అంతర్యామి = అన్‌తర్యామి   ఘంట = ఘణ్‌ట
అంగరంగ = అఙ్‌గరఙ్‌గ   వేంకట = వేఙ్‌కట

# ఆప్త వాక్యాలు

"అన్నమాచార్య ప్రాజెక్టు సౌధం పునాదిరాళ్ళలో బాలకృష్ణప్రసాద్ పేరు కూడ లిఖింపబడింది. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, నేదునూరి కృష్ణమూర్తి, గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ - ఈ ముగ్గురు నా దృష్టిలో, అన్నమయ్య సంకీర్తన స్వరసృష్టిలో "సంగీత త్రయం". అన్నమాచార్య వ్యాప్తికి, దీప్తికి బాలకృష్ణ చేసిన సేవ అనన్యసామాన్యమైనది."

**- కామిశెట్టి శ్రీనివాసులు**

"అన్నమయ్య సంకీర్తనల గానంతో తన జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న సుమధుర గాయకులు శ్రీ బాలకృష్ణ ప్రసాద్. శ్రీ ఆంజనేయ, శ్రీ గణేశ, శ్రీ నవగ్రహాలను తన వాగ్గేయ కుసుమాలతో పూజించారు. తన అన్నమయ్య సంకీర్తనా కార్యక్రమాలతో దేశవిదేశాలలోని ప్రజలను మంత్రముగ్ధులను చేసిన ఘనుడు ఆయన. నిరంతర స్వరార్చనతో తిరుమలేశుని సేవించే ధన్యుడు శ్రీ బాలకృష్ణ ప్రసాద్.'

**- ఎం.చిత్తరంజన్**

"శ్రీ హనుమంతుని దివ్యానుగ్రహంచే చి॥ బాలకృష్ణప్రసాద్ హృదయంలోంచి ఉద్భవించిన "శ్రీ ఆంజనేయ కృతి మణిమాల" శ్రీ హనుమంతుని దివ్యప్రసాదం. ఈ కృతులు సుమధురమైన శైలిలో తగిన రాగాలలో సంగీతాన్ని మలచి సునాద లయబద్ధంగా తీయగా గానం చేశాడు బాలకృష్ణుడు. ఈతని కృతుల వల్ల హనుమ "బాలకృష్ణ సఖు"డైనాడు. ఒక్కొక్క కృతి ఒక్కొక్క మణిపూసవలె భాసించుచున్నది. ముఖ్యముగా సుందర రంజని అనే రాగమును సృష్టి చేసి "వందనమయ్యా..." అను కీర్తన పాడినది నిజముగా సుందరముగను రంజకముగను ఉన్నది. సహజంగా భక్తి సంగీతంతో తన జీవితాన్ని మలచుకొన్న బాలకృష్ణప్రసాద్ వాగ్గేయకారుడై విలసిల్లుచున్నాడు. ఈతడు ఇంకను అనేక నూతన రచనలను చేసి పాడి తరించవలెనని ఆశీర్వదిస్తూన్నాను. శ్రీ ఆంజనేయ కృతి మణిమాలాధారుడై శ్రీ ఆంజనేయుడు ప్రకాశించి ప్రసాదును చిరంజీవిగా ఆశీర్వదించుగాక."

**- పద్మవిభూషణ్ డా॥ఎం.బాలమురళీకృష్ణ**

(శ్రీ ఆంజనేయ కృతి మణిమాల క్యాసెట్‌లో ముందుమాటగా పలికిన పలుకులు)

"మెత్తటి గొంతుతో బాటు సుతిమెత్తని భావుకత, ఆపైని మంచి మనసు మా ప్రసాదువి. వీటన్నింటినీ మించింది అతని గురుభక్తి. అతని ప్రతి మాటలో, కదలికలో వినయం, విధేయత విద్య యందు గురువు యందు భక్తి ప్రవత్తులు స్వచ్ఛంగా కనపడుతూంటాయి. అలాంటి వారిని సాక్షాత్తు శారదాదేవి గురురూపంలో కటాక్షిస్తుంది. తిరుమల-తిరుపతి దేవస్థానం వారి అన్నమాచార్య ప్రాజెక్టుకి గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్ అనే మూలస్థంభాన్ని సమకూర్చడానికే ఆ అన్నమయ్య, తిరుమల స్వామి నన్ను ఆవేళ హైదరాబాద్ ఆకాశవాణి రికార్డింగ్‌కి పంపారేమో!"

**- నేదునూరి కృష్ణమూర్తి**

"మధుర స్వరభూషితులై అన్నమాచార్య సంకీర్తన గానముచే అబాలగోపాలమును ఆనందపరవశులను గావించుచున్న గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్‌గారు వారి విద్యార్థి దశనుండియు నాకు సుపరిచితులు. తెలియని విషయములను వినయవిధేయతలతో విశేషజ్ఞులయిన వారినడిగి తెలిసికొనుట వారి స్వభావము. వీరు ఆంజనేయ కృతులను, వినాయక కృతులను, నవగ్రహ కృతులను స్వీయ శైలిలో రచించి, నాకు వినిపించి, పరిష్కరణమును కోరిరి. విని ఆనందించి, జ్ఞానానందమయుని ప్రేరణచే పరిష్కరించితిని. సామాన్యమైన సంగీతపరిజ్ఞానము కలవారు కూడ గానము చేయుటకు అనువైన వీరి రచనలు అభినందనీయములు."

**- పౌరాణిక శిరోమణి గోపాలవఝుల బాలసుబ్రహ్మణ్యశాస్త్రి**

"సాక్షాత్తు హనుమంతుడే తన నాలుక యందు నిలిచి, వరమిచ్చినట్లుగా మధురమైన పదజాలము, భక్తి భావాలతో 21 కృతుల మణిమాలను, 21 రోజులలో రచించి ఆంజనేయస్వామికి సమర్పించిన బాలకృష్ణప్రసాద్ మిక్కిలి అభినందనీయుడు. కచ్చేరీలలో పాడుకొనుటకు సంగీత సాహిత్యములందు ఈ కీర్తనలు ఉన్నతస్థాయి రచనలుగా వున్నవి. విద్యార్థులకు కూడ మిక్కిలి ఉపయోగకరమైన రచనలు."

**- ఎం.ఎస్.బాలసుబ్రహ్మణ్యశర్మ**


ఈ శీర్షికను సమర్పిస్తున్నవారు:

ICOMM టెలీ లిమిటెడ్
ప్రమోటర్
శ్రీ పాతూరు రామారావు

iCOMM
www.icommtele.com

**ICOMM TELE LIMITED**

**Regd. Office:** Trendset Towers, 3rd Floor, Road No. 2, Banjara Hills, Hyderabad – 500 034, A.P. India.
Tel: +91-40-23552222, Fax: +91-40-23552266, Email: info@icommtele.com

❖Optical / Radio Transmission & Access Products ❖Broadband / Broadcasting Products
❖Nex-Gen Switching Products ❖Towers / Antennas / Solar
❖Turnkey Services (Building up wireline & Wireless Telecom Networks) ❖Transmission & Distribution

# ఓ కామేశం కథ

- సూరేపల్లి విజయ



దాదాపు రెండు గంటల ముప్ఫయి నిమిషాల నలభై సెకన్లుగా ఏడుస్తూ వున్నాడు కామేశం. అయినా అతడ్ని ఓదార్చే ధైర్యం ఎవరూ చేయడం లేదు. నెలలో నాలుగైదుసార్లు అయినా ఏడ్చే కామేశాన్ని ఎవరైనా ఓదారిస్తే ఆ కథే వేరు...

ఓసారెప్పుడో నాన్‌స్టాప్‌గా కామేశం ఏడుస్తూ వుంటే స్టెనో చిత్రాంగి "వాట్ కామేశం....వై క్రయింగ్?" అని అడిగింది కళ్ళు టపటప లాడిస్తూ.

"నా ఏడుపు నా యిష్టం. నన్ను ప్రశాంతంగా ఏడ్వనివ్వరా? వెధవ సంత..వెధవ సంత.. నీ మొగుడు నిన్ను చితకతన్ని తగలేస్తే ఏడవచ్చా? సెంట్రల్ గవర్నమెంటు టయిమ్ చూసి నాన్‌స్టాప్‌గా పెట్రోల్ రేటు పెంచితే జనం ఏడవచ్చా? రోజూ పంపులో నీళ్ళు రాకపోతే మన కంట్లో నుంచి వాటర్ రాదా? ప్రపంచంలో ఏడ్చే వాళ్ళందర్ని ఇలానే అడుగుతారా? దిక్కుమాలిన సంత. దిక్కుమాలిన సంత" అంటూ గయ్ గయ్ మన్నాడు.

దాంతో స్టెనో చిత్రాంగి మౌత్ లాకయి పోయింది. మళ్ళీ ఎప్పుడు అతడ్ని అలా అడిగిన పాపానపోలేదు. స్టాఫ్‌కు కూడా బుద్ధొచ్చింది.

ఇలా ఏదో ఒకరోజంతా ఏడుస్తూ వుండే కామేశాన్ని ఏడవడం ఆపమనే ధైర్యం కానీ, ఎందుకేడుస్తున్నావని అడిగే సాహసం కానీ ఎవరూ చేయరు. ఒక్క ప్యూన్ పూర్ణానందం తప్ప.

దానికీ రీజన్ వుంది. ప్యూన్ పూర్ణానందం అంటే ఆఫీసులో ఎ -టు- జెడ్ అందరికీ భయమే. అతను స్టాఫ్ పాలిట ఆపద్బాంధవుడు... ఎప్పుడు ఎవరికి ఏ అవసరం వచ్చినా నిమిషాల మీద డబ్బు సర్దుబాటు చేసే విద్య ఒకటి వుంది అతగాడి చేతిలో. చేబదులు అంటే నో అంటాడుగానీ, వడ్డీకి యివ్వమంటే పి.టి. ఉష లెవల్లో పరుగెత్తుకు వస్తాడు.

ఇంతకీ కామేశం ఎందుకు ఏడుస్తున్నాడని ఆరా తీయడానికి పూర్ణానందం రంగంలోకి దిగాడు.

"హలో మిష్టర్ ..కామే.." దగ్గరికి వచ్చి భుజం మీద చేయివేసి పిలిచాడు పూర్ణానందం.

ఓసారి పూర్ణానందం వంక చూసి నానాబూతు సమితి పంచాంగం విప్పాలనుకున్నా, అతనికి తను యివ్వాల్సిన బాకీ గుర్తుకొచ్చి కోపాన్ని దిగమింగుకుంటూ ఏడుపును కంటిన్యూ చేసేసాడు.

"సీ మిష్టర్ కామే... నువ్విలా ఆఫీసులో ఏడుపు దుకాణం పెట్టడం ఏమీ బాగాలేదు. ముందు ఏడుపు ఆపి అసలు విషయం కక్కు. లేదా.. నా అప్పు అణాపైసలతో సహ కక్కు... ప్లస్ వడ్డీతో" వళ్ళు మండి అన్నాడు పూర్ణానందం.

కామేశం ఓసారి పూర్ణానందం వైపు లుక్కేసి "నా ఏడుపు నీకు కామెడిగా అనిపిస్తుందా" అన్నాడు ఉక్రోషంగా.

"పోనీ ...సీరియస్ మేటరేంటో చెప్పు" అనునయంగా అన్నాడు.

"చెప్పమంటావా పూర్ణా" అన్నాడు కామేశం.

అబ్బ...నువ్వు పూర్ణా అని పిలుస్తుంటే చెవుల్లో యాసీడ్ పోసినట్టు వుంటుంది. పూర్ణానందం అని పూర్ణానందంతో పిలువు" అన్నాడు పూర్ణానందం.

"అలాగే పూర్ణా ఆనందం" ...అంటూ కళ్ళు తుడుచుకొని "ఓ వంద అప్పివ్వు..క్యాంటిన్‌లో కూచోని విషయం చెబుతాను" అన్నాడు.

"నీ ఏడుపుకు అంత సీన్ వుందా? సర్లే...ఇంద వంద" అంటూ జేబులో నుంచి వంద కాగితం ఒకటిచ్చి అతన్తో పాటు క్యాంటిన్ వైపు నడిచాడు.

* * * *



"ఏం చెప్పమంటావు పూర్ణానందం.. నా బ్రతుకు బ్రష్ మీద పేస్ట్ అయింది" చెప్పాడు కామేశం బాధగా.

"అదేంటి ..కొంపదీసి మీ ఆవిడ.... పోయిందా ...గాయబ్......యిట్స్‌గాన్?"

'ఛ.......ఛ.... అదికాదు"

"మరేది.. తొందరగా చెప్పు...సస్పెన్స్ భరించలేకపోతున్నాను" అన్నాడు పూర్ణానందం.

"నీకు తెలుసుగా నాకు అమ్మాయిలంటే మహాయిది అని" అన్నాడు సిగ్గు పడుతూ కామేశం.

"ఎందుకు తెలియదు ...ఒక్క ఆఫీసులో లేడీ స్టాఫ్‌ని వదిలేసావుగానీ... నీలో బోల్డు కళ వుంది. సార్ధక నామధేయుడివి కదా... ఎప్పుడూ అమ్మాయి కనిపిస్తుందా? అని చొంగ కార్చుకుంటూ కూచుంటావుగా" అక్కసుగా అన్నాడు.

"ఏంటో నువ్వు మరీ నన్ను యిబ్బంది పెట్టేస్తున్నావు" సిగ్గులొలకబోస్తూ చెప్పాడు.

"నేను అన్ని విషయాల్లోనూ ఫ్రాంక్ అని నీకు తెలుసు కదా... అందుకే ఏవిషయం అయినా సరే మా ఆవిడతో చెబుతాను".

పూర్ణానందం ఓసారి కామేశం క్యారెక్టర్‌ని కళ్ళముందు నిలుపుకున్నాడు.

కామేశం ఆడవాళ్ళను కామెంట్ చేయడంలో సిద్ధహస్తుడు. అమ్మాయిలంతా తనకోసం క్యూకడుతున్న బిల్డప్ యిస్తాడు. అసలు విషయంకన్నా నోటిదూల ఎక్కువ. ..మాధురీ దీక్షిత్‌కు నేనంటే యిష్టమని... శ్రీదేవి ఒకప్పుడు నన్ను పెళ్ళి చేసుకుంటాననంది అని చెప్పే టైప్.

"పూర్ణానందం... పూర్ణానందం"..కామేశం పూర్ణానందాన్ని పట్టి కుదిపాడు.

"చెప్పు కామేశం ..అసలు ఏమైంది?"

"నా బ్రతుకు కొసరు అయింది. వన్స్ అపానే టైం... ట్యాంక్‌బండ్‌లో బుద్ధవిగ్రహం అయింది.. మూసీనది పక్కన వున్న మురిక్కాలువ అయింది".

"అబ్బ..అసలు సీన్‌లోకి వచ్చేయ్"

"ఓసారి సీలింగ్ ఫ్యాన్ వంక చూడు" అన్నాడు కామేశం తల పైకెత్తి.

"ఓహో...ఇప్పుడు ఫ్లాష్ బ్యాక్ లోకి వెళ్ళాలన్న మాట" అంటూ సీలింగ్ ఫ్యాన్ వంక చూసాడు. కరెంటు లేకపోవడం వల్ల సీలింగ్ ఫ్యాన్ తిరగడం లేదు.

"ఛ్చ...సీలింగ్ ఫ్యాన్ తిరగడం లేదు... "ఇప్పుడెలా నీకు ఫ్లాష్ బ్యాక్ చెప్పడం" బాధగా అన్నాడు కామేశం.

పూర్ణానందం తన మోకాల్లో వున్న మెదడును తట్టిలేపి 'అయిడియా' అన్నాడు

"ఏమిటది?" అన్నట్టు చూసాడు కామేశం.

పూర్ణానందం జేబులో సిగరెట్ తీసి వెలిగించి పొగను రింగులు రింగులుగా వదులుతూ "ఇప్పుడు చెప్పు ఫ్లాష్ బ్యాక్" అన్నాడు.

కామేశం తెగ సంతోష పడిపోయి ఫ్లాష్ బ్యాక్ మెదలెట్టాడు.

"ఏవండీ..." పిలిచింది మిసెస్ కామేశం మొగుడ్ని

"ఏంటీ... బాత్రూంలో వున్నాను..ఒక్క క్షణం" అంటూ టవల్‌ని అడ్డంగా చుట్టుకొని వచ్చాడు. "ఎవరో అమ్మాయి ... మీకు 'డ్రా'లో ఏదో ప్రైజ్ వచ్చిందంట. హోటల్‌లో పార్టీ వుందిట. ఫ్యామిలితో రమ్మంది" చెప్పింది మిసెస్ కామేశం.

వెంటనే కామేశం స్టైయిల్‌గా రిసీవర్ అందుకొని 'యస్..కామేశం దిస్‌సైడ్' అన్నాడు అవతల ఆ అమ్మాయి వగలు పోతూ ఒయ్యారాలు అన్నీ ఫోన్‌లోనే చూపిస్తూ ఇన్వయిట్ చేసింది. వాళ్ళేదో 'డ్రా' పెట్టారని.... అందులో కామేశానికి ప్రైజ్ వచ్చిందని ..సాయంత్రం టీ పార్టీకి ఇన్వయిట్ చేసి, వాళ్లిచ్చే గిఫ్ట్ తీసుకువెళ్ళమని కోరింది.

ఆ సాయంత్రం భార్యను స్టార్‌హోటల్ కు

తీసుకువెళ్ళాడు. స్టార్ హోటల్‌కు వెళ్ళగానే ఓ అమ్మాయి ఎదురొచ్చి ఓ గులాబీ పువ్వు ఇచ్చి... (చెవిలో పువ్వెట్టిన సంగతి సరేసరి) "వెల్‌కమ్ సార్" అంది.

కామేశం భార్య వంక చూసి, 'సీ..మై.. గ్లామర్..' అన్నాడు స్టైయిల్‌గా!

ఆ అమ్మాయి ఓ రిసార్ట్స్‌కు చెందిన ఉద్యోగి. కామేశాన్ని పర్సనల్‌గా అటెండై తమ రిసార్ట్స్ ఎక్కడెక్కడున్నాయో చెబుతూ... ఏయే ఫెసిలిటీస్ వున్నాయో వివరిస్తూ మధ్య మధ్యలో టచ్చింగులు యిస్తోంది. ఇదంతా మిసెస్ కామేశం చూస్తూనే వుంది.

చివరాఖరికి ఫైనల్‌గా తమ రిసార్ట్స్‌లో సభ్యత్వం సమ్మతం అని అక్షరాలా అయిదు వేలు నొక్కేసింది. అంత డబ్బు లేదంటే చెక్కు ఇచ్చినా సరేనంది.

* * * *

ఇంటికొచ్చాక మిసెస్ కామేశం ఇంతెత్తున గయ్‌మంది. "ఓ అమ్మాయి పళ్ళికిలించి వగలుపోతే....అయిదువేలు కడతారా?" అని అయిదుగంటలపాటు క్లాసు పీకింది.

"పిచ్చి వైఫ్... నీకు కుళ్ళు...జెలసీ...నీ భర్త గ్లామర్ అది. నేనంటే ఆ అమ్మాయేకాదు... ఏ అమ్మాయికైనా ఇదే... ఇంచుమించు... నేను శ్రీకృష్ణుడి లాంటివాడిని" అంటూ తనను తాను కాంప్లిమెంటిచ్చుకున్నాడు.

ఓసారి కామేశం సినిమాకు వెళ్తున్నాడు. కామేశం ఓవర్ మేకప్ చూసి అమ్మాయిలు పదేపదే చూస్తుంటే అదంతా తన గ్లామర్ మహిమేనని చెప్పుకున్నాడు.

రాత్రిళ్ళు భార్య చెవి దగ్గర చేరి ఈ రోజు ఎందరు అమ్మాయిలు తన వంక చూసింది. ఎంత మంది తనని ఐలవ్యూ అన్నది చెబుతూ వుంటాడు. కామేశం వర్సుచూసి కాస్త వయ్యారాలు వలకబోసే అమ్మాయిలను అతను ఈ విధంగా ఊహించుకుంటున్నాడు. అక్కడితో ఆగిపోతే కథ ఇంకేముంది?

ఇటీవల కామేశం జబ్బు అతని భార్యకు పట్టుకున్నట్టుంది. ఓ రోజు సినిమాకు వెళ్తుంటే ఎదురుగా వస్తోన్న ఓ శాల్తీ వంక చూసి నవ్వింది మిసెస్ కామేశం. ఆ జీవుడు ఫ్లాటయి వెంటనే దవడలు నొప్పెట్టేలా పావుగంటసేపు చిరునవ్వు చిందించాడు.

"చూసారా...నా గ్లామర్... ఆ అబ్బాయి నా వంకే చూసి నవ్వుతున్నాడు" అన్జెప్పింది మొగుడికి. "వెనక్కాల వేరెవర్నో చూసి నవ్వుంటాడులే" అన్నాడు కామేశం.

మరోసారి హోటల్‌కి వెళ్లినపుడు మేనేజర్ వైపు కేసి చిరునవ్వు విసిరి, బేరర్‌తో మాటలు కలిపింది. వాళ్ళు తెగ హేపీగా ఫీలయ్యారు. బేరర్ నాలుగు.. చట్నీలు.. రెండు సాంబార్లు, ఫ్రీగా తెస్తే మేనేజర్ అసలు బిల్లే క్యాన్సిల్ చేసేసాడు.

"ఇప్పుడేమంటారు? సీ.. మై గ్లామరు" అంది మిసెస్ కామేశం.

"హవ్వ..హవ్వ....హవ్వ హవ్వ.." అంటూ బుగ్గలు నొక్కుకున్నాడు.

ఆ రాత్రంతా కామేశానికి నిద్రలేదు. ఆ క్షణం లగాయిత్తు మిసెస్ కామేశం రెచ్చిపోయింది. ఆమెను పట్టడానికి కామేశానికి కష్టమైంది.

ఓ రాత్రి కలవరిస్తూ.."ఏయ్ పవన్ ఏంటీ అల్లరి... తరుణ్... ఏంటా లుక్కు...హృతిక్కు... నువ్వెప్పు డొచ్చావు.....నాకోసం సుజాని వదిలొచ్చావా? ఐ పిటీ యూ"... అంటూ మొదలెట్టిందామె.

ఏమీ చేయలేక.. గడ్డంపెంచి... ఓ రోజు కాళ్ళబేరానికి వచ్చాడు. "ఒసే.. నువ్వు టాప్‌టెన్ పతివ్రతల్లో వుండాల్సినదానివే! అలా అనకూడదే.." అంటూ బ్రతిమిలాడాడు.

కానీ ఆమె వినటం లేదు.

* * * *

అదీ జరిగింది. పూర్ణానందంతో ఫ్లాష్ బ్యాక్ చెప్పి బావురుమన్నాడు కామేశం.

"చెల్లాయి భలే ట్రీట్‌మెంట్ యిచ్చింది. పోనీలే ఇకనైనా బుద్ధిగా వుండు. పిచ్చివాగుడు మానేయి. ఇదంతా టిట్‌ఫర్‌టాట్ అన్నట్టు చేసివుంటుంది. ఓ చీర కొనుక్కెళ్లి సంధి చేసుకో.." ఓదార్చాడు పూర్ణానందం.

"అయితే అర్జంటుగా మరో అయిదొందలు అప్పివ్వు..మా ఆవిడకు చీర కొనుక్కెళ్తాను. జేబు బరువు పెరిగితే గుండె బరువు తగ్గుతుంది." అన్నాడు.

పూర్ణానందం అయిదొందలు కామేశానికి యిచ్చాడు. కామేశం వెళ్ళిపోయాక కాస్సేపటికి తన జేబులో వున్న సెల్‌ఫోన్ తీసి.."చెల్లెమ్మా..నీ ట్రీట్‌మెంట్ అదుర్స్....మీ ఆయన మారిపోయాడు, ఆల్ ది బెస్ట్" అన్నాడు మిసెస్ కామేశంతో ఆవేశంగా.

"థాంక్స్ అన్నయ్యా... ఇదంతా నీ సలహా వల్లే... నువ్వు వడ్డీకి అప్పులిచ్చే కాబులీ టైప్ అనుకున్నాను. సలహాలిచ్చి కాపురాలు నిలబెట్టే... గొప్పవాడివనుకోలేదు." మనస్ఫూర్తిగా చెప్పింది మిసెస్ కామేశం.

కానీ ఆమెకు తెలియదు - అదే సమయంలో బట్టలకొట్టులో సేల్స్ గర్ల్ నవ్వు చూసి చిత్తయిపోయిన కామేశం అక్కడ కొన్న ఐదువందల చీరా ఆ అమ్మాయికే బహూకరిస్తున్నాడని!


## మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




విడుదల : సూర్య మ్యూజిక్ వెల : రూ.25/-




విడుదల : ఆదిత్య మ్యూజిక్
వెల : రూ.40/-

రచన : ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల

విశ్వం : ఇది మన భారతీయ శిల్పకళా వైభవము
ఇది మన ప్రాచీన నాగరికతా చిహ్నము
ఇది మానవతకే స్వర్ణయుగము....
విశ్వం : ఆనాటి మానవుడు ఏమి చేశాడు
ఈనాటి మానవుడు ఏమి చూశాడు
శిలలలో జీవకళ పోశాడు వాడు
శారద : జీవితాన్నే కళగ చేశాడు వీడు ॥ఆనాటి॥
విశ్వం : మంచినే ఎంచి మనసునే పెంచి
మనిషి దేవుడుగా మారజూశాడు
శారద : నాటి అందాలన్ని రాతిలో చెక్కి
తీరని కోరికలె తీర్చుకున్నాడేమో ॥ ఆనాటి॥
విశ్వం : మానవుల కన్నీరు మాన్పగా నెంచి
మహరాజు భిక్షువై బయలుదేరాడు
కోరస్ : బుద్ధం శరణం గచ్ఛామి... ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి...
శారద : మనసునిచ్చిన మగువ మమత కన్నీరుగా
పారించి అడవులకు పారిపోయాడు ॥ఆనాటి॥

రచన : ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల

శారద : కనులు కనులతో కలబడితే ఆ
తగవుకు ఫలమేమి?
విశ్వం : కలలే...
శారద : నా కలలో నీవే కనబడితే ఆ
చొరవకు బలమేమి?
విశ్వం : మరులే...
శారద : మరులు మనసులో స్థిరపడితే ఆ
పై జరిగేదేమి?
విశ్వం : మనువు...
శారద : మనువై ఇద్దరు ఒకటైతే ఆ
మనుగడ పేరేమి?
విశ్వం : సంసారం... ॥కనులు॥
శారద : అల్లరి ఏదో చేసితిని
చల్లగ ఎదనే దోచితివి
విశ్వం : ఏమి లేని పేదనని
నాపై మోపకు నేరాన్ని
శారద : లేదు ప్రేమకు పేదరికం
నే కోరను నిన్ను ఇల్లరికం
విశ్వం : నింగి నేలకు కడుదూరం
మన ఇద్దరి కలయిక విడ్డూరం ॥కనులు॥

రచన : ఆత్రేయ    గానం : ఘంటసాల, సుశీల

శారద : ఏనాటికైనా - ఏ జన్మనైనా
నీ తోడు వీడగ - నీ చేయి వీడక
నీ అడుగు జాడలే - అనుసరిస్తాను
విశ్వం : కన్నులు నీవేకావాలి
కలనై నేనే రావాలి
శారద : కవితే నీవై పురకాలి
కావ్యం నేనై నిలవాలి ॥కన్ను॥
శారద : మనసు నేనై వుండాలి
మమత నీవై నిండాలి
విశ్వం : కడలి నేనై పొంగాలి
నదివి నీవై చేరాలి
నదివి నీవై చేరాలి ॥కన్ను॥
విశ్వం : తొలకరి నీవై చిలకాలి
మొలకను నేనై మొలవాలి
శారద : దైవం నీవై నడవాలి
ధర్మం నేనై నడవాలి
ధర్మం నేనై నడవాలి ॥కన్ను॥
విశ్వం : శిల్పం నీవై కల్పన నేనై
చిరకాలం జీవించాలి
శారద : చెఱగని మారని శిలాక్షరాలై
చిరంజీవులం కావాలి ॥కన్ను॥

రచన : ఆత్రేయ    గానం : జమునారాణి, వసంత, స్వర్ణలత , యల్.ఆర్.ఈశ్వరి

కొత్తపెళ్లికూతురా రా రా
నీ కుడికాలు ముందు మోపి రా రా
గుణవతి కులసతి రా రా
నువు కోరుకున్న కోవెలకు రా రా ॥కొత్త॥
కలిమికి కాణాచి నీ పుట్టినిల్లు
చెలిమికి మాగాణి నువు మెట్టినిల్లు
ధనమున్నది బలమున్నది నీ ఇంట
మనసున్నది మమతున్నది మా ఇంట ॥కొత్త॥
పై మెరుగులు పైడి నగలు లేవు ఇక్కడ
పంతాలు సాధింపులు రావు ఇక్కడ
నిండుమనసు చిరునగవు పండు నిక్కడ - ఆ
పండువెన్నెలందు దినం పండుగిక్కడ ॥కొత్త॥
కన్నతల్లి కన్న మిన్న నీ అత్తగారు
కనిపించే దైవము చేకొన్నవాడు
కలలన్నీ నిజమౌ నీ కాపురాన
కలకాలం వెలుగు నీ ఇంటిదీపము ॥కొత్త॥

రచన : ఆత్రేయ    గానం : ఘంటసాల

విశ్వం : వలపువలె తీయగా
వచ్చినావు నిండుగా
మెఱుపువలె తళుకుమని
మెఱిసిపోయెటందుకా
వలపువలె తీయగా
వచ్చినావు నిండుగా
తడబడు నడకల నడచినపుడు నీ
తత్తరపాటును చూడాలి
తలుపు మూయగనె దారులువెదకే
బిత్తర చూపులు చూడాలి
అని తలచి తలచి ఈ తరుణం కోసం
తపసుచేసినది ఇందులకా
వలపువలె తీయగా
వచ్చినావు నిండుగా
మురిపెములొలికె ముద్దుమోమును
కురుల మబ్బులో దాచుటకా
మిసమిసలాడే నొసటి కుంకుమ
చిరుచెమటలలో కరగుటకా
ఎదనుతెఱచి నేనిన్నినాళ్లుగా
ఎదురుచూచినది ఇందులకా
వలపువలె తీయగా
వచ్చినావు నిండుగా

రచన : ఆత్రేయ గానం : పి. బి. శ్రీనివాస్,జానకి

అతడు : ఏవేవో చిలిపి తలపులురుకుతున్నవి
అవి ఎలా ఎలా చెప్పాలో తెలియకున్నది
ఏవేవో.....

ఆమె : ఏవేవో వలపు తలపులురుకుతున్నవి
అవి ఎలా ఎలా చెప్పాలో తెలియకున్నది
ఏవేవో.........

అతడు : కురులలోన మల్లెపూలు కులుకుచున్నవి
అరవిరిసిన పడుచుతనం పిలుచుచున్నది

ఆమె : మరపురాని తొలిరేయి మరల రానిది
మగువ జీవితాన ఇదే మధురమన్నది
ఏవేవో చిలిపి తలపులురుకుతున్నవి
అవి ఎలా ఎలా చెప్పాలో తెలియకున్నది
ఏవేవో.....

అతడు : ఒక్క క్షణం

ఆమె : ఆ హో హో

అతడు : ఒక్క క్షణం జారిపోతే దక్కదన్నది
కాలానికి బిగి కాగిలి కళ్లెమన్నది

ఆమె : కన్నె మనసు ఏవేవో కలలు కన్నది
ఆ కలల రూపు ఈ రేయే కాంచనున్నది

అతడు : ఆహో!

ఆమె : ఓహో! ॥ఏవేవో॥

అతడు : తీయనైన తలపు లేవో ముసురుకొన్నవి
తీసియున్న తలపులను మూయమన్నది

ఆమె : మనసుతోటి తనువుకూడ నీది కానున్నది
మనుగడ ఈ నాటితో మనది కానున్నది ॥ఏవేవో॥

రచన : ఆత్రేయ గానం : ఘంటసాల

విశ్వం : సిగలోకి విరులిచ్చి
చెలినొసట తిలకమిడి
సిగపూవు వాడకనే
చెలిబ్రతుకు వాడెనయ్యా
పరువానికి బలవంతాన
పగ్గాలే వేస్తావా
మనసుమూసి మమతలు రోసి
మనుగడ మసి చేస్తావా
తనువు చిక్కి శల్యంబైనా
వలపులణిగి పోయేనా
ఇరవైలో అరవై వయసు
ఎవరికైన వచ్చేనా
ఎరికైన వచ్చేనా ॥సిగ॥
తీయనైన జీవితాన
చేదువిషం తాగేవా
తోడునీడగా ఒకరుండి
ఏకాకిగ బ్రతికేవా
కోరినది చేతికిచిక్కి
ఆరుతున్నదొక దీపం
కోరినది చేతికిరాక
ఆరకున్నదొక తాపం
ఆరకున్నదొక తాపం ॥సిగ॥
అంధుని ఎదుట అందాలేలా
అడవిని పున్నమి వెన్నెలలేలా
అసమర్థున కవకాశాలేలా
వృధా.. వృధా.. ఈ బ్రతుకు వృధా......

## తారాగణం

నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, గిరిజ, పద్మనాభం, వాసంతి, జి.వరలక్ష్మి, నాగయ్య, సంధ్య, శోభన్‌బాబు, జయంతి, మొ॥వారు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : కె.ఎస్.గోపాలకృష్ణ |
| మాటలు,పాటలు | : ఆచార్య ఆత్రేయ |
| సంగీతం | : కె.వి. మహాదేవన్ |
| నృత్యం | : ఎ.ఎస్. గోపాలకృష్ణ |
| కళ | : జి.వి. సుబ్బారావు, బి.ఏ. |
| సాంగ్స్ రికార్డింగ్ | : వి. శివరాం, బి.ఏ.,బి.ఎస్‌సి. |
| రీ- రికార్డింగ్ | : డబ్ల్యూ. నరసింహమూర్తి, ఎల్.సి.అండ్ ఎస్.ఇ |
| మాటలు | : జి.జి.కె. గోఖలే |
| ఔట్ డోర్ | : రామచంద్రరావు |
| ఎడిటింగ్ | : టి.కృష్ణ,బి.ఏ. |
| ఫొటోగ్రఫీ | : ఎ.ఎల్.రాయ్ |
| కెమెరా | : కె.ఎస్.రామకృష్ణరావు, ఎల్.సి.అండ్ ఎస్.ఇ |
| ప్రాసెసింగ్ | : ఎస్. రాజన్న |
| స్టూడియో | : శ్రీ సారథి |
| నిర్మాణ నిర్వహణ | : టి.ఎస్. బాలు |
| సహాయదర్శకుడు | : ఘంటసాల చిరంజీవి |
| సహకార దర్శకుడు | : జి. కబీర్‌దాస్ |
| అసోసియేట్ ప్రొడ్యూసర్ | : టి.వి. ఎస్. శాస్త్రి |
| దర్శకుడు | : ఆదుర్తి సుబ్బారావు |
| నిర్మాత | : టి. గోవిందరాజన్ |


ఆదుర్తి సుబ్బారావు


ఆత్రేయ


మహదేవన్


ఘంటసాల


సుశీల


జమునారాణి


యల్.ఆర్.ఈశ్వరి


స్వర్ణలత


వసంత



# సంగీత సామ్రాజ్ఞి ఎమ్మెస్ సుబ్బులక్ష్మి

సెప్టెంబరు 16, 1916న మధురైలో జన్మించిన కుంజమ్మ (ఆమె ముద్దుపేరు) ఎమ్మెస్ సుబ్బులక్ష్మిగా విశ్వవిఖ్యాతురాలై 88 వ యేట డిసెంబరు 11, 2004న గంధర్వలోకానికి తరలివెళ్లారు.

దక్షిణపథాన అనేక గృహాలలో తెల్లవారేది సుబ్బులక్ష్మి పాటలతోనే! వేంకటేశ్వర సుప్రభాతం, విష్ణుసహస్రనామాలు, భజగోవింద శ్లోకాలు - ఏవైనా కానీయండి, పాడేటప్పుడు ఆవిడ గొంతులో భక్తి జాలువారుతుంది. భగవంతునితో అనుసంధానం చేసుకోవడానికి సంగీతప్రియునికి అతి సులభమైన మార్గం, సుబ్బులక్ష్మి గానం ఆలకించడం!

"హరీ తుమ్ హరో' అనే మీరా భజన నీ నోటితోనే వినాలి. నీ గానం వింటే భగవంతుని సన్నిధికి చేరుకున్నట్టే అనిపిస్తుంది." అన్నారు జాతిపిత బాపూజీ.

"ఆ సంగీత సామ్రాజ్ఞి ముందు నేనెంత?.. కేవలం ప్రధానమంత్రిని మాత్రమే.." అన్నారు పండిత జవహర్‌లాల్ నెహ్రూ.

"నా నైటింగేల్ ఆఫ్ ఇండియా' బిరుదు నీకు ఇచ్చేస్తా." అన్నారు సరోజినీ నాయుడు.

"సుబ్బులక్ష్మి కచేరీ అయిన వెంటనే నా ఆర్కెస్ట్రానా? 150 మంది వాద్యకారులున్నా నా ఆర్కెస్ట్రా ఫ్లాప్ అవడం ఖాయం" అన్నారు జుబిన్ మెహతా.

"స్వరకోకిల.. సాటిలేని సంగీత విద్వాంసురాలు." అని కవిత ఆలపించారు అబ్దుల్ కలామ్.

ఎందరో జాతీయ నాయకులు ఆమె అభిమానులు కావడంతో కర్ణాటక సంగీతానికి ప్రతీకగా ఆమె పేరు దేశమంతా మారుమ్రోగింది. 1966లో ఐక్యరాజ్యసమితిలో కచేరీ చేసి, భాష తెలియనివారిచే సైతం జేజేలందిన సంగీతరాజ్ఞి ఆమె.

పద్మభూషణ్ (1954), పద్మవిభూషణ్ (1975), మెగసెసే అవార్డు (1974) దేశంలోనే అత్యుత్తమ పురస్కారం 'భారతరత్న' (1996) - ఇలా ఎన్ని అవార్డులు పొందినా అహంకారం, భేషజం ఎరుగని వినయశీలి, వితరణశీలి - సుబ్బులక్ష్మి.

అప్పటివరకు మగవాళ్లే రాజ్యం ఏలుతున్న మద్రాసులోని సంగీత అకాడెమీనుండి 'సంగీత కళానిధి' అవార్డు చేజిక్కించుకున్న ఏకైక మహిళ సుబ్బులక్ష్మి. ఈ ప్రస్థానంలో ఆమెకు గురువు, మార్గదర్శి - భర్త సదాశివమే! 55 ఏళ్ల వైవాహిక జీవితానంతరం 1977లో ఆయన మరణించిన తర్వాత సుబ్బులక్ష్మి కచేరీలు మానుకున్నారు.

ఆమె తల్లి షణ్ముగవడివు ఆదాయం పెద్దగా లేని వీణ విద్వాంసురాలు. లాయర్‌గా ప్రాక్టీసు చేసే తండ్రి జి.సుబ్రహ్మణ్య అయ్యర్ వద్ద ఆమె భక్తిసంగీతం నేర్చుకుంది. చదువు మధ్యలోనే ఆగిపోయింది. ఓ బైరాగి ఆమెకు సంస్కృత శ్లోకాలు నేర్పాడు. శ్రీనివాస అయ్యంగార్ వద్ద సంగీతపాఠాలు సాగుతూండగానే ఆయన చనిపోయాడు.

వేదికపై తల్లి వీణ వాయిస్తూవుండగా ఆమె పక్కన చేరి పాట పాడేది. ఆమె వీణ రికార్డు చేయడానికి వచ్చిన గ్రామఫోను కంపెనీవారు



సుబ్బులక్ష్మి, సదాశివం



ఢిల్లీ యూనివర్శిటీ నుండి డాక్టరేట్...



సరోజినీనాయుడు, నెహ్రూలతో...

సుబ్బులక్ష్మి గాత్రానికి ముచ్చటపడి 'మరకతవడివం' అనే భక్తిగీతం ఆమెచే పాడించారు. ఆ రికార్డుపై ఆమె పేరు 'మిస్ షణ్ముగవడివు' గా నమోదయింది.

కచేరీలు చేస్తూనే క్రమంగా ఆమె సీనియర్ సంగీతవిద్వాంసుల ఆదరాన్ని చూరగొంది. దక్షిణామూర్తి పిళ్లయ్ వాళ్లింట్లో పెళ్లిపందిట్లో పాడమని ఆహ్వానించడమే కాదు, అనేకమంది సంగీతప్రముఖుల ఎదుట ప్రశంసించాడు.

మరిందరు పెద్దల కంట పడితే కూతురికి మరింత గుర్తింపు వస్తుంది కదని 1930లో ఆమె తల్లి మద్రాసుకు కాపురం మార్చింది. ఆనంద వికటన్ పత్రిక తరఫున ఆమెను కలవబోయిన సదాశివం ఆమెకు కొండంత అండగా కనిపించాడు. 16 యేళ్ల వయసులో 34 ఏళ్ల సదాశివంను పెళ్లాడింది. అప్పటికే ఆయనకు ఇద్దరు కూతుళ్లు. బోల్డంత కుటుంబభారం.

పెళ్లయ్యాక సదాశివం ఉద్యోగం పోయింది. "మీరు దారిచూపితే నెలకు వంద రూపాయలు నేను గడిస్తాను." అంది ధైర్యలక్ష్మి. తనకు సంతానం కలగకపోయినా సవతికూతుళ్లను స్వంతం చేసుకుంది సంతానలక్ష్మి. 'సేవాసదనం', 'శకుంతలై' సినిమాలలో నటించి నటన



విరమించుకున్నా దేశసేవకై పత్రిక పెడతానంటే భర్తకు నిధులు సమకూర్చేందుకు 'సావిత్రి' సినిమాలో నటించింది ధనలక్ష్మి.

ఆమె నటించిన ఆఖరిచిత్రం 'మీరా'. మీరా పాత్రలో లీనమై ఆమె పాడుతూంటే ఆ సినిమాకు దర్శకత్వం వహించిన అమెరికన్ డైరక్టర్ ఇ.ఆర్.డంకన్ ఆనందం పట్టలేక విలపించేవాడు! ఆ సినిమా అఖండ విజయం సాధించింది.

పదిభాషల్లో పాడిన ఆ నిరంతరాభ్యాసి అర్థం తెలుసుకుని పాడాలన్న నియమం పెట్టుకుని సంస్కృతం నేర్చుకున్నారు. చివరివరకూ సుబ్బులక్ష్మి విద్యాభ్యాసం కొనసాగింది. గాంధీ కోరికపై ఓ పాటను రెండురోజుల్లో నేర్చుకున్నారు. హిందుస్తానీ గాయకురాలు సిద్దేశ్వరీ దేవిని అభ్యర్థించి, 6 నెలలపాటు తమ ఇంట్లో పెట్టుకుని ఆమె వద్ద ఠుమ్రి, భజన్, ఛోటా ఖయాల్ నేర్చుకున్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారికై అన్నమాచార్య కృతులు పాడడానికి ఎంతో కృషి చేశారు. 70 వ యేట కూడా కొత్త పాటలను పాడేందుకు సాధన చేసేవారు.

ఆమె సవతికూతురు రాధా విశ్వనాథన్, సుబ్బులక్ష్మికి వేదికమీదే కాదు, ఇంట్లోనూ అక్షరాలా సహచరి. మూర్తీభవించిన సంప్రదాయం అనిపించే సుబ్బులక్ష్మి అత్యంత ఉదారస్వభావురాలు. ఎన్నో సంస్థలకు విరాళాలు ఇచ్చారు. సేవా కార్యక్రమాలకు విరాళాలు సేకరించే నిమిత్తం ఎన్నో కచేరీలు ఉచితంగా పాడారు. నవంబరు 30 నుండి బ్రాంకో న్యూమోనియా వ్యాధితో బాధపడుతూ గత పదిరోజులుగా ఆసుపత్రిలో ఉన్న ఆమె డిసెంబరు 11న తుదిశ్వాస విడిచి సంగీతాభిమానులను శోకసముద్రంలో ముంచారు.

'హాసం' ఆమెకు అంజలి ఘటిస్తున్నది.



'సావిత్రి'లో



'మీరా'లో...



'శకుంతలై'లో...

# 'సరిగపదమని' విజేతల వివరాలు

సరిగపదమని-9

మొదటి బహుమతి: యన్.లక్ష్మినీలిమ, శ్రీకాకుళం.
రెండవ బహుమతి: ఎస్.ఎన్.సి.శ్రీవల్లి, ఖమ్మం.
మూడవ బహుమతి: అద్దంకి శ్రీరామచంద్రమూర్తి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: యశ్వంతరావు శేషగిరిరావు, జయ్‌పూర్(ఒరిస్సా).

సరిగపదమని-10

మొదటి బహుమతి: జి.విజయలక్ష్మి, హైదరాబాద్.
రెండవ బహుమతి: టి.సూర్యశ్రీ, హైదరాబాద్.
మూడవ బహుమతి: కె.వి.ఎన్.కుసుమలత, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: జి.ఆనందరావు, విజయవాడ.

సరిగపదమని-11

మొదటి బహుమతి: వడ్లమన్నాటి నాగసాయి భరద్వాజ్, విజయవాడ.
రెండవ బహుమతి: యల్లాప్రగడ ఇందిరాజ్యోతి, హైదరాబాద్.
మూడవ బహుమతి: టి.వి.ఎస్.శాస్త్రి, గుంటూరు.
కన్సొలేషన్ బహుమతి: ఎమ్.వి.ఎస్.ఎన్.శాస్త్రి, విజయవాడ.

సరిగపదమని-12

మొదటి బహుమతి: ఎ.పురుషోత్తం రావు, గజ్వేల్(మెదక్‌జిల్లా).
రెండవ బహుమతి: తాతిరాజు మోహన్ రావు, విశాఖపట్నం.
మూడవ బహుమతి: ఎన్.గాయత్రిదేవి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: వరయోగి రామ్‌మోహన్‌రావ్, సికింద్రాబాద్.

సరిగపదమని-13

మొదటి బహుమతి: పురుషోత్తపట్నం నాగరాజు, గుంటూరు.
రెండవ బహుమతి: సి.హెచ్.సూర్యారావు, చీపురుపల్లి(విజయనగరంజిల్లా).
మూడవ బహుమతి: వి.సాయిఅనురాధ, నెల్లూరు.
కన్సొలేషన్ బహుమతి: ఇ.తేజస్విని, చిత్తూరు.

సరిగపదమని-14

మొదటి బహుమతి: యడ్లపల్లి చంద్రశేఖర్, తెనాలి.
రెండవ బహుమతి: గుడ్లరాజు, కామారెడ్డి(నిజామాబాద్‌జిల్లా).
మూడవ బహుమతి: సంజీవ్‌కుమార్, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: టేకుమళ్ళ సాయివినీత్, నెల్లూరు.

సరిగపదమని-15

మొదటి బహుమతి: కె.వి.దుర్గామోహనరావు, నల్గొండ.
రెండవ బహుమతి: డి.సబిత, హైదరాబాద్.
మూడవ బహుమతి: గన్నవరపు విజయదుర్గ, వరంగల్.
కన్సొలేషన్ బహుమతి: ఓగిరాల అంజని, నెల్లూరు.

సరిగపదమని-16

మొదటి బహుమతి: ఉప్పాల్ మోహన్‌బాబు, అవనిగడ్డ(కృష్ణాజిల్లా).
రెండవ బహుమతి: కర్రిరిఘూన్సీ, హైదరాబాద్.
మూడవ బహుమతి: జి.జయచంద్రగుప్త, కర్నూలు.
కన్సొలేషన్ బహుమతి: చందలూరి రాజాకృష్ణప్రసాద్, కాకినాడ.

సరిగపదమని-17

మొదటి బహుమతి: పాణ్యం ప్రత్యూష, ఎర్నాకులం(కేరళ).
రెండవ బహుమతి: మాణిక్యాల మల్లేశ్వరమ్మ, హైదరాబాద్.
మూడవ బహుమతి: సి.హెచ్.సంధ్య, రాజమండ్రి.
కన్సొలేషన్ బహుమతి: ఉషాహరిపంథ్, కొల్‌కటా.

సరిగపదమని-18

మొదటి బహుమతి: ముప్పిరాల శశాంక, హైదరాబాద్.
రెండవ బహుమతి: ఏ.బి.వి.ఎన్.రమేష్, వేలూరు(తమిళనాడు).
మూడవ బహుమతి: సి.ఎన్.విజయ, కడప.
కన్సొలేషన్ బహుమతి: నాగమణి, హైదరాబాద్.

సరిగపదమని-19

మొదటి బహుమతి: ముటుకూరు వసుంధర, హైదరాబాద్.
రెండవ బహుమతి: పి.పాపారావు, విశాఖపట్నం.
మూడవ బహుమతి: వంగా వంశీమోహన్, విజయవాడ.
కన్సొలేషన్ బహుమతి: డి.వర్ష, సికింద్రాబాద్.

సరిగపదమని-20

మొదటి బహుమతి: పేరాల శ్రీవాణి, వైజాగ్.
రెండవ బహుమతి: పి.రాజరాజేశ్వరి, విజయనగరం.
మూడవ బహుమతి: ఎ.మంగప్రణవి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: నేమానసుభాష్‌చంద్రబోస్, శ్రీకాకుళంటౌన్.

సరిగపదమని-21

మొదటి బహుమతి: కె.ఈశ్వర్, నెల్లూరు.
రెండవ బహుమతి: సి.హెచ్.పరాత్పరరావు, ఏలూరు.
మూడవ బహుమతి: జి.పాండురంగశర్మ, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: ఎమ్.డి.లతీఫ్, నాచారం(రంగారెడ్డిజిల్లా).

సరిగపదమని-22

మొదటి బహుమతి: కె.కృష్ణ, జగన్నాథపూర్ (మహబూబ్‌నగర్ జిల్లా)
రెండవ బహుమతి: అవసరాల మహతీ, విశాఖపట్నం.
మూడవ బహుమతి: వేంద్ర స్వాతితేజస్వి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: ఎం.వి.యస్.లక్ష్మి, కాకినాడ.

సరిగపదమని-23

మొదటి బహుమతి: సురభి ఉమాసుశీల, కాకినాడ.
రెండవ బహుమతి: ఎమ్.ఎన్.అచార్య, హైదరాబాద్.
మూడవ బహుమతి: కె.మురళిమోహన్, మార్కాపురం(ప్రకాశంజిల్లా)
కన్సొలేషన్ బహుమతి: పి.నరసింహమూర్తి, హైదరాబాద్.

సరిగపదమని-24

మొదటి బహుమతి: టి.చంచల్‌రావు, హైదరాబాద్.
రెండవ బహుమతి: వేలివెంటి కృష్ణవేణి, నిడదవోలు.
మూడవ బహుమతి: వి.వి.ఎల్.ఎన్.శాస్త్రి, కాకినాడ.
కన్సొలేషన్ బహుమతి: పి.వి.ఎస్.ఎన్.శర్మ, హైదరాబాద్.

సరిగపదమని-25

మొదటి బహుమతి: కె.లక్ష్మి, వైజాగ్.
రెండవ బహుమతి: ముప్పిరాల వెంకటరమణ, హైదరాబాద్.
మూడవ బహుమతి: వి.ఉషారాణి, తిరుపతి.
కన్సొలేషన్ బహుమతి: కె.వి.ఎన్.ఎస్.భగవాన్, రాజమండ్రి.

సరిగపదమని-26

మొదటి బహుమతి: ఎమ్.వి.ఎస్.శాస్త్రి, విజయవాడ.
రెండవ బహుమతి: ఎమ్.అంజిరెడ్డి, ఒంగోలు.
మూడవ బహుమతి: అద్దంకి సీతాదేవి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: ఏలూరు అశోక్‌కుమార్‌రావు, గుర్రంపోడ్(నల్గొండజిల్లా).

సరిగపదమని-27

మొదటి బహుమతి: ఎమ్.కోటేశ్వరరావు, కాశీపూర్ (ఉత్తరాంచల్).
రెండవ బహుమతి: వై.యశోద, వైజాగ్.
మూడవ బహుమతి: కృష్ణవేణి, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: ఎన్.ఎస్.చంద్రబోస్, శ్రీకాకుళంటౌన్.

సరిగపదమని-28

మొదటి బహుమతి: మయూరి రఘు, హైదరాబాద్.
రెండవ బహుమతి: కె.ఎస్.ప్రభ, హైదరాబాద్.
మూడవ బహుమతి: శ్రీనివాస్‌పవార్, ఆర్మూర్(నిజామాబాద్ జిల్లా).
కన్సొలేషన్ బహుమతి: ఆర్.వి.సీతామహాలక్ష్మి, రాజమండ్రి.

సరిగపదమని-29

మొదటి బహుమతి: యడ్లపల్లి చంద్రశేఖర్, తెనాలి.
రెండవ బహుమతి: కె.సీతారామగిరి, కాకినాడ.
మూడవ బహుమతి: ఎన్.జగన్మోహనరావు, కరీంనగర్.
కన్సొలేషన్ బహుమతి: సి.హెచ్.రామ్మోహనరావు, విశాఖపట్నం.

సరిగపదమని-30

మొదటి బహుమతి: టి.వెంకటేశ్వరరావు, మొలకల్‌మురు.
రెండవ బహుమతి: వాస్తురామచంద్ర, నెల్లూరు.
మూడవ బహుమతి: టి.గోపినాథ్, హైదరాబాద్.
కన్సొలేషన్ బహుమతి: చింతాప్రసాద్, విజయవాడ.

సరిగపదమని-31

మొదటి బహుమతి: మంథా సుధాకర్, విశాఖపట్నం.
రెండవ బహుమతి: యల్లపంతుల చందు, శ్రీకాకుళం.
మూడవ బహుమతి: ఎమ్.ఎస్.భట్టచార్యులు, జగ్గయ్యపేట(కృష్ణాజిల్లా)
కన్సొలేషన్ బహుమతి: బి.మంజుళ, నెల్లూరు.

విజేతలకు
నెలరోజులలోపు
బహుమతులు
పంపించబడతాయి.

# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

**స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!**

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మును పెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరపున టీకాల ఉత్పత్తి



అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరపున పరిశోధన

హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...

కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను...
## 'శాంతా'
## టీకాలు కూడా
## తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ
ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం
టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!
శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

Pioneers in r-DNA Based Human Healthcare Products in India

Customised Monoclonal & Polyclonal Antibodies

Recombinant Protein Development, Manufacturing & Formulation

Vaccines, Therapeutic Products & Diagnostics

cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals

Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine

SHANTHA BIOTECHNICS LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com